

పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్మల నరసింహమూర్తి


















అనిక్షణ కాలం సందేహించి - గద్గద కంఠం సవరించుకుని - దీర్ఘముఖుడు ఆ హిరణ్యగర్భునికి సవిస్తరముగా చెప్పదొడగెను.













నామాటలు విని చిత్రవర్ణుడూ - సహృదయంతో సత్కరించెను. - అతని భటులు తమ రాజ్యంలో గల - విశేషాలనూ వినోదాలనూ - చాలసేపు చూపించారు. - తదనంతరము చిత్రవర్ణుడూ - తన దర్బారుకు నను పిలిపించెను









సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.




సంపుటము 40
సంచిక 44
1-7-53

సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

విజయ జ్యేష్ఠ బహుళపంచమి; బుధవారం



డా॥ శ్యామప్రసాద ముఖర్జీ
శ్రీనగర్ జైలులో హృద్రోగంవల్ల మృతిచెందిన జనసంఘ నాయకుడు

# విషయానుక్రమణిక


ముఖచిత్రం:—చిత్రకార్ వారి 'మహూఖా'లో సురయా

కాలక్షేపం-శ్రీదాసు వామనరావు 2

వార—శ్రీమతి సహదేవ తారా దేవి 6

ఎదురు తురపు—శ్రీ గోపాల చక్రవర్తి 11

అశాంతి—శ్రీ జె. రాఘవేంద్ర రావు 12

దత్తత—శ్రీ పినిశెట్టి శ్రీరామ మూర్తి 15

కవిసార్వభౌముడు—శ్రీ జానమద్ది హనుమంతశాస్త్రి 19

పిచ్చిదెబ్బ — శ్రీ గుమ్మళ్ళ వెంకటేశ్వరరావు 20

శునకప్రదర్శనం—క్షేమేంద్ర 23

విజ్ఞాన వీచులు—"డాక్టర్" 26

తప్పిపోయిన పాప—శ్రీనివాస కాశ్యప 30

ముచ్చటగా ముగ్గురు— జెరోమ్ కె. జెరోమ్ 31

పరీక్ష చదువు—శ్రీ కొంపల్లి బ్రహ్మానందరావు 34

బడిగంటలు—శ్రీ పైడిమర్రి వేంకటసుబ్బారావు 36

సినిమా 45

ప్రశ్నలు-సమాధానాలు 52







తెలివి యొకింత లేనియెడ
దృప్తుడనై కరిభంగి సర్వమున్
దెలిసితినంచు గర్వితమతిన్
విహరించితి దొల్లి; యిప్పుడు
జ్వల మతులైన పండితుల
సన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాడనై మెలగితిన్
గతమయ్యె నితాంత గర్వమున్.

తా॥ స్వల్పజ్ఞానముకూడా లేనప్పుడు, నా ప్రజ్ఞకు నేను తృప్తిజెంది యుంటిని. అంతేకాదు, నాకు సర్వమూ తెలిసిపోయిన దన్నంత గర్వంతో అప్పుడు ఏనుగువలె ప్రవర్తించాను. కాని, యిప్పుడు విశేష ప్రజ్ఞావంతులైనటువంటి పండితుల సన్నిధి యందు కొంచెము జ్ఞానప్రబోధం పొందగలిగాను. నాకు యింతవరకూ తెలిసినటువంటి దేమిన్నీ లేదనిన్నీ, నేను చాలా అజ్ఞానంలో ఉన్నాననిన్నీ గ్రహించి ఆ విధంగా ప్రవర్తిస్తున్నాను. వెనుకటి గర్వము అంతా నాకు గతించిపోయింది.

"సర్వమున్ దెలిసితినంచు" విహరించడం కేవలం గర్వమేకాని మరొకటికాదు ఎందుచేతనంటే "సర్వము" తెలిసికొన్నాను అనేవాడు యిక తాను తెలిసికోవలసినది ఏమీ లేదని భావిస్తాడు. కనుక అటువంటి వాని చదువు అంతటితో పూర్తి యైనట్లే. రైలుబండి మద్రాసు సెంట్రలు స్టేషనులో ఆగిపోయినట్లుగా అతని జ్ఞానార్జన అంతటితో ఆగిపోతుంది. కలకత్తానుంచి వచ్చిన మెయిలు బండికి ఆ స్టేషనుతో రైలుప్రయాణం ఆఖరు. ఈ గమ్యస్థానం చేరినతర్వాత ఆ రైలు యిక మరునాడు తిరిగి మద్రాసునుంచి కలకత్తాకు పోవలసి ఉంటుంది. ముందు నడక బంద్ అయినప్పుడు వెనుక నడక సాగించవలసివస్తుంది. ఒక్కొక్కప్పుడు జ్ఞానవికాసమనకున్నా, జ్ఞాన సముపార్జన మనకున్నా, వెనుక నడక సాగించవలసి వస్తుంది. ఎందుచేతనంటే, మన తాతల నాటి వాతశాస్త్రాలు కొన్ని వెర్రికల్పనలనిన్నీ, గాలిలో కట్టబడిన ఊహాసౌధములనిన్నీ, మనం తృణీకరించడం సంభవించింది. శాస్త్రజ్ఞానయుగం అంటే యిదే అనిన్నీ, శాస్త్ర పరిశోధన అంటే యీ కాలంలో మనం చేయుచున్నదే శాస్త్ర పరిశోధన అనిన్నీ, పూర్వకాలంలో జరిగిన శాస్త్ర జిజ్ఞాస అంతా సశాస్త్రీయమైన కృషి కాదనిన్నీ వాదించడం యీకాలపు శాస్త్ర పాండిత్యంగా ఉంటున్నది. అందువల్ల యీకాలపు జ్ఞానవికాసంవల్లనూ, విద్యావికాసంవల్లనూ మనము అంతకంతకు ఎక్కువ జ్ఞానసంపన్నులమై, అంతకంతకు మహోన్నత స్థితిలోకి వస్తున్నామా అనేది తర్జన భర్జన చేయవలసిన విషయమే గాని వర్జించవలసిన విషయం కాదు. తర్కించవలసిన సమస్యయే గాని, తిరస్కరించవలసిన సమస్య కాదు.

పూర్వకాలంలో అనగా రామాయణ భారత యుగాలలో విమానాలు ఉన్నాయని పురాణాలలో వ్రాయబడి ఉంది ఈ కాలంలో మనము ప్రత్యక్షంగా విమానాలలో ప్రయాణం చేస్తున్నాము. దీనినిబట్టి చూస్తే, ఎప్పుడో వెనుకటి యుగాలలో మన పూర్వులు విమానాలను కనిపెట్టి యుండగా, యీనాడు మనము కొత్తగా కనిపెట్టి ముందంజ వేయగల్గిన దేమున్నదికి అని తర్కించేవాళ్ళు కొందరున్నారు. ఈనాడు కొత్తగా కనిపెట్టబడినట్లుగా, కొత్త ప్రజ్ఞావిశేషంగా, కొత్త బుద్ధి సామర్థ్యంగా ప్రకటింపబడుతున్న విషయములన్నియు, కొత్త విషయములు కావనిన్నీ, అవి అన్నియున్నూ ఏనాడో మన ప్రాచీన ఋషుల కాలంలో కనిపెట్టబడినవే యనిన్నీ, వాదించడం కొందరికి పరిపాటిగా ఉన్నది. వీరిది ప్రాచీనప్రాగల్భ్యం—ఈరోజున ఆటంబాంబులు కనిపెట్టినామని పాశ్చాత్య విజ్ఞానవేత్తలు గొప్పగా ప్రగల్భముగా ప్రకటించడం జరుగుతోంది. ఈ పాండిత్యప్రకటనలను చూచినటువంటి

ప్రాచీన విజ్ఞాన ప్రగల్భ పరాయణులు వెంటనే ఎదురు సవాలు చేస్తారు. "అణుశక్తి ప్రభావం అనేది యీ కాలంలో క్రొత్తగా కనిపెట్టిన గొప్ప విషయం ఏమీ కాదులెండి. శక్తి ప్రయోగాలు అనేవి ప్రాచీనులు ఏనాడో యింతకంటె అద్భుతంగా చేశారు." అని జవాబు చెప్పతూ ఉంటారు.

అయితే, పాండిత్యప్రగల్భంలో ఇద్దరూ సమానులే. ఆటంబాంబును కనిపెట్టడం మూలంగా తాము ఏదో ఆకాశానికి తూటు పొడిచినామనిన్నీ, స్వర్గానికి నిచ్చెనలు వేస్తున్నామనిన్నీ, మానవలోక కళ్యాణానికి బ్రహ్మాండమైన పెండ్లి పందిళ్ళు వేస్తున్నామనిన్నీ, అమెరికా రాజ్యంలోని అశేష శేముషీధురంధరులు అమందానంద కందళిత హృదయారవిందు లగుచున్నారు. "తారక మంత్రము కోరిన దొరకెను, ధన్యుడనైతి నిగా" అన్నట్లు యీ అణ్వస్త్ర పాండిత్య ఔన్నత్యమునకు ఉబ్బి తబ్బిబ్బై మబ్బులలో తిరగడం మంచిదేనా? ఇదంతా మంచిదా, చెడ్డదా, అనే యుక్తాయుక్త విమర్శతో నిమిత్తం లేకుండానే, మన ప్రాచీనయుగాలలో కూడా ఇవన్నీ ఉన్నాయని యీనాటి సనాతన విజ్ఞానవాదులు కొందరు వాదిస్తూఉంటారు. ఈనాడు సబ్బుబిళ్ళలు ఉన్నాయంటే, ఆనాడు కూడా సబ్బు బిళ్ళలు ఉన్నాయంటారు. ఈనాడు ఫేసుపవుడర్లు ఉన్నాయంటే, దమయంతి కాలంలో కూడా ఫేసుపవుడర్లు ఉన్నాయంటారు. ఈనాడు సిగరెట్లు, సోడాబుడ్లు ఉన్నాయంటే, రామాయణకాలంనాడు కూడా సిగరెట్లు, సోడాబుడ్లు ఉండేవని ఋజువుచేయడానికి విశ్వప్రయత్నం చేసేటటువంటి సనాతన విజ్ఞాన ప్రభావ ప్రచార ఏజంట్లు ఉన్నారు.

ఇదంతా చూస్తే ఎట్లా ఉన్నదంటే, ఒకపర్యాయం ఇద్దరు చిన్నపిల్లలు తమలో తాము తగాదాపడి ఒకరికంటె ఇంకొకరు ప్రగల్భాలు చెప్పడం ప్రారంభించారు. ఒక పిల్లవాడు తన స్కూలులో మాస్టరుగారివద్ద మూరెడంత పేముబెత్తం ఉన్నదన్నాడు. రెండో పిల్లవాడు ఆ మాట అందుకొని, "మీ మాస్టరుగారికి పేము బెత్తం ఒక్కటే ఉంది. కాని, మా స్కూలులో మాస్టరుగారికి అటువంటి పేము బెత్తముల కట్ట ఒకటి పెద్దది ఉంది" అన్నాడు. వెంటనే మొదటి పిల్లవాడు ఎదురుతిరిగి, "మా మేస్టరుగారికి వారానికొక పేము బెత్తం బద్దలైపోతుంది" అన్నాడు. రెండో పిల్లవాడు వెంటనే దబాయించి "ఛస్! యింతేనా? మా మేస్టరుగారికి రోజుకొక పేముబెత్తం బ్రద్దలైపోతుంది" అన్నాడు. "మా మేస్టరుగారు జానెడంత పొగచుట్ట కాలుస్తాడు" అన్నాడు మొదటి పిల్లవాడు. "మా మేస్టరుగారు మూరెడంత పొగచుట్ట కాలుస్తాడు" అని రెండో పిల్లవాడు ఏలంపాట పాడినాడు. ఈవిధంగా ఒకనికంటె యింకొకడు తన గురువుగారిగొప్పకు జీడిపాగ వేసినట్లుగా పొగడిపొగడి చిట్టచివరకు పాగ మారేటట్లు చేశారు. మొదటి పిల్లవాడు తనకు నూటికి 50 మార్కులు వచ్చాయని చెప్పినప్పుడు రెండో పిల్లవాడు తనకు నూటికి 75 మార్కులు వచ్చాయని చెప్పుకొన్నట్లయితే యీవిధంగా ఒకరికంటె యింకొకరు తమ గొప్ప చెప్పుకొనడం అవ్యక్తంగానూ, అయుక్తంగానూ కన్పించదు. కాని, ఒకటో పిల్లవాడు తాను నాలుగో క్లాసు నాలుగుసార్లు ఫెయిలుఅయినానని గొప్పగా చెప్పుకొన్నప్పుడు, రెండో పిల్లవాడు లేచి తాను మూడో క్లాసులోనే నాలుగుసార్లు ఫెయిలు అయినానని చెప్పుకొన్నట్లయితే, అతనికంటె ఘనుడు ఆచంటమల్లన్న అని మనము ఉభయుల తెలివితేటలకూ సంతోషించవలెనో, ఏడువవలెనో తెలియక తికమక పడవలసివస్తుంది.

ఈరోజున మన దేశాభివృద్ధికీ, మన జాతీయాభివృద్ధికీ, మన ఆత్మశ్రేయస్సుకోసం, మన ఆత్మతేజస్సుకోసం, సంఘంలోఉన్న సంసారులు సంతానభారం లేకుండా సంసారం చేసేటందుకుగాను, సంతాన నిరోధ సాధనములను ఉపయోగించడం అవసరం అనిన్నీ, అమోఘం అనిన్నీ ఆమోదించి అవలంబించినట్లయితే, మన విజ్ఞానం వికసిస్తోంది అంటాము. మనకు భూతల స్వర్గం కరతలామలకమవుతోంది అంటాము. అటువంటి సందర్భ విషయమును సనాతన విజ్ఞానప్రగల్భులు సావధానచిత్తులై సవిస్తరంగా విమర్శించాలి. ఈ సంతాన నిరోధ విద్య నిజంగా మన జాతీయాత్మాభ్యుదయానికి తోడ్పడగలదా లేదా అని విమర్శించాలి.

ఈ సంతాననిరోధ సాధనములు నిజంగా మన అభ్యుదయ సాధనములా? జాతీయ మోక్ష సాధనములా? అనే తత్వపరిశీలన చేయాలి. కాని, యీ పరిశీలన చేయకుండానే, "దున్నపోతు యీనినదంటే, దూడను కట్టివేయండిరా!" అని ఉత్తరువు చేసినవిధంగా, "ఈ సంతాన నిరోధ సాధనములన్నీ ఏనాడో మన మహర్షులు కనిపెట్టినవే" అని వాదించి కొన్ని శ్లోకాలు ఏకరువుపెట్టడం కొంతవరకు లోకసహజం అయిపోయింది.

పరమాణుశక్తి మొదలుకొని బ్రహ్మాండ శక్తివరకు మన విజ్ఞానశాస్త్రం వివరించవచ్చు. విజ్ఞానం అంటే ఏమిటి? శాస్త్రం అంటే ఏమిటి? ఏవిధంగా ఏ పదార్థానికి ఏ మార్పు యీ జగత్తులో జరుగుతున్నదో గ్రహించడం, దానిని సంగ్రహించి సర్వలోకవిదితం చేయడం. ఇదే శాస్త్రం. సిగరెట్టు ఏవిధంగా తయారుచేయబడునో, అది ఏవిధంగా వినియోగమగునో, దానిని కాల్చినప్పుడు దానిలో ఏ మార్పు ఏవిధంగా కలుగుతున్నదో, దానిని పీల్చినప్పుడు మనలో ఏ మార్పు ఏ విధంగా కలుగుతున్నదో వివరిస్తూ ఒక గ్రంథం వ్రాసినట్లయితే, దానినే "సిగరెటాలజీ" అంటారు. సనాతన భాషలో నిర్వచించి నామకరణం చేసినట్లయితే దానినే "సిగరెట్టుశాస్త్రం" లేదా "సిగరెట్వేదం" అని పిలువవలసివస్తుంది. ఇంతకూ యీ సిగరెటాలజీలో చెప్పబడినదంతా ఏమిటయ్యా అంటే, దానియొక్క నిర్మాణంవగ్గరనుంచి నిర్యాణంవరకు దానిలోని మార్పులు ఏవిధంగా కలుగుతున్నాయో వివరింపబడుతున్నాయి. కాబట్టి ఆయా వస్తువులలోని మార్పులు ఏవిధంగా సంభవిస్తున్నవనే విషయం గ్రహించడమే శాస్త్రం. మనిషి అనేవాడు ఏవిధంగా పుట్టుతున్నాడు? ఏ విధంగా బ్రతుకుతున్నాడు? ఏ విధంగా మరణిస్తున్నాడు? అనే విషయం బోధించేటటువంటి శరీరశాస్త్రగ్రంథాలు చాలా ఉన్నాయి.

కాని, జీవితానికి సంబంధించిన సందేహం ఇది ఒక్కటే కాదు. మద్రాసునుంచి కలకత్తాకు ఏ విధంగా వెళ్ళుతున్నాడు? అని ప్రశ్నించినప్పుడు "రైలుమీద వెళ్ళుచున్నాడు" అని జవాబు వెంటనే చెప్పగలం. కాని, "మద్రాసునుంచి కలకత్తాకు ఎందుకు వెళ్ళుచున్నాడు?" అని ప్రశ్నించినట్లయితే, ఆ ప్రయాణీకుడు ఏదో ఒక వర్తక వ్యాపారలాభంకోసం వెళ్ళుచున్నాడని చెప్పవలసివస్తుంది. లేదా అక్కడ జరిగేటటువంటి పండితసభకు హాజరయ్యేనిమిత్తం పోవుచున్నాడని చెప్పవలసివస్తుంది. ఏవిధంగా ఈ మానవజీవిత వ్యాపారవ్యవహారప్రపంచం నడుస్తోంది అనే ప్రశ్నకు సమాధానంగా వ్రాయబడే గ్రంథాలన్నీ శాస్త్రగ్రంథాలే. ఆర్థిక శాస్త్రం, రాజ్యాంగశాస్త్రం, యుద్ధశాస్త్రం, విద్యాబోధనాశాస్త్రం, ఆరోగ్యశాస్త్రం, పాకశాస్త్రం, పశుశాస్త్రం, వైద్యశాస్త్రం, శస్త్రశాస్త్రం, ఇంకా వీలైతే శాస్త్రశాస్త్రం (అనగా శాస్త్రాలు వ్రాయడం ఎట్లు అనే విషయాన్ని బోధించే శాస్త్రం) కూడా ఉండవచ్చు.

మానవజీవితం ఏవిధంగా సాగుతున్నది అనే విషయాన్ని నిర్వచించడం అంత



కెరటాలు

ఫొటో: శ్రీ పి. జనార్దనరావు, మద్రాసు.

## ★ కాలక్షేపం ★

కష్టమైన పని కాదు. మానవజీవితం ఏవిధంగా నడుస్తోంది అనే ప్రశ్నకంటే, "ఎందుకు నడుస్తోంది?" అనే ప్రశ్న యింకా ఎక్కువ ముఖ్యమైనది. మన జీవితప్రయాణంయొక్క సంకల్పోద్దేశం ఏమిటి? అనే ప్రశ్నను గూర్చి తర్జనభర్జనచేసి తత్వవిచారణ చేయడం చాలా ఎక్కువైన కృషి - చాలా ముఖ్యమైన కృషి. ఈ కృషిలో ప్రత్యేక ఖుషీ చూపించినది మన ప్రాచీన మహర్షులు. జీవితప్రయోజనం ఏమిటి? ఈ జీవితాన్ని ఎందు నిమిత్తార్థం యీ రీతిగా మనము గడుపుతూఉన్నాము? అర్థంలేకుండా బైరాగీ టిక్కట్టును కొని ("Travelas you please") - "చిత్తము వచ్చినట్లుగా ప్రయాణంచేయండి" అనే అవకాశం రైలు వాళ్ళు యిచ్చారు గనుక, మద్రాసునుంచి ఢిల్లీకి, ఢిల్లీనుంచి మద్రాసుకు పుల్లయ్య వేమవరం వెళ్ళివచ్చినట్లుగా తిరుగడమేనా యీ జీవితయాత్రయొక్క ప్రయోజనం? పూర్ణయాత్రా స్పెషలుమీద ఎక్కి పూర్వసువాసినులతో కలసి కాశీ రామేశ్వర యాత్రలుచేయడం ఎందుకు? బ్రిటిష్ ప్రధానమంత్రికి సెలవు దినములు లభిస్తే స్కాట్లండు వెళ్ళి చక్కగా చేపలు పట్టి, ఖులాసాగా కాలక్షేపం చేస్తాడు. తన శ్వేతజాతి బెస్తజాతి అంటాడు. ఇంగ్లీషువారు అంటే Angles (ఆంగిల్స్) అనే ప్రాచీనజాతిలోనుంచి ఉద్భవించిన వారు. Angling (ఆంగ్లింగ్) అంటే ఇంగిలాలు మొదలుకొని మింగిలాలవరకు పట్టడం. ఆంగ్లజాతి అంటే ఆవిద్యలో అందెవేసిన జాతి. యాంగిల్ అంటే చేపలను పట్టేకర్రయొక్క తాడుకొనకు కట్టబడిన వంపు తిరిగిన కొక్కెమువంటి "గాలము" అని అర్థం. దానితో జీవించే జాతివారే Angles (ఆంగిల్సు). గాలాయుధులు కాలంగడపుటకు స్కాట్లండుకు వెళ్ళి చేపలు పట్టడం సహజం. జీవితవిరామ కాలాన్ని అంతకంటె ఎక్కువ ప్రయోజనానికి గాలాయుధుడు వినియోగించడు.

"రాజకీయ వ్యవహారము లనే బురదలో దిగబడకుండా ఉన్నట్లయితే, మీరు ఏమి చేస్తారు?" అని లోకమాన్య బాలగంగాధర తిలకుగారిని ఒక మహాశయుడు ఒకప్పుడు ప్రశ్నించాడు. "నా జీవితం అంతా హాయిగా గణితశాస్త్రంలో సాధకం చేస్తూ గడుపుతాను" అన్నాడు లోకమాన్యుడు. "రాజకీయరంగంలో మీ నాయకత్వమును ప్రజలు శిరసావహించకపోతే మీరు ఏమి చేస్తారు?" అని గాంధి మహాత్ముణ్ణి ఒక పర్యాయము ప్రశ్నిస్తే, "నేను హాయిగా హిమాలయ పర్వతాలకు వెళ్ళి తపస్సు చేసికొంటాను" అని సమాధానమిచ్చాడు. ఈ రోజువరకూ శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు ఎప్పటికప్పుడు తాము రాజకీయ రంగంనుంచి విరమించి కంబరామాయణం పారాయణం చేసుకుంటూ ఉంటామని అంటూఉంటారు. మొత్తముమీద భారతీయుడు చిరకాలంనుంచీ యీ సంసారం అనే బురదకూపంలోనుంచి బయటపడి పరతత్వంకోసం పర్వతాలకైనా పోవడం ఉత్తమం అనే ఉన్నతభావంతో ఉంటున్నాడు. "ఈ కుటుంబజంబాల పటలమగ్నమాదృశ గృహమేధి మండలంబు నుద్ధరింపగ నౌషధ మెందు గలదో?" అనే ఆవేదనతో పరితపిస్తూ ఉన్నాడు. ఈ జీవితంలో Go as you please Ticket (యథేచ్ఛావిహారానుమతి పత్రంతో) యథేచ్ఛావిహారం చేయడం జీవితప్రయోజనం గాని పరమార్థం గాని కాదు అనేది భారతీయులు, ఆబాలగోపాలం ఉగ్గుపాలతో గ్రహించే విషయంగా ఉంది. భారతీయ విజ్ఞాన వికాసం

యీవిధంగా "జీవితయాత్ర ఎందుకు?" అనే విషయాన్ని మథించడంలో ప్రపంచంలో ప్రథమాగ్ర తాంబూలం స్వీకరించింది.

మానవ జీవితయాత్ర "ఎందుకు?" అనే విషయం కంటె, "ఏవిధంగా సాగుతోంది?" అనే విషయాన్ని పాశ్చాత్య శాస్త్రజ్ఞులు మథించి గ్రంథాలు వ్రాశారు. జీవితయాత్ర "ఎందుకు?" అనేది తెలియకుండా, నిర్ణయించకుండా, జీవితయాత్రను "ఏవిధంగా?" గడపాలి అనే విషయాన్ని చర్చించడం వట్టి ఊకదంపు; నీటిమూట; గాలిమేడ. అందుకనే త్యాగరాజుగారు "ఆగమశాస్త్రములన్నియు చదివినా - శాంతము లేక సౌఖ్యము లేదు" అని శ్రావ్యంగా శ్రుతిచేసి శ్రుతివాక్యం ఆలాపన చేశారు. పరకాయ ప్రవేశాది విద్యలు కూడా పరతత్వమును అనగా జీవిత పరమార్థమును సాధించడానికిన్ని అట్టి సాధనవల్ల ఆత్మశాంతి పొందడానికిన్ని అక్కరకు రావన్నారు.

ఈవిషయంలో మనకు పాశ్చాత్య పండితులు నేర్పవలసిన పాఠం క్రొత్తది ఏమీ లేదు. వారు పండితులే కావచ్చు. కాని, మనదేశానికి వచ్చిన తర్వాత వారుకూడా నేర్చుకోవలసిన విద్య చాలా ఉన్నదని గ్రహించాలి. అంతే కాదు. వారు అదివరకు నేర్చుకొన్నది విద్య కాదనిన్నీ, లోక కల్యాణానికి విఘ్నమనిన్నీ గ్రహించాలి. వారు నేర్చుకొన్న చదువు చాలా మరచిపోవాలి. ఇది మహాత్ముల పుట్టినిల్లు- ఇది పరమహంసలు విహరించే కాసారం. ఈ పండితుల సన్నిధిలో వారు చదివిన చదువు మరచిపోయి క్రొత్త చదువు చదువుకోవలసివస్తుంది. గాంధిమహాత్ముడు "ఆత్మబలంతో బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరిస్తాను" అని సత్యాగ్రహం ఆరంభించేముందు అప్పుడు వైస్రాయిగా ఉన్న రీడింగు ప్రభువుతో అన్నాడు. "ఆత్మబలం అంటే ఏమిటి?" అని రీడింగు ప్రభువు ఒక యక్షప్రశ్న వేశాడు. అటుతర్వాత అది ఏమిటో గ్రహించాడు. అనంతరం ఏమి జరిగిందంటే బ్రిటిష్ సింహానికి "గతమయ్యె నితాంతగర్వమున్"—

విలియమ్సు అనే ఒక ఆంగ్లేయ శాస్త్రవేత్త "సోషల్ హైజీన్" (సంఘారోగ్య శాస్త్రం) బాగా చదివిన పండితుడు. అతనిని ఒక కాలేజీలో ప్రిన్సిపాలుగా నియమించారు. ఆ కాలేజీ విద్యార్థులు బసచేసేటందుకున్నూ, భోజనం చేసేటందుకున్నూ ఒక వసతి గృహం ఉంది. ఈ హాస్టలుకు విలియమ్సు పండితుడు తనిఖీదారుగా ఉండి అజమాయిషీ చేస్తున్నాడు. వినాయకచవితి పండుగనాడు. యీ హాస్టలులోని విద్యార్థులు పూజలు చేసికొని విందుభోజనాలు చేసిన తర్వాత ఒక హాలులో సమావేశమై సంగీత కాలక్షేపం చేశారు. తమ ప్రిన్సిపాలుగారైన విలియమ్సు పండితుణ్ని కూడా సభకు ఆహ్వానించారు. భాద్రపద మాసంలో వర్షాలు ఎక్కువగా కురిసినపిమ్మట ఆ ఊళ్లో కలరా అక్కడక్కడ బయలుదేరింది. అందువల్ల మ్యునిసిపాలిటీవారు హోటళ్లకూ, విద్యార్థి వసతిగృహాలకూ పబ్లికు నోటీసులు పంపించారు. ఆ నోటీసులో యీ క్రిందివిధంగా హెచ్చరిక చెయ్యబడింది.

"ఊళ్లో కలరావ్యాధి అక్కడక్కడ తలయెత్తుతూ ఉన్నది. కనుక, ఆకు కూరలను విశేషంగా భుజించకూడదు. ఒకవేళ భుజించినప్పటికీ ఆకుకూరలను బాగా ఉడకబెట్టి ఆకుపసరు పోయేటట్లుగా వార్చి తినవలెను." అని ప్రజారోగ్య సూత్రముల ననుసరించి ఒక పబ్లికు హెచ్చరిక చేయబడింది. ఈ నోటీసుకాగితాన్ని విలియమ్సు పండితుడు హాస్టలు నోటీసు బల్లమీద శ్రద్ధగా అంటించాడు. విద్యార్థులు పండుగనాడు భోజనానంతరం జరిపిన గాన వినోదసభకు ఆహ్వానింపబడినవాడై విలియమ్సు పండితుడు వచ్చాడు. సభ అంతా ముగిసినపిమ్మట దేశమర్యాద ప్రకారంగా విద్యార్థులందరూ తాంబూలములు స్వీకరించి ఆకులకు సున్నంపూసి నములడం ప్రారంభించారు. విలియమ్సు పండితునకుకూడా చక్కని పోకచెక్కల పొడి లేత తమలపాకులు యిచ్చి వేసుకోమన్నారు. కాని, విలియమ్సు పండితునకు ఆగ్రహం వచ్చింది. నోటీసు బల్లమీద తాను అంటించిన నోటీసును విద్యార్థులు లక్ష్యం చేయడంలేదు అన్నాడు. ఈ పచ్చి ఆకులను ఉడకబెట్టకుండా తినడం ప్రజారోగ్యసూత్రవిరుద్ధం అన్నాడు. ఆ హెచ్చరికను ఉల్లంఘించినవాళ్లను దండించడానికిన్నీ, జరిమానా విధించడానికిన్నీ నిశ్చయించుకున్నానని శపథం చేశాడు. ఆ మాటలకు ఆ విద్యార్థులందరూ పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వారు. ఉభయులకూ జరిగిన ఈ సంఘర్షణ, మ్యునిసిపలు అధికార్లకు కూడా తెలిసింది. తమలపాకులను ఉడకబెట్టి తినవలెనని వాదించిన విలియమ్సు పండితుని అభిప్రాయం తప్పు అని మ్యునిసిపలు హెల్తు ఆఫీసరు తెలియజేశాడు. ఆ పండితుడు యీ విద్యార్థుల సన్నిధి నించుక బోధశాలియైనాడు. తనకు తెలియని విషయములు యీ దేశంలో చాలా ఉన్నాయని తన విద్యార్థులవల్ల గ్రహించాడు. అటుపిమ్మట తాంబూల చర్వణంలో తప్పులేదని గ్రహించాడు.

"తెలియనివాడనై మెలగితిన్ గతమయ్యె నితాంత గర్వమున్" అనే జ్ఞానప్రబోధం పొందినవారిలో ఆయన అగ్రతాంబూలం స్వీకరించాడు.



## రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ ఫోటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాగితానికి ఒకే వైపున సిరాతో వ్రాసి పంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన వానిని త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

రచయితలూ, చిత్రకారులూ సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.



ఏడుకొండల వెంకటరమణా గోవిందా!
గోవిందా!
వడ్డికాసుల వెంకటరమణా గోవిందా!
గోవిందా!

"లెయ్యండ్రా! లెయ్యండీ! ఏగు సుక్క పొడిసింది! అద్దదుగో అయ్యోర్లు పాటలు పాడుతూ కొండెక్కుతుండారు!"

అని ఒకరి నొకరు లేపుకుంటూ కొండ పాదుగున బిలబిలమంటూ భిక్షుక జనం ఒక్కసారిగా మేలుకున్నారు. పై మీది గుడ్డలు ముందు పరుచుకుని కూర్చున్నారు. ఎండనక, వాననక, కొండమెట్లమీద కూర్చుని వచ్చిపోయే యాత్రికుల ముందు చెయ్యి చాపి బ్రతుకు వెళ్ళబుచ్చేరునే బిచ్చగాళ్ళు వాళ్ళు. కళ్ళూ కాళ్ళూ లేని వారు, చీము నెత్తురు కారే వ్రణాలవారు, రకరకాల రోగులూ, దిక్కూ దివాణం లేని వారు, అయిన ఆ బిచ్చగాళ్ళకు కొండ మెట్లే మహాద్రాశయం. ఏడు కొండలవాడే ఏడుగడ. యాత్రికుల దయాభిక్షయే జీవనో పాధి.

బిచ్చగాళ్ళలో అంగవిహీనులు ఎక్కువ సంపాదనపరులు గనుక వాళ్ళకు విలువ ఎక్కువ. పొట్టకక్కుర్తికోసం తమ కన్న బిడ్డల్నే వికలాంగుల్ని చేసే పాపిష్ఠివాళ్ళు కూడా అందులో ఉన్నారు. దొంగ వ్రణాలు సృష్టించుకుని బాధితులయిన బిచ్చగాళ్ళ నోళ్లో దుమ్ముకొట్టి, యాత్రికుల కళ్ళు కప్పి నాల్గు డబ్బులు గుంజుకునే వాళ్ళూ ఉన్నారు.

"ఏడుకొండల వెంకటరమణా గోవిందా
గోవిందా!
వడ్డికాసుల వెంకటరమణా గోవిందా
గోవిందా!"

డోలీలవారూ, కాలినడకలవారూ, రోగులూ, భోగులూ, పేదవారు, గొప్పవారు, పిన్నలూ, పెద్దలు, గుంపులు గుంపులుగా ఒకే గమ్యస్థానాన్నుద్దేశించి ముందుకు సాగిపోతున్నారు. చుక్కలు వెలవెలపోయే ఆ మసక చీకటిలో దారికిరు ప్రక్కలా ఎలక్ట్రిక్ బల్బులు యాత్రికులకి దివిటీలు పడుతున్నాయి. చుట్టుప్రక్కల దట్టంగా పెరిగి చీకట్లు చిమ్ముతున్న చెట్ల మీదనుంచి పిట్టలు ఏడుకొండలస్వామికి మేలుకొలుపులు పాడుతున్నాయి.

వెంకన్న ఒళ్ళు విరుచుకుంటూ లేచాడు. కండలు తిరిగి, నల్లగా మెరుస్తున్న ఒంటికి దుమ్ము పట్టించుకున్నాడు. రెండు కాళ్ళు ఎడమ చేయి వెనక్కి విరిచి పట్టీలు బిగించి కట్టాడు. ఒంటిన అక్కడక్కడ ఎఱ్ఱని జిగురు రంగులో దూది ముంచి పట్లు వేశాడు. కళ్ళ వెంట మొసలి కన్నీళ్ళు కారుస్తూ,

బాబులు బాబులా! బాబులు బాబులా!
దానాలు సెయ్యండి బాబులా
కాళ్ళుసేతులు లేవు బాబులా! అంటూ

రాగం సాగించాడు.

అతనికి కొంచెందూరంలో చుక్కమ్మ తన కమ్మని కంఠంతో నీరసంగా,

## శ్రీమతి సహదేవ తారాదేవి

చూడకళ్ళు లేవు నారాయణా
తినను తిండీలేదు నారాయణా
దరమదాతలు మీరు నారాయణా
చల్లన్ని తల్లులూ నారాయణా
సక్కన్ని తల్లులూ నారాయణా
సల్లగా వరిదిల్లాలి నారాయణా

అని పాడుతూంది. చుక్కమ్మప్రక్కనే తానుకూడా అడుక్కుంటూ, డేగలా చుక్కమ్మని కనిపెడుతూ 10 నిముషాల కొకసారి ఆమె సంపాదనని సేకరించుకుంటున్నది ముసలవ్వ. పాపం చుక్కమ్మకి ప్రపంచమంతా చీకటే. చీకిన చీర చిరుగుల్లోంచి పైకి పొంగుతూన్న పరువంపు వంపు సొంపులు తన చక్కదనానికి వన్నె పెట్టగా, చుక్కమ్మ తతిమ్మాబిచ్చగాళ్లలో వేరుగా కనిపించిపోయేది. ఆమె చక్కదనాన్నీ, గుడ్డితనాన్నీ చూచి జాలిపడి యాత్రికులామెకు భిక్షవేయకుండా వెళ్లేవారు కారు.

ప్రొద్దెక్కుతున్నకొద్దీ యాత్రికుల రద్దీ హెచ్చిపోతున్నది. బిచ్చగాళ్లరొదతో యాత్రికుల గోలతో కొండ మారుమ్రోగి పోతున్నది. వెంకటేసు తోకతొగిన నక్కలా ఒక్కటే మోత. చుక్కమ్మ ఆగాగి నీరసంగా పాడుతున్నది. వేసే ధర్మాత్ములు బిచ్చంవేస్తున్నారు. వేయని వాళ్ళని బిచ్చగాళ్లు తిట్టిపోస్తున్నారు.

ముందు నునువెచ్చగా, సున్నితంగా తాకిన నీరెండ, క్రమేపి ముదిరి చిటచిటలాడుతూ క్రిందమెట్లనీ, మెట్లమీద జనాన్నీ మాడ్చివేస్తున్నది. ప్రొద్దు నడిమింటి కెక్కగానే ముసలవ్వ ముంతల్లో చద్ది కూడు తీసుకొచ్చి వెంకటేసుకీ, చుక్కమ్మకీ పెట్టింది. కూడు తిని నీళ్ళుతాగి వాళ్ళు యథాప్రకారంగా వ్యాపారంలో మునిగిపోయారు. ప్రొద్దువాటారే వఱకు, యాత్రికుల సద్దు మణగేవఱకు వాళ్ళక్కడనుంచి కదల లేదు.

క్రమంగా ముదిరిన చీకట్లు ఎలక్ట్రిక్ బల్బుల వెలుగుచూసి ఝడిసి ప్రక్కనున్న చెట్లనీడ ల్నాశ్రయించాయి. వెంకటేసు డబ్బులు లెక్కపెట్టుకుని రహస్యంగా కొంత రొండిలో ముడేసుకుని తిన్నగా అవ్వదగ్గరికి వెళ్ళాడు. కోరమీసం మెలేస్తా విలాసంగా చుక్కమ్మకేసి చూపు విసిరి "అవ్వా ఈయాల ఎన్ని డబ్బులొచ్చినాయి."అన్నాడు.

"సుక్కమ్మకి 1-8-0 నాకు 0-2-0"

"సూడగా సూడగా గుడ్డోళ్ళే నయంగా ఉండారు"

"మరేంటనుకుండావు. సుక్కమ్మగుడ్డితనం సూసి దరమరాజు లేత్తారు; సక్కదన సూసి సిన్న మారాజు లేత్తారు, సక్కదనె గుడ్డితనం రెండూసూసి అమ్మోర్లేస్తరు నీ కాడా నాకాడా ఏంసూసి ఏస్తరురా ఎంకయ్యా" అన్నది ఈసడింపుగా ముసలవ్వ.

"అంతేలే. ఇదో నా అర్ధరూపాయి. కూడు ఒండు కూరట్టుకొస్తా" అని ముసలవ్వచేత పావలా పెట్టి పావలా కూరకి తీసుకు బయలుదేరాడు వెంకటేసు.

కోరమీసాల ఎంకటేసు కొండమీదకి వచ్చి నెలైంది. తండ్రి తాతల దగరనుంచి సంక్రమించిన భిక్షుకవిద్యతో అతను రోజుకొక రకంగా అంగవైకల్యాలు సృష్టించుకొని యాత్రికులవద్ద డబ్బు గుంజుతాడు. కొండమీదకి రాగానే అతనికి చుక్కమ్మ కంటబడ్డది. చుక్కమ్మ చక్కదనం చూడగానే అతనికి గుండెల్లో గుబులు బైలుదేరింది. కోరిన వస్తువును న్యాయాన్యాయ విచక్షణ లేకుండా పొందాలన్న పట్టుదలతో పాటుపడే నైజం వెంకటేసుది.

పొందిన తరువాత ఆ వస్తువుకు విలువ తగ్గిపోవడం, చీకిన తాటిటెంకలా దాన్ని విసరివేయడం కూడా అతనికి పరిపాటి. చుక్కమ్మని పొందాలన్న తహతహతో నెమ్మదిగా అతను అవ్వ ప్రక్కన చేరాడు. తాను తెచ్చిన డబ్బు లామెకిచ్చి ఆమెచేత కూడు వండించుకు తిని ఆమెతో దూరపు చుట్టరిక మొకటి కలుపుకున్నాడు. వెంకటేసు తియ్యతియ్యని కబుర్లకి అప్పుడప్పుడు ఇచ్చే డబ్బులకి ముసలవ్వ పూర్తిగా లొంగిపోయింది.

వెంకటేసు కూర పట్టుకొచ్చి అవ్వకిచ్చి చుక్కమ్మ ప్రక్కగా జేరి చుట్టదమ్ము పీలుస్తూ సన్నగా పాటందుకున్నాడు.

సుక్కల్లో ఓ సిన్నదానా
సక్కాని ఓ సిన్నదానా
సూశానులే నీ ఒయ్యారం
సూపవులే మమకారం. సు॥
జాజిపూలా పందిరిక్రిందా
మల్లెపూలా పానుపుమీదా
సూశానులే నీ ఒయ్యారం
సూపవులే మమకారం. ॥సు॥

పాట వింటున్నకొద్దీ చుక్కమ్మ మరింత ముడుచుకుపోయి చిరుగులగుడ్డ ఒంటిమీదకు తీసుకుని ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది.

ఎల్లాలమ్మ కొండమీద కానాపే వచ్చింది. కూడొండుకునేచోట అవ్వతో నేస్తం కలిపింది. చింకిపాతల్లో ముత్యంలా మెరుస్తున్న చుక్కమ్మను చూచి చూచి ఉండబట్టలేక,

"అవ్వా సుక్కమ్మ నీకేమవుద్ది?" అని అడిగేసింది.

"నాకేటవుతాదే. సిన్నతనాన ఎవురో నామాలయ్యోరు నాకాడదిగిడిసిపోయిండు. ఆ యేలనుంచి ఈ ఏలదాకా నేనే సాకుకొచ్చినా" అన్నది.

ముడుచుకు పడుకున్న చుక్కమ్మ గుండెల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. తనకు ఇంకా ఊహ సరిగ్గా రాని చిన్నతనం. తండ్రి పోవడం, సవితితల్లి అన్నగారు తీర్థయాత్రల మిష బెట్టి తమ దేశంనుంచి వెంటబెట్టుకు కొండమీదకు తీసుకు రావడం, ఇప్పుడు తన్ను చూస్తున్న ముసలవ్వతో ఏదో గుసగుసలాడడం, తరువాత కనిపించకుండాపోవడం గుర్తుకువచ్చింది. ఆ మరునాడు తాను తండ్రిదగ్గరికి పోతానని ఏడిస్తే అవ్వ నాలుగు బాదులు బాది నోరు నొక్కింది. ఏడ్చి ఏడ్చి అలసి నిద్రపోయింది తాను. ఆ రాత్రి నిద్రమత్తులో ఉన్న తన కళ్ళు బలవంతంగా తెరిచి అవ్వ ఏదో పసరు పోసింది. అప్పటినుంచే తన కళ్ళకు మసకలు వచ్చి గుడ్డివైపోయాయి. కళ్ళు పోయి దిక్కుమాలిన తనకు అవ్వ



"అవ్వా ఈకూల ఎన్నిడబ్బు లొచ్చాయి" అన్నాడు.

కూడు పెట్టి అడుక్కోవడం నేర్పింది. ఒక్కసారి తన గుడ్డికళ్లు తడిమి చూసుకుని బొటబొట కన్నీరు కార్చసాగింది నిశ్శబ్దంగా చుక్కమ్మ.

ఎల్లాలు మళ్ళా అందుకుంది.

"అయితే, అవ్వా సుక్కమ్మ పెళ్ళీడుకొచ్చిందిగందా. పెళ్ళికొడుకును సూసినావా"

"ఒలి తక్కువని గుడ్డిదాన్ని కట్టుకుంటే రోజుకు దొంతికు కుండలు పగలబొడిసిందంట. గుడ్డిదాన్ని ఎవురు సేసుకుంటారు యెల్లాలమ్మ."

"గుడ్డిదయితే నేం. మనోళ్ళలో సుక్కమ్మ సక్కదనం ఎవురి కుందవ్వా. సుక్కమ్మ సంపాదన రోజూ 1 రూపాయిదాకా కళ్ళ చూస్తావంటగందా! ఇక పెళ్ళికొడుకులే రారా."

"సుక్కమ్మ నిడిసి నే ఉండలేను. ఎవురన్నా సుక్కమ్మని సేసుకుని నాకాడనే ఉంటే పిల్ల నిస్తా" అన్నది ముసలిది. కాని చుక్కమ్మ ఎడబాటుకన్నా చుక్కమ్మ సంపాదనతోటి ఎడబాటు సహించలేనన్న రహస్యాన్ని మాత్రం ముసలవ్వ బయట పెటలేదు. సమయాన్ని జారపెట్టేవాడు కాడు వెంకటేసు. ఇంత సేపూ కిమ్మనకుండా



# వార



వాళ్ళ మాటలు వింటూన్నవాడు హఠాత్తుగా,

"పోనీ అవ్వా! సుక్కమ్మను నీ సుట్టపోడ్ని నాకే యివ్వకూడదా. మనమంతా ఒక్కకూటికుండనే ఒండుకోవచ్చుగందా". అని మాట విసిరాడు.

"సుక్కమ్మని నాకాడే ఉంచుతానని మాటిస్తే ఎందుకివ్వను ఎంకటేసూ" అన్నది ముసలవ్వ ఆప్యాయంగా. ఏడుకొండలసామి సాక్షిగా మాటిచ్చాడు వెంకటేసు.

ఈవిధంగా చుక్కమ్మ పెళ్ళి చుక్కమ్మ యిష్టానిష్టాలతో నిమిత్తంలేకుండానే స్థిర పడిపోయింది. చుక్కమ్మ పెళ్ళికి అందరి పెళ్ళిళ్ళకుమల్లే బాజాలు, భోజనాలు, మంత్రాలూ మొదలైన ఆర్భాటాలేమీ జరగలేదు. బిచ్చగాళ్ళ పెళ్ళికి ఆర్భాటాలెక్కడనుంచి వస్తాయి? మంచిరోజు చూసుకుని వెంకటేసు చుక్కమ్మ పీకకు పసుపుకొమ్ముతోటి తాడుకట్టి ఆమెమీద సర్వహక్కులూ సంపాదించుకున్నాడు.

## 2

కాలం గడచిపోతున్నది. సంసారి అయిన చుక్కమ్మలో ఇప్పుడొక కొత్త మార్పు వచ్చింది. ఆమెకు నెల మసలింది. వేవిళ్లకు వేగలేకపోతున్న చుక్కమ్మను చూసి జాలిపడి ఎల్లాలు తాను దిగువ తిరుపతికి వెళ్ళినప్పుడల్లా చేతిడబ్బులతో చిలుతిండ్లు కొని ఎవరూ లేకుండా చూసి చుక్కమ్మచేత పెట్టేది. ఊరికే తీసుకోడానికి సిగ్గుపడి చుక్కమ్మ వద్దని ఎంత చెప్పినా ఎల్లాలు వినేదికాదు.

"నా కివురున్నారే పిల్లా. ముసలిముండ నీ సంపాదన కూడేసుకోవడమేకాని నీఆలనా పాలనా సూడదుగందా. ఇక ముండల్ని మరిగిన ఎంకటేసు నీమాటే పట్టించుకోడుగందా" అనేది కటువుగా.

చుక్కమ్మ గుడ్లవెంట నీళ్ళు కుక్కుకునేది. తన అధ్వాన్నపు బ్రతుక్కుతోడు కట్టుకున్నవాడు ముండలనుతాగోరవడం ఆమెకు పుండుమీద కారం రాచినట్లుండేది. ఆమె జీవితంలో ఇంతవరకు కన్నతల్లిలా ఆశ్వాసించింది ఒక్క ఎల్లాలే. నా అనేవారు లేని ఎల్లాలుకు చుక్కమ్మంటే ఎందుకో చెప్పలేని ప్రేమ పుట్టుకువచ్చింది. ఎల్లాలు పగలంతా కష్టపడి కొండమీద పుల్లలేరుకుని మరునాడు దిగువతిరుపతిలో ఇళ్ళవెంట తిరిగి అమ్ముకునేది. ఆడబ్బుతో పచారి సరుకులు కొని కొండమీద బిచ్చగాళ్ళకమ్మేది. ఎల్లాలుకు అడుక్కోవడం మంటే అసహ్యం.

"భగవంతుడిచ్చిన కాళ్ళు సేతులు సల్లంగ ఉండాలి కాని నాకు కూటికి లోటేంటే పిల్లా. పసుల్లా ఎండల్లో మాడి అయ్యా దరమమంటూ ఒకరికి సెయ్యి సాపుతానా" అనేది చుక్కమ్మతో గర్వంగా.

ఒకనాడు ఎల్లాలు దిగువతిరుపతినుంచి సరుకుల బస్తాతోవచ్చి అవ్వవాళ్ళదగ్గర చతికిలబడింది ఊళ్ళో విశేషాలు ఏకరువు పెడుతూ.

"సూసినావా ఓ లమ్మా! ఆళ్ల సెంద్రమ్మ నెరగవ్వా, కానుపు రావడంలేదని నిన్న పేటల దరమాస్పత్రిలో బడేసినారు. మా సక్కని కొడుకును కన్నదవ్వా"

"అడుక్కు సేనాళ్ళకి ఆసుపత్రిలో సోటెవరిచ్చినారే"

"ఇప్పుడుండే దొరసానమ్మ మా దరమబుద్ధి. బీదాళ్ళంటే పానాలిత్తదవ్వా! నేను ఆరికి వాడిగా పుల్లలేత్తుండా. మన సుక్కమ్మని అడికే తీసుకెళ్దామని ఉండెద."

"కానుతే! ఇలాంటి ఏసాలు మప్పక. ఆసుపత్రోళ్ళకి పోయడానికి డబ్బులేకుండాయి యాడతెచ్చేది. సిత్రాలు."

"మాలావు పెట్టేత్తుండావులే సుక్కమ్మకి. నీకెందు కూరుకో. నేనే సుక్కమ్మని ఆ యమ్మోరు దాలచ్చిమి పాదాల బడేత్తా"

ఒప్పు కుంచుకొచ్చింది, అవ్వకి. కాని అవ్వకి ఎల్లాలంటే భయం. ఇప్పటికి ఎల్లాలుకి అవ్వ సరుకులకి 4 రూ బాకీ. దెబ్బలాట వేసుకుంటే నిలుచున్నపళంగా 4 రూ కక్కాలి. అందుకని కిమ్మనలేదు.

ఇంకొకనాడు ఎల్లాలు సరుకులబస్తాతో

తల్లి: అదేమిటిరా! అల్లా పరుగెత్తుకు వస్తున్నారేం?

పిల్లలు: అది కాదమ్మా! మన పక్కింటి సోము, మైనంతో తేలుబొమ్మ చేసి మమ్మల్ని భయపెట్టుతున్నాడమ్మా!

— 'మహేశ్' (మద్రాసు)

రొప్పుతో రొజుతూ వచ్చింది. బస్తా క్రింద బడేసి జేవురించిన మొగంతో.

"అళ్ళనోట్లో అగ్గెట్ట! అళ్ళ కడుపు కాలిపోనూ! అళ్ళజిమ్మడ! ఎంత పని సేసినారో. సెంద్రమ్మ బిడ్డకంట్లో పసరోసి గుడ్డోణ్ణి సేసినారు. సెంద్రమ్మ ఒకే ఎగాన ఏడుస్తండది." అన్నది చేతులు తిప్పుకుంటూ.

"ఓస్ అంతే గంద. మా అయ్యా మా అమ్మ గన్నాళ్ళిద్దర్ని గుడ్డోళ్ళని సేసినాడు. కళ్ళూ, కాళ్ళూ, సేతులూ సక్కంగుంటే ఎవురూ ముష్టెయ్యరు. ముష్టి లేకపోతే అడుక్కు సేవోళ్ళకి కూడేది?" చుక్కమ్మ ఒళ్లు జలదరించింది. గుండె గుభేలుమంది. "అమ్మో! కూటికోసం కన్నోళ్ళని గుడ్డోళ్ళని సేస్తారా!"

-ఓయబ్బ! ఏం నీతులు సెబుతుండావు. 4 రోజాలు కూడులేకుంటే తెలుస్తది ఎవరెక్కవో." అంది అవ్వ కోపంతో.

కూర నంజుకుంటూ ముంతలో నూకల జావ జుర్రుతున్న ఎంకటేసు పక పక నవ్వుతూ "కోటియిద్దెలు కూటి కోసం. అనుకోవడం కూడా ఒక యావారం. సూడుపిల్లా! నువ్వు గుడ్డిదానవయినందుకు గుడ్డోణ్ణి కంటివా మనింట మాలచ్చిమి పలుకుతాది. ఏడుకొండలసామికి మొక్కుకో" అన్నాడు. చుక్కమ్మ నిలువునా నీరయింది. తాను గుడ్డిదవడం చేతనే కదా తన బ్రతుకింత దిక్కుమాలింది. ప్రపంచంలో అందమంతా తనకు కరవయింది. ఎండనక వాననక చెయ్యిచాపి బ్రతుకు వెళ్ళబుచ్చుకోవలసివచ్చింది. ఛా! తన బిడ్డకెప్పుడూ ఈ పాడురాత పట్టకూడదు! హఠాత్తుగా చిన్నతనంలో అవ్వ తన కంట్లో పసరుపోయడం ఆమె మెదడ్లో మెరసింది. అమ్మో! అప్పటినుంచే ఆమె కళ్ళుపోయాయి. ఈ ముసలిముండ తన బిడ్డ కళ్లు తీస్తే తనకేం గతి! ఆమె నోరు తడి ఆరిపోయింది. అమ్మో! అంటూ ఆమె ఎల్లాలు ఒడిలో పడిపోయింది. ఎల్లాలు ఆమెను చంటిబిడ్డలా పొదివి పట్టుకుంది.

నాటినుంచీ చుక్కమ్మ నిద్రాహారాలు మాని మర్మాంతకమైన మనోవ్యధతో కుల్లిపోసాగింది. అవ్వ తన్ను చేసినట్టే తన బిడ్డనూ గుడ్డివాణ్ణి చేస్తుందన్న నమ్మకం ఆమెలో పాతుకుపోయింది. ఎవరూ లేనప్పుడు వెక్కి వెక్కి ఏడుస్తూ ఎల్లాలుతో చెప్పుకునేది తన అనుమానాన్ని. ఎక్కడికన్నా తన్ను తీసుకుపొమ్మని ఎల్లాలును బలవంతం చేసేది. కాని ఎల్లాలు మాత్రమేమి చేయగలదు? చుక్కమ్మ మగనాలి. మగడికి ఇష్టంలేకుండా తాను చుక్కమ్మను తీసుకుపోలేదు. ఒకవేళ తెగించినా ఇద్దరికీ వెంకటేసు చేతిలో చావు తప్పదు. వెంకటేసు కోర మీసాలు, మెలి దిరిగిన కండలు, ఎఱ్ఱని కళ్ళు చూస్తేనే ఎల్లాలుకు భయం.

క్రమంగా చుక్కమ్మకు నెలలు నిండాయి. కనలేక, కళ్ళలోకి ప్రాణాలు వచ్చి, చుమ్మలు చుట్టుకుపోతున్న చుక్కమ్మని ఎల్లాలు కష్టంమీద ఆస్పత్రికి చేర్చింది. ఆస్పత్రిలో చుక్కమ్మకి మత్తుమందిచ్చి బిడ్డను బైటికి లాగారు. తెలివి వచ్చిన తక్షణం బిడ్డ కళ్లు తడిమి చూసుకుంది చుక్కమ్మ. నీరసంగా "నా బిడ్డ కళ్లు" అన్నది. "సక్కంగున్నాయి శ్రీకాలులా" అన్నది ఎల్లాలు సంతోషంతో. కొడుకును చూడడానికి వచ్చిన వెంకటేసునూ, ముసలవ్వనూ చూచి చుక్కమ్మ గాలికి రావాకులా వణికిపోయింది. వాళ్ళు వెళ్లేవరకు ప్రాణాలు బిగబట్టుకుని వెళ్ళగానే "అమ్మ నా బిడ్డ కళ్లు" అంది కంటనీరు పెట్టుకుంటూ.

"ఇదేటోలమ్మ! ఆసుపత్రిలోనే నీ బిడ్డ కళ్ళూడబీకేస్తరనుకున్నావా" అంది ఎల్లాలు.

అవును ఇంటికి వెడితే కొడుకు కళ్ళు పోతాయి. ఇంటికి వెళ్ళక ఇంకెక్కడికి వెళ్ళగలదు? తన బిడ్డ కళ్లు ఎలా రక్షించుకోగలదు. అహోరాత్రాలు చుక్కమ్మ మెదడు ఈ ఆలోచనతో నీరైపోసాగింది.

చుక్కమ్మ క్రమంగా తేరుకుంది. కాంపుకు వచ్చిన డాక్టరమ్మ చుక్కమ్మ ఆస్పత్రినుంచి మరునాడు వెళ్ళిపోవచ్చునన్నది. పిడుగు పడినట్టయింది చుక్కమ్మ నెత్తిమీద. అమాంతంగా క్రిందకు దూకి ఏడుస్తూ డాక్టరు కాళ్లు పట్టుకుంది.

"రచ్చించాలి మా లచ్చిమి తల్లీ! రచ్చించాలి! నా బిడ్డను సాకలేను. నాకు మల్లే అడుక్కు సేవోణ్ణి సేయలేను. నా బిడ్డకళ్లు పోగొట్టుకోలేను. రచ్చించాలి!" అని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. డాక్టరు ఆశ్చర్యంతో ఎల్లాలువంక చూసింది. ఎల్లాలు ఏడుస్తూ చుక్కమ్మ దీనగాథనీ, ఆమె అనుమానాన్నీ డాక్టరుకు తెలియ చెప్పింది. కథంతావిని డాక్టరు చాలసేపు మాట్లాడలేదు. ఆమె హృదయం నవనీత తుల్యం. ఆమె స్వయంగా అనాథ శరణాలయంలో పెరిగింది. అందుకనే బాధితులైన తోటి జీవుల హృదయవేదన నామె ఇట్టే అర్థం చేసుకోగలుగుతుంది. చిట్టచివరకి "నీ కొడుకును నాదగ్గర వదలి వెళ్ళిపో. వాడికి చదువు సంధ్యలు చెప్పించి ప్రయోజకుణ్ణి చేస్తాను. పెద్దవాడైం తరువాత నీదగ్గరకు తిరిగివస్తాడు. ఏమంటావు" అన్నది దయతో.

తనబిడ్డ! తన రక్తాన్ని పంచుకుని పుట్టిన బిడ్డ! తన ప్రాణం! అతన్ని వదిలిపెట్టి ఎలా బ్రతకగలదు. ఒకప్రక్క బిడ్డ ఎడబాటుతోడి రంపుకోత. ఇంకొకప్రక్క అతని గుడ్డితనం. నీచజీవితం. చుక్కమ్మ తన బిడ్డ భావిభాగ్యాన్ని కాంక్షించి అతని ఎడబాటుకే నిశ్చయించుకుంది. కొడుకును వణుకుతున్న చేతులతో డాక్టరమ్మ కప్పగించింది. డాక్టరమ్మ చుక్కమ్మ ఫోటో తీయించి, ఆమె సంగతులన్ని వ్రాసుకుని దగ్గర పెట్టుకుంది.

మరునాడు తన పంచప్రాణాలు డాక్టరమ్మదగ్గర దిగవిడిచిన చుక్కమ్మ కట్టె కాంపుమీదకి తరలివెళ్ళింది. మకాము చేరగనే నెత్తినోరు బాదుకుని ఏడుస్తున్న అవ్వ ఆమె చుట్టుచేరి ఆశ్వాసిస్తున్న బిచ్చగాళ్ళు కనిపించారు. అవ్వ దాచుకున్న సొమ్మంతా దోచుకుని వెంకటేసు పారిపోయాడని తెలిసి నిలువునా కూలిపోయింది చుక్కమ్మ. డబ్బుపోయి ఏడుస్తున్న అవ్వకు మనుమడు ఆస్పత్రిలోనే చచ్చిపోయాడని ఎల్లాలు చెప్పిన విషయమే పట్టలేదు.

చుక్కమ్మ కొండపైకి వెళ్ళిన కొత్తలోనే డాక్టరుకు కొత్తఊరుకు బదిలీఅయి వెళ్ళిపోయింది. అవ్వకూడ డబ్బుపోయిందన్న విచారంతో తీసుకు తీసుకు చచ్చింది. కాని ఎల్లాలుమాత్రం చుక్కమ్మను వదలలేదు. జీవితసంగ్రామంలో దెబ్బలుతిని



# వార



ఆశ్రయహీనయైన చుక్కమ్మకు ఎట్టాలు ఒడిలో మాతృస్థానం లభించింది. ఎట్టాలు చుక్కమ్మను అడుక్కోవడం మానమని ఎంతో బ్రతిమాలింది. కాని చుక్కమ్మ వినలేదు.

"అమ్మా! నీ సంపాదన నీపొట్టకే సాలదు. రెండు పానాలకి ఎట్టా సాలుతుంది సెప్పు? డాక్టరమ్మ నా బుడ్డోడ్ని ఏనాటికన్నా నా కాడికి పంపుతానని సెప్పింది గందా నే నీడ లేక పోతే నా బుడ్డోడు నాకాడికి వచ్చి నన్ను కానక తింగల్లిపోతాడేమో" అనేది.

అదే ఆమె జీవితాశ. ఆ ఆశతోనే జీవితంలో 20 ఏళ్ళు బరువుగా వెనక్కు తోసింది. దుఃఖభారంతోనూ, వయస్సు మళ్ళిపోతుండడంవల్లా ఆమె శరీరం ముడుతలుపడిపోయినా చుక్కమ్మ మనస్సు మాత్రం ఈ ఆశతోనే నిత్యనూతనంగా చిగురులు తొడుగుతున్నది. పాలుతాగి పారాడే పసిపాపడిరూపం దగ్గరనుంచి దిన దినమూ ఆమె మనోవీధిలో తన బిడ్డడి రూపాన్ని చిత్రించుకుని ఆనందించింది. నేటికి 20 యేళ్ళ యువకుడుగా తన బిడ్డడ్ని ఊహించుకుని అతనికోసం అనుక్షణం ఎదురు చూస్తున్నది చుక్కమ్మ. తన ముందునుంచి దాటిపోయే అడుగుల అలికిడిలో తన బిడ్డ అడుగుల సవ్వడికై వెతుక్కుంటున్నది. తన ముందు ఆగిన యువకులపాదాల సవ్వడికి ఆమె గుండె గుబగుబలాడగా, చెవులు రిక్కించి, ఆత్రంతో "అమ్మా" అనే తీయని పిలుపుకై ఆరాటపడేది. ఆ తీయని పిలుపు వినిపించకుండానే ఆ పాదాలు తన్ను దాటిపోయినప్పుడు ఆమె బరువుగా నిట్టూర్చి కన్నీరు కార్చేది.

20 ఏళ్లనుంచి ఏ మహద్భాగ్యంకోసం, ఏ తీయని పిలుపుకోసం, చుక్కమ్మ ప్రాణాలు నిలుపుకుని ఎదురు చూస్తున్నదో, ఆ సుదినం రానే వచ్చింది.

డాక్టరమ్మ దయవల్ల అనాథశరణాలయంలో చేర్చబడి, పెరిగి, ప్రయోజకుడైన నవనాగరికుడైన వెంకటరావు, తన తల్లి జీవిత గాథ తెలుసుకుని తల్లి ఫోటో పట్టుకుని కొండ ఎక్కుతున్నాడు. ప్రతి బిచ్చగత్తె ముందు ఆగి, దాని ముఖాన్ని జాగ్రతగా పరీక్షిస్తూ తన దగ్గరున్న ఫోటోతో సరి చూసుకుంటున్నాడు. క్రమంగా ఆ బూటు పాదాల ఇనప నాడాల టకటకలు చుక్కమ్మముందుకు వచ్చి ఆగాయి. మాసి చీకిన చీరె చిరుగుల్లోంచి, ముడుతలుపడి, ఎండిపోయి, లావణ్యలేశమైనా లేని శరీరంతో, నెరసిన చింపిరి జుట్టుతో, కన్నీటి చారికలుకట్టి మలినమైన ముఖంతో, మూర్తీభవించిన దైన్యమూర్తిలా కూర్చుని వణుకుతూ బొంగురుపోయిన కంఠంతో ఆగి, ఆగి, "సూడ కళ్ళు లేవు నారాయణా" అని పాడుతున్న చుక్కమ్మను చూచాడు. తన చేతులోని ఫోటోతో ఆమె ఇప్పటిరూపాన్ని సరిపోల్చి చూసుకుంటూ ఆమె ముందు నిల్చున్నాడు. తనముందు ఆగిన యువకుడి పాదాల సవ్వడికి చుక్కమ్మ చటాలున పాట ఆపి వేసింది. చెవులు రిక్కించి, అనంతమైన ఆవేదన, ప్రతీక్ష ముఖంమీద తాండవమాడుతుండగా, వణకుతున్న చేతులుచాపి పైకి చూచింది చుక్కమ్మ. ఫోటోలోని ముఖకవళికలు చుక్కమ్మ ముసలి మొగంలో వెతుక్కుంటూ అనుమానంతో "నీ పేరు చుక్కమ్మేనా" అన్నాడు వెంకటరావు క్లుప్తంగా. విద్యుత్ప్రసారమయినట్లు ఒక్కసారి చుక్కమ్మ నాళనాళాలూ ఉత్తేజితమయ్యాయి. "వెంకటేసు కంఠం!" "ఇతడే నీ కొడుకు" "ఇతడే నీకొడుకు" అని ఆమె అంతరాత్మ నొక్కి నొక్కి చెప్పినట్లైంది. 20 ఏళ్ళనుంచి అణచిపెట్టిన మాతృప్రేమవాహిని ఒక్కసారిగా గట్టు త్రెంచుకున్నది. ఆ చిరోలేని ప్రేమావేగాలతో ఆమె ఉవ్వెత్తున లేచి నిల్చుని "నా కొడకా" అని చేయిచాచింది.

నవనాగరికుడైన వెంకటరావు గభాలున వెనక్కు వేశాడు. ఈ చింకిరి గుడ్డల, చీకిరి బాకిరి, చీకుముసలిదా తనతల్లి! *Nonsense* ఇది నమ్మడానికి వీలులేని విషయం. స్వప్రయత్నంతో జీవితోన్నత్యశిఖరసీమలనందుకున్న వెంకటరావు అహం దెబ్బతిన్నది. తన వంటి సంస్కారి, నాగరికుడు, గొప్పవాడు, ఈ బిచ్చగత్తె కడుపునా పుడత! అన్యాయం. విధి తనకెంత అన్యాయంచేసింది! అడుక్కుబ్రతికే ఈ నికృష్టురాల్ని తన తల్లిగా తెలుపుకుని, సాటి ఉద్యోగస్తులలో తలెత్తుకుతిరగగలడా! అలా ఎప్పటికీ జరగదు. తనఎదురుగా తనగౌరవం పేక మేడలా కూలి, సాటివారితో తాను హాస్యాస్పదుణ్ణి కావడం ఎప్పటికీ సహించడు. ఒకవేళ ఈమె కడుపున తాను నిజంగా పుట్టినా, పుట్టగానే తనతోటి బంధనాన్ని త్రెంపుకున్న ఈమె విషయంలో తన విధ్యుక్త ధర్మమేమీ లేదని నిశ్చయించుకున్నాడు వెంకటరావు. ఈమెకూ తనకూ స్వర్గపాతాళాల వార. నవనాగరికుడైన వెంకటరావు దృష్టిలో ఈ వార దాటరానిదైపోయింది. చటాలున వెనక్కు తిరిగి, తన కాలిబూట్ల ఇనపనాడాల టకటకలు చుక్కమ్మ గుండెల్లో సమ్మెట పోట్లలా మోగుతుండగా మాట్లాడకుండా వెళ్ళిపోయాడు నవనాగరికుడైన వెంకటరావు. గుండెల్లో తెల్లే రక్తమే కన్నెరైపారగా, గుండె ప్రేలిపోయే శోకంతో ఒక్కసారి "నా కొడుకా" అని అరిచి వెనక్కు విరుచుకుపడిపోయింది చుక్కమ్మ.



---

నాలుగైదు పెద్ద పెద్ద బ్యాంకులు పెట్టి విజయవంతంగా నడిపిన ఒక పెద్ద మనిషికి షష్టి పూర్తి వుత్సవం వైభవోపేతంగా జరుగుతున్నది. ఆ సందర్భంలో పత్రికా విలేఖరి ఒకడు ఆయన దగ్గరకు వెళ్లి "మీరు యీ బాంకింగ్ బిజినెస్ లో ఓం ప్రధమంగా ఎల్లా ప్రవేశించారో కొంచెం చెప్తారా?" అని సవినయంగా అడిగాడు.

"దానికేముందీ? నాకా రోజుల్లో చెయ్యటానికి ఏపనీ దొరకలేదు. చాలా దీర్ఘంగా ఆలోచించి, ఒకరోజు వుదయాన్నే మా వీధి వాకిట్లో 'బాంక్' అని పెద్ద అక్షరాలు వ్రాసిన బోర్డు ఒకటి తగిలించాను. అరగంట గడిచేలోగా ఒక పెద్దమనిషివచ్చి రు. 100 డిపాజిట్ చేసి వెళ్లాడు. మరొక పదినిమిషాలు గడిచేలోగా యింకో పెద్దమనిషి వచ్చి రు. 200 లు డిపాజిట్ చేశాడు. దాంతో నాకు ధైర్యంవచ్చి, నాడబ్బు పది రూపాయలుడిపాజిట్ చేశాను." అన్నాడు ఆపెద్దమనిషి.

# ఎదురు తురుపు

"ఇంత చీకట్లో ఒక్కతెవూ ఇంటికి వెళ్ళగలవా? రోజూ ఎన్ని భయానకమైన హత్యలు జరుగుతున్నాయో పత్రికలు చూస్తే తెలుస్తుంది. నిజంగా నీకు మతిపోతున్నాది డియర్... నేను కూడా నీతో వస్తాను...మాట్లాడవేం డార్లింగ్... నేను రావటం నీకు ఇష్టం లేదన్నమాట. అయితే రేపు కలుసుకుందాం అమ్మాయ్ గుడ్‌నైట్" అన్నాడు యువకుడు ఆ రాత్రి.

హాయిగా మజా ఐన భోజనంచేసి, నాలుగు బాదంఖీర్లు త్రాగిన అమ్మాయి గబగబా మెట్లు దిగి రోడ్డుమీదకు వచ్చింది రోమను రాణులకున్న గాంభీర్యంతో. బాట నిర్మానుష్యంగా వున్నది. రావణాసురుని మీసాల్లా కారుచీకట్లు. ఒక చింత భయంతో సుందరి వణికిపోయింది. అకస్మాత్తుగా పరుగు మొదలుపెట్టింది.

దూరంగా ఉన్న మసకదీపపు వెలుతురులో ఏదో మనుష్యాకారం కన్పించిందామెకు. తెల్లని పళ్ళన్నీ బయటపెట్టి ఎవడో దుర్మార్గుడు వికటాట్టహాసం చేస్తున్నట్టూ, అతని చేతిలో పిస్తోలు ఉన్నట్టూ ఆ జవ్వని ఊహించుకుంది. జీవితం ఒక పీడకల. సుందరస్వప్నం కరిగిపోయింది. ఆమె దీపందగ్గరకు వచ్చింది. అక్కడ వున్నది ఎవరో ఒక ముదుసలి అనాథస్త్రీ. ఇరవై గజాల దూరంలో బెంచీమీద ఇంకొక మానవాకారం గోచరించింది ఈ అందాలరాణికి. అబ్బే ఈ మనుష్యులను నమ్మకూడదు. సృష్టి అంతా మోసం, దగా. బెంచీమీద మనిషి పోలీసువాడేమో? అయినా పోలీసు వాళ్ళలో మాత్రం ఏమంత నిజాయితీ ఉందిలే అనుకుంది అమ్మాయి.

గుండెలు ఆగిపోతాయేమో అన్నంత తీవ్రంగా ఆమె పరుగు లంకించుకుంది. ఆవిడ చేతుల్లోంచి రెండుమూడు వస్తువులు క్రిందపడిపోయాయి. ఒక్కొక్క అడుగ ముందుకు వేస్తున్నకొద్దీ ఒంటరితనం ఎక్కువవుతున్నది.

అడ్డదారిగుండా ఇంటికి వెళ్లాలనుకున్న తోయజాక్షి దారితప్పింది. అప్పటికి రాత్రి పన్నెండు గంటలయింది. ఇద్దరు మనుష్యులు తనను వెంబడిస్తున్నట్టు అకస్మాత్తుగా ఆమె గుర్తించింది. ఆమె గుండె ఘామ్మని పేలిపోయినంత పని అయింది. గబగబా సమీపంలో వున్న ఇంటిదగ్గరకు వెళ్ళి తలుపు కొట్టింది. ఎవరూ తలుపు తీయలేదు. సాలెపురుగు బొద్దింకను పట్టుకుంటుందేమో! మళ్ళీ ఆమె పరుగు మొదలుపెట్టింది. సుదూరంలో ఆమె వెనుక రెండు నీడలు. వాళ్లను

## శ్రీ గోపాల చక్రవర్తి

బోల్తా కొట్టిద్దామనుకుని చప్పున ఒక సందులోకి తిరిగింది ఆమె. ఈ సందు మరీ అంధకారంగా వుంది-అజ్ఞానుని మస్తిష్కంలా. ఆమె కట్టెదుట ఎవరో ఒక మనిషి కన్పించాడు. భగవంతుడు నాలో వున్నాడు. ఈ లోకంలో మాత్రం సత్పురుషులు ఉండరా అనుకుంది అమ్మాయి. అతను కూడా ఇంటికి వెళ్తున్న మనిషి కాబోలు. అతనివద్దకు వెళ్ళి "ఏమండోయి. ఆపదలో వున్న స్త్రీని. ఎవరో ఇద్దరు దుర్మార్గులు నన్ను వెంబడిస్తున్నారు. మీరు రక్షించాలి" అంది గుక్క తిప్పుకోకుండా. "నేను మూడో దుర్మార్గుణ్ణి" అని కఠోరంగా అరుస్తూ ఆ పురుషవ్యక్తి ఆమె నెత్తిమీద బలంగా ఒక దెబ్బవేశాడు. చైతన్యం లేకుండా కుప్పలా ఆమె కూలిపోయింది, ధాత్రీమాత వొడిలోకి. ఆమె మెడలో వస్తువులు కాజేసి ఆ బుద్ధిమంతుడు పలాయనం చిత్తగించాడు.

సరిగా ఈ సమయానికే ఆమెను వెంబడిస్తున్న ఇద్దరు మగవాళ్ళూ సందు మలుపులోకి వచ్చారు.

"అబ్బే ఆవిడ ఈ సందులోకి రాలేదురా భాయ్. ఈసరికి హాయిగా ఇంటికి వెళ్ళిపోయి వుంటుంది" అన్నాడు ఒకడు.

"అదే నేనూ అనుకుంటున్నాను బ్రదర్. ఆమె సురక్షితంగా ఇలు సేరి వుంటుంది.



అయినా ఇంత రాత్రివేళ ఒంటరిగా [illegible] వాళ్ళు తిరగడం మంచిదికాదు సుమీ" అన్నాడు రెండోవాడు.

"నిజం సుమీ. మనమే ఆమెకు కనబడకపోతే ఏ దొంగో ఆమె గొంతుక నులిమివేసేవాడే" అన్నాడు మొదటివాడు.

వాళ్ళిద్దరూ 'లారలప్పా' పాడుకుంటూ పయనం సాగించారు. ★

(ఒక ఆంగ్ల కథకు అనుసరణ)

# అశాంతి

శ్రీ జె. రాఘవేంద్రరావు

ఆ లాడ్జిలో చక్రవర్తీ, నేనూ రెండేళ్లనుంచి, ఒకే గదిలో ఉంటున్నాము. క్రిందటి సంవత్సరం, చక్రవర్తి చాలా బుద్ధిమంతుడనీ, ఒకరి జోలికీ శొంఠికీ పోడనీ, మంచి సంస్కృతి కలవాడనీ పేరు సంపాదించేడు. ఈ సంవత్సరం, అతని ప్రవర్తనలో విపరీతమైన మార్పు వచ్చింది. లాడ్జిలో ఉన్న వాళ్లందరం, అతన్ని ఒక్కరోజైనా ఉండనివ్వకూడదని తీర్మానించుకున్నామంటే, అతని ప్రవర్తన మాకెంత దుర్భరమైందో బోధపడుతుంది.

నాకు చిత్రకళలో కొంత ప్రావీణ్యత ఉంది. గుంటూరులో చిత్రకళా ప్రదర్శనం పెడుత [illegible] తెలిసి, ఒక చిత్రం తయారుచేసేను. అది వరూధిని ప్రవరాఖ్యుణ్ణి బలవంతం చెయ్యడం. చూసినవాళ్లందరూ అద్భుతంగా ఉందన్నారు. నేనూ, ఏదో ఒక బహుమానం తప్పకుండా వస్తుందని అనుకొన్నాను. ఒక రోజు మధ్యాహ్నం, గదికి వచ్చేసరికి చక్రవర్తి, వరూధినికి మీసాలు పెడుతున్నాడు. నేను తెల్లబోయి "అదేం పని! చక్రవర్తీ" అన్నాను, చేసినదంతా బూడిదపాలయ్యిందే అన్న బాధతో. "అచ్చే! ఆ యిద్దరిలో మగవాడెవరా అన్న సందేహం రాకుండా అలా చేసేను" అంటూ బయటకు పోయాడు చక్రవర్తి.

ఒకసారి చక్రవర్తి, మా గదికి ఒక స్నేహితుణ్ణి తీసుకొని వచ్చేడు. ఆయన పరిచయమయ్యాక, నన్ను "మీది పెంటపాడు కాదూ" అని అడిగేడు. నేను కాదని జవాబిచ్చేను. కాని కుతూహలం ఆగక "మాది పెంటపాడని మీరెలా అనుకున్నారని" అడిగేను. అయన "అచ్చే! ఊరికనే" అని నవ్వేడు. "ఆ! పెంటపాడు బైరాగులకు ప్రసిద్ధిలే" అన్నాడు చటుక్కున చక్రవర్తి. నా ముఖం కందగడ్డలా అయింది సిగ్గుతో. అతని ధూర్తత్వానికి వళ్లు మండిపోయింది.

ఒకరోజున మేమిద్దరం, కాఫీ హోటలుకి వెళ్ళేం. రెండేసి యిడ్లీలు తెప్పించుకున్నాం. కారప్పొడీ, నెయ్యీ వేసి యిచ్చేడు. చక్రవర్తి ఊరుకోక చట్నీ కావాలన్నాడు. సెర్వరు చట్నీ తెచ్చి అతని ప్లేటులో వేసేడు. అందులో బొద్దింక రెక్క కనపడింది, నాకు. "ఏయ్! చక్రవర్తీ నీ చట్నీలో బొద్దింక" అన్నాను గట్టిగా. అతను ఒక నిమిషం చట్నీకేసి ముఖం చిట్లిస్తూ చూసి, తటాలున స్పూనుతో కొంత చట్నీ తీసి నా ప్లేటులో వేసేడు. సగం సగం తిన్న ప్లేట్లు వదిలేసి లేచిపోయాం. అతని యీ విపరీత ప్రవర్తన నాకు అర్థం కాలేదు. మొదటి సంవత్సరంలో, అతనంటే నాకొక విధమైన గౌరవభావం యేర్పడింది. అందువల్ల యీ అత్యాచారాలు నాలో విభ్రాంతిని కలుగజేస్తున్నాయే కాని క్రోధం వరకూ రానివ్వలేదు.

అయితే, అతని యీ వింత ప్రవర్తన నా ఒక్కడియెడలనే పరిమితం కాలేదు. ఒక రోజు భోజనాలదగ్గిర ఒకరు హంపీ యాత్రకు వెళదాం అన్నారు. ఆ రాత్రి మీటింగు పెట్టేము. ఒకడు చదువు పాడవుతుందిరా అన్నాడు. మరొకడు మా నాన్న డబ్బివ్వనన్నాడు. ఇంకొకడు తన వంట్లో బాగుండలేదన్నాడు. మొత్తంమీద ఆ తీర్మానం మూలబడింది. తెల్లవారి, లేచి చూచేసరికి మా లాడ్జిమీద తాటికాయ అంతేసి అక్షరాలతో "వితంతు శరణాలయం" అని మసిబొగ్గుతో, రాసి ఉంది. దారినిపోయే వాళ్ళంతా, చదివి, విరగబడి నవ్వుతున్నారు. దాని అర్థం, మేమంతా వట్టి చవటలమన్న మాట. ఇది చక్రవర్తి పని అని తెలియటానికి ఆట్టే సేపు పట్టలేదు. మా లాడ్జి మెంబర్లందరికీ కోపం వచ్చింది. కొందరు అతన్ని నిలేసి అడిగేరు. అతను చిరునవ్వు నవ్వి తల పంకించి వెళ్ళిపోయేడు. ఆ ముఖంలో ఏ భావమూ ప్రస్ఫుటం కాలేదు.

మా లాడ్జికి ఆనుకొని ఒక పెద్దసావిడి ఉంది. అందులో ఒక శాస్త్రిలుగారు పురాణం చెపుతున్నాడు రోజూ. ఆ చుట్టుపట్ల ఉన్న పనిలేనివాళ్లంతా చేరుతారు వినడానికి. ఈ జనాన్ని చూసి శాస్త్రిలుగారు ఉత్సాహంతో పరవశత్వం చెంది "తాళ్ళపాకవారి కవిత్వం కొంత, తన పైత్యం కొంత" అన్నట్లు, అసలుకు చిలవలకి, పలవలు చెర్చి చెప్తూ ఉంటాడు. ఆయనకి మేమంటే కోపం, వేళాకోళం చేస్తామని. "కాగ కాగ పాలు - అలాగే ఉంటుంది మీకు" అంటూ ఉండేవాడు. ఒకరోజున జోరుగా సాగుతోంది పురాణం. ఏమి బుద్ధి పుట్టిందో కాని, చక్రవర్తి ఆడవాళ్ళు ఉన్నవైపు కిటికీదగ్గరకు వెళ్ళి "కప్పు"మని భయంకరంగా కేకపెట్టేడు. ఆ కేకకు పిల్లలు జడుసుకున్నారు. ఆడవాళ్ళు, ఒకళ్ళమీద ఒకళ్లు పడిపోయారు. పెద్ద గల్లంతయిపోయింది. మాపై కసితీర్చుకోవడానికి అవకాశంకోసం చూస్తున్న శాస్త్రిలుగారు కళ్లెఱ్ఱజేసి "సోదరులారా! ఈదురాగతాన్ని మీరెలా సహించగలరు? మీ సోదరీమణులపై జరిగిన యీ అత్యాచారాన్ని చూస్తూ ఊరుకుంటారా? మీలో పౌరుషం లేదా?" అని రెచ్చకొట్టేడు. "కొట్టండి-పొడవండి" అంటూ ఆ మూకంతా వచ్చి మా లాడ్జిమీద పడ్డారు. మేము సింహద్వారం వేసేసి ప్రాణాలు, అరిచేతుల్లో పెట్టుకొని కూర్చున్నాం.

"ఇంటిదగ్గరనుంచి తేరగా వచ్చినడబ్బు తెగతినికొట్టుకుంటున్నారు. కొడుకుల కాళ్ళు చేతులు విరగదీసేద్దాం" అని అరుపులు వినబడుతున్నాయి బయట. చక్రవర్తి ఏమయ్యాడో తెలియదు. ఒకగంట దాకా గొడవచేసి ఎవరిదారిని వాళ్లు పోయారు. మేము బ్రతుకుజీవుడా అనుకున్నాం.

ఆ రాత్రి మీటింగు పెట్టి, చక్రవర్తిని లాడ్జినుంచి బహిష్కరిస్తూ తీర్మానం చేశాం. విశేషమేమిటంటే తీర్మానం ఓటుకి పెట్టినప్పుడు అందరితోపాటు, చక్రవర్తికూడా చెయ్యి ఎత్తేడు. నా గుండెలో కలుక్కుమంది.

ఆ రాత్రి నాకు సరిగా నిద్రపట్టలేదు. చక్రవర్తిలో యీ మార్పుకు కారణం ఏమిటి? ఏదో నిగూఢమైన రహస్యం అతని జీవితాన్ని ఆవరించి ఉంది. అతన్ని పంపేయాలంటే ఏదో తెలియని బాధ కలుగుతోంది. ఉండనిస్తే మా ప్రాణాలమీదకు తెస్తున్నాడు. అతని మనస్తత్వం నాకు బోధపడటంలేదు.

తెల్లవారింది. చక్రవర్తి ప్రక్కమీద లేడు. నాకు ఖంగారు పుట్టింది. బల్లమీద ఒక కవరు కనబడింది. వణుకుతున్న చేతులతో తీసి చదివేను.

రాజీ!

నన్ను మీరంతా లాడ్జినుంచి బహిష్క-

రించేరు. చివరకు నీకు కూడా చెప్పకుండా జారుకు పోయాను. నేను వెళ్లిపోతున్నాను. కాని ఎక్కడికి వెడుతున్నానో నాకే తెలియదు.

ఇంతకాలం దురభిమానంతో హృదయంలోనే దాచుకున్న నా దుఃఖమయగాథను నా ప్రాణస్నేహితుడవైన నీముందు పెడుతున్నాను.

క్రిందటి వేసవికాలం సెలవుల్లో మనం యిద్దరం బయలుదేరేము. నేను బెజవాడలో దిగిపోయాను. ఇంటికి వెళ్లేను. మా నాన్న పలకరించేడు కాని ఆయనలో నన్ను చూచినప్పుడు ఉండవలసిన ఉత్సాహం కనిపించలేదు. అటూ యిటూ తిరిగి దొడ్లోకి వెళ్లేసరికి అక్కడ దంపుళ్ళ సావిడిలో మంచం మీద ఒక స్త్రీ పడుకొని ఉంది. చిక్కి శల్యమైపోయిన శరీరం. విపరీతంగా దగ్గుతోంది. ప్రక్కన బల్లమీద మందు సీసాలు వగైరాలు ఉన్నాయి. క్షయవ్యాధిలా కనబడింది. నేను భయంతో మానాన్న దగ్గరకు వెళ్ళి "నాన్నా! ఎవరా మనిషి-క్షయ కాబోలు" అన్నాను. ఆయన ముఖంలో కాంతి లేదు. "ఎవరో నిర్భాగ్యురాలు! మన గుమ్మంముందు పడిపోయింది. లోపలికి తెప్పించి కొద్దిగా వైద్యం చేయిస్తున్నాను. నయమవుతుంది. నీకు భయమైతే ఆ వైపు పోకు" అని చెప్పి మా నాన్న వెళ్ళిపోయాడు.

అనారోగ్యం అంటే ఎంతగానో భయపడే మానాన్న ఒక భయంకరమైన అంటు వ్యాధితో బాధపడే, ఊరూ పేరూ లేని మనిషికి, యింత శ్రద్ధగా వైద్యం, పథ్యం పానం చూస్తున్నాడంటే అదంతా కారుణ్యమే నని నే ననుకోలేకపోయాను. అక్కడలో ఏదో ఒక నిగూఢ రహస్యం యిమిడి ఉందేమో ననిపించింది.

ఒకనాటి అర్ధరాత్రి పీడకల వచ్చి, హఠాత్తుగా మెలకువ వచ్చింది. మానాన్న పక్కమీద లేడు. తలుపు దగ్గరగా వేసి ఉంది. అనుమానంవేసి దొడ్లోకి వెళ్ళేను. దంపుళ్ళ సావిడిలో మెల్లగా మాటలు వినపడుతున్నాయి. అటు చూసేను. బుడ్డిదీపపు వెలుగులో ఆ రోగి మంచంప్రక్కన ఉన్న కుర్చీమీద నాన్న కూర్చుని మాట్లాడుతున్నాడు. ఆ మాటలు వినాలన్న కుతూహలం కలిగింది. చుట్టూ తిరిగి వెళ్ళి దగ్గరగా కిటికీ నీడలో నిలబడ్డాను.

"నే నెంతమాత్రం అంగీకరించను. వాడు తన తల్లి చిన్నతనంలోనే చచ్చిపోయిందన్న అభిప్రాయంలో ఉన్నాడు. ఇప్పుడు నువ్వు వెల్లడిచేస్తే వాడి భవిష్యత్తు నాశనమయి పోతుంది."

"నేను నా బిడ్డను 'నాయనా' అని పిలవకుండా ఆగలేను."



కిటికీదగ్గరకు వెళ్లి కొడుకుని కేక పెట్టాడు.

"వాడిని ఏడాది పిల్లాడప్పుడు వదిలేసి, సంసారాన్ని లెక్కచేయకుండా, కామాంధకారంలో పడి లేచిపోయినప్పుడు యీ పుత్రప్రేమ ఏమయిపోయింది? నేను ఆ పసికాణ్ణి చేతుల్లో ఉంచుకొని దూరంగా యీ ఊరువచ్చి యిక్కడ క్రొత్తజీవితం ఆరంభించి సమాజంలో ఘరానాగా బ్రతుకుతున్నాను. ఈ ఇరవైసంవత్సరాలూ అక్కరలేని కొడుకు యీనాడు కావలసి వచ్చేడా? నువ్వు ఆనాడు నన్ను నాశనం చేసేవు. ఈనాడు నీ కొడుకును నాశనం చెయ్యడానికి చూస్తున్నావు."

"నా జీవితం యిక రోజుల్లోకి వచ్చింది. నాలో ప్రతి అణువూ నా కొడుకుకోసం ఘోషిస్తోంది. పుత్రప్రేమ నాలో ఒక ప్రవాహంలా జలపాతంలా విజృంభిస్తోంది.

నేను విడిగా ఉన్న స్మృతి నాకది తట్టలేదు. ఈనాడు నా కొడుకు - నా రక్తాన్ని



'మోత'

శ్రీ వి. చంద్రమౌళీశ్వరరావు, విజయనగరం.

తిరిగింది కన్నులముందు అంధకారం వ్యాపించింది

ఎలావెళ్లి నా పక్కమీద వాలేనో నాకే తెలియదు. నా కర్తవ్య మేమిటి? నేను ఏమీ తెలియనట్లు నటించి, సంఘంలో జరుగుతున్న వివాహాగౌరవాన్ని కాపాడుకోవడమా? లేక చనిపోయేముందు మా అమ్మకోరిన ఆ చిన్న కోరికను తీర్చి ధైర్యంగా నిజపరిస్థితిని అంగీకరించడమా? ఒకటి ఆత్మకు ద్రోహం - రెండవది సరళి నాశనం. ఆ రాత్రి నా హృదయం దుర్భరమైన వేదనాగ్నిలో వేగిపోయింది ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియదు. మెళకువవచ్చేసరికి తెల్లవారింది ఒక్క దూకులో దొడ్లోకి పరిగెత్తేను. అమ్మను పలకరించటానికి ఆమె - మా అమ్మ అప్పటికే వెళ్ళిపోయింది. నేను హతాశుణ్ణయి పోయాను.

రెండురోజులతర్వాత కృష్ణానదిలో ఒక అనాథ స్త్రీ శవం తేలినట్లు తెలిసింది అది మా అమ్మదేనని తెలుసుకోవడానికి, అలస్యం కాలేదు.

రాజా! ఆ అనంతమైన వేదనని లోన యిముడ్చుకొని యిక్కడకు వచ్చేను. నాలోని అశాంతి, బయటి వాతావరణంలోని శాంతిని భరించలేకపోయేది. దాని ఫలితమే యీనాటి నా విపరీత ప్రవర్తనకు కారణం. నేను ఒంటరితనాన్ని భరించలేక సెలవులైపోకముందే యిక్కడకు వచ్చేసేను. ఇక్కడ సంఘంలో కూడా ఉండలేకపోయాను ఇప్పుడు వెళ్లిపోతున్నాను.

రాజా! విశ్వనాథా! నా విషాదగాథ! ఈ నిర్భాగ్యుణ్ణిగురించి ఏదైనా విశ్వాసకరమైన వార్త వింటే, ఒక కన్నీటిబొట్టును మాత్రం విడువు అది చాలు.

హతభాగ్యుడు చక్రవర్తి.

★

 అశాంతి 

పంచుకొని పుట్టిన నా బిడ్డ నా కళ్ళముందు తిరుగుతూ నన్ను గుర్తించడంలేదు. వాడు 'అమ్మా' అని ఒకసారి పిలుస్తేచాలు, నేను నిశ్చింతగా ప్రాణాలు వదులుతాను."

"అలా కుదరదు. నీ యీ విపరీతమైన కోరిక వాణ్ణి సర్వనాశనం చేస్తుంది. ఈ యిరవై సంవత్సరాలు నా రక్తం ఓడ్చి చేసిన పరిశ్రమ అంతా వ్యర్థమైపోతుంది నీ స్వార్థంకోసం నీ కొడుకును నాశనం చెయ్యాలని చూస్తున్నావు"

కొంచెంసేపు నిశ్శబ్దం.

"అవును నిజమే నేను రేపు ఉదయమే యిక్కడనుంచి వెళ్ళిపోతున్నాను"

"ఎక్కడికి?"

"ఎక్కడనుండి వచ్చేనో - అక్కడికే"

ఆమె నా తల్లి నేను యిక ఒక్క నిమిషం కూడా ఆగలేకపోయాను నా బుర్ర గిర్రున

సీరియల్

# పత్రత

## 26

ఏ నిస్వార్థజీవి ఆశీస్సుల ఫలితంగా - ఆకర్షణాయుత బోధనలతో - విద్యావేత్తలుగామారి, మానవుల్లో కొందరు ఉన్నత ఉద్యోగాలు పొందే యోగ్యత సంపాదిస్తున్నారో - విజ్ఞులుగా - విమర్శకులుగా తయారవుతున్నారో; ఆలోచిస్తే ఓనమాలు దిద్దించిన ప్రాథమిక ఉపాధ్యాయుడు గుర్తుకొస్తాడు. తన విద్యాభవనం వివిధ కుంచులతో వింతవింత రంగులతో చిత్రించినా పునాదిమాత్రం అదేనని ఎవరూ విస్మరించలేరు - అయితే వాళ్ళు మారినా వారితోబాటు లోకం కొంత మారినా ఆ గురుదేవుని స్థితి మారదు.

పిల్లలు వస్తూనే ఉంటారు. విద్యాభిక్షనందుకొని, వినోదంగా నవ్వుతూ వెళ్తూనే ఉంటారు. కాని ఉన్నతస్థితికి వచ్చిన ఒక్క విద్యార్థికూడా పాతబడ్డ ఉపాధ్యాయుని జీవితాన్ని పర్యవలోకనం చేయడానికి యిష్టపడడేమో; బహుశా ఆ సమస్య పెద్దదిగా అతని దృష్టిలో ఉండదేమో. కాని దేశానికీ, జాతికీ, విద్యాదాతనైనా ఆ పేద అధ్యాపకుడు భూతకాలంయొక్క వైభవాన్ని చూసుక మురిసిపోతాడు. వర్తమానానికి విచారిస్తాడు. భవిష్యత్తు భాగ్యతగా ఉండాలని భావిస్తాడు. ఆశ నెరవేరకుండానే కలేమికి కుటుంబాన్ని అంకితంచేసి, కన్నబిడ్డల భవిష్యత్తుని కన్నదేశానికే విడచిపెట్టి కారే కంటినీటితో కళ్లు మూస్తాడు.

ధర్మయ్య జీవితం కూడా సహజానికి భిన్నంగాకుండా అలాగే సమాప్తిఅయింది.

ధర్మయ్య పెద్దకార్యం కూడా అయిపోయింది. మరి నాలుగురోజులకు, కోర్టులో బోనులో నిలబడ్డ రవిని హంతకుడుగా, దోపిడీదారునిగా, నిరూపించడానికి, జమిందారు తరఫు ప్లీడరు చాలా కృషిచేశాడు.

రవికి ప్లీడరు లేడు. కాదని నిరూపించడానికి తగిన సాక్ష్యంకూడా లేదు. అగమ్యంగా చూస్తూ ఆలోచనారహితంగా, కొన్నింటికి "ఊఁ" కొడుతూ, "నిజంకాని వాటికి నిర్లిప్తుడుగా ఊరుకుంటూ చంచలదృష్టితో కోర్టంతా కలయ చూస్తున్నాడు.

కావలసినవాళ్లు ఎవరూ రాకపోవడం రవికి చాలా బాధగానే తోచింది. కనీసం ధర్మయ్యకూడా రాలేదంటే కారణం ఏమిటో అతనికి అంతుపట్టలేదు.

"నీకు సాక్షులెవరైనా ఉన్నారా?" న్యాయాధిపతి ఉన్నత స్థానంలో కూర్చొని దయాపూరితంగా అడిగాడు రవిని.

రవిమాట్లాడలేదు. ఎదురుగా నిలబడ్డ వకీలు ప్రక్కగా కూర్చున్న జమిందారు కేసి చూశాడు. రవి మొగం క్రోధంతో మలినమైంది.

శ్రీ పినిశెట్టి
శ్రీరామమూర్తి

"ఏం మాట్లాడవు" ఈ సారి వకీలే గద్దించి అడిగాడు.

"ఎవ్వరూ లేరు" బాధగా బిగ్గరగా సమాధానమిచ్చాడు రవి.

"ఉన్నాను" అంతకన్నా బిగ్గరగా ఆ జనసమూహంలోనుంచి ఒక కంఠం వినిపించింది. అంతా అటు చూశారు.

రాము బోను దగ్గరగా వచ్చి నిలబడ్డాడు. అంతా ఆశ్చర్యంగా చూశారు. దెబ్బ తిన్న వ్యక్తే ముద్దాయితరఫున సాక్ష్యం చెప్పడానికి వస్తే ఆశ్చర్యపడకుండా ఎవరుండగలరు?

రాము బోను ఎక్కినతర్వాత, జరిగిన విషయాన్ని జంకు లేకుండా పూర్తిగా న్యాయాధిపతికి తెలియచేశాడు.

"కేసు విచిత్రంగానే ఉంది. కాని అనుకున్నంత విపత్తుతో కూడిన విశేషం లేకపోవడమే ఆశ్చర్యం" అని మెల్లగా గొణుక్కుని "నేరారోపణ నిరాధారమైంది" అని చెప్పి కేసుకొట్టివేసి, లేచాడు న్యాయాధిపతి. ఈ అపజయంతో గంగాధరం తల క్రిందకు దించుకపోయింది. క్రోధంగా రాము కేసిచూశాడు.

రాము తండ్రిదృష్టినుండి తప్పుకొని పోలు వెలుపలకు వచ్చి నిలబడ్డాడు. జమిందారు కూడా అక్కడికే వచ్చాడు. క్రుంకే పొద్దు చాయలను, చూస్తూ నిలబడ్డాడు. వాళ్లిద్దరి కెదురుగా కారు వచ్చి ఆగింది. తీర్పువిన్న డ్రైవరికి కూడా - వాడిపోయిన జమిందారు మొగం చూస్తే; జాలివేసి వట్లనిపించింది.

"గుండెల్లో గుర్తుంటుంది" కంపితంగా-బరువుగా - ప్రక్కనుంచి దూసుకుంటూ వచ్చిన, ధ్వనికి జమీందారు వెనక్కి తిరిగి చూశాడు. పోలీసుప్రక్కగా ఉన్న రవి అప్పుడే చాలాదూరం వెళ్లిపోయాడు.

"కారు ఎక్కు" రామును చూస్తూ గంగాధరం ఆజ్ఞాపించాడు. రాము కారు ఎక్కి ఒక మూలగా ఒదిగి కూర్చున్నాడు. జమిందారు కారు ఎక్కి తీవ్రంగా ధ్వనించేటట్లు తలుపు దభాలునవేశాడు.

కారు మెల్లగా కదిలింది.

"నీఉద్దేశం?" కఠుగా-హఠాత్తుగా జమిందారు ఈప్రశ్న వేయడం, రాముకి భయమే కలిగించింది. కాని సమాధాన మివ్వలేదు.

తండ్రి యింటిదగ్గర చెప్పినదానికి విరుద్ధంగా, ప్రవర్తించిన రాము, ఎందుకలా చేశానో, అని ఆలోచిస్తున్నాడు. ఒక నిర్దోషిని నిందితునిగా చిత్రించి, శాశ్వతంగా బంధించ ప్రయత్నిస్తుంటే హృదయమున్న ఏమానవుడూ చూస్తూ ఊరుకోలేడేమోనని అనుభవంమీద గ్రహించాడు రాము. అయితే మధ్యపడిన ఏకోదరత్వం ద్వారా ఉప్పొంగిన హృదయావేదనే ఆలా చేయించిందనే సంగతి అతనికి తెలీదు.

"శాంతమ్మ ఏమన్నా చెప్పిందా?"

ఏదో అదురు అంతరాన మెదలడంవల్ల జమిందారు మెల్లగా అడిగాడు.

"లేదు" అని రాము సమాధానమిచ్చాడు.

"మరెందుకలా చెప్పావ్" అంటూ బిగ్గరగా అరచాడు. డ్రైవరు ఒక్కసారి ఉలి

# ★ దత్తత ★

క్కి పడి, వెనక్కి తిరిగిచూసి, మళ్లా సరుదుక్కూచుని కారు నడిపిస్తున్నాడు

"జరిగింది చెప్పకపోతే నిజమేలా తెలుస్తుంది?"

"ఈ నిజం చెప్పడానికే కోర్టుకి వచ్చావా?"

"అబద్ధంకోసం మీరు కోర్టుకు రమ్మని చెప్పినా-రవికి జరిగే అన్యాయానికి నిజం చెప్పక తప్పలేదు." అని మెల్లగా తండ్రి కేసిచూస్తూ "అయినా రవిపై కేసు పెరాఫు చేస్తే మీకు వచ్చే ఫలితం?" అని అడిగాడు

"నోర్ముయ్" అంటూ ఒక్కసారి శరీరాన్నంతా కదల్చి రాముని ఉరిమి చూశాడు రాము మాట్లాడ లేదు

కారు జమిందారుభవంతి చేరుకుంది కనుచీకట్లో వీధివెంబడి తలవంచుకొని విసురుగావస్తున్న రవిని చూసినవాళ్లల్లో కొందరు ఆశ్చర్యపడ్డారు మరికొందరు విచారంగా తలపంకించారు

తనకు అయాచితంగా లభించిన స్వల్పకాల జైలుజీవితమే పరిచయస్తుల భయాశ్చర్యాలకు కారణమని ఊహించుకుంటూ ధర్మయ్యయింటిగుమ్మం ఎక్కాడు రవి

చావిట్లో ఎవరూ ఉన్నట్లు కనిపించలేదు దీపం వెలుగుతోంది ఓరగా వేసిన తలుపు రెక్కను తోసుకొని లోపలకు వెళ్లాడు. ధర్మయ్యఉండేగది గొళ్ళెం వేసిఉంది.

"బావా!" గద్గదికంగా కంఠం వినిపించింది. వెనక్కి తిరిగి చూశాడు లక్ష్మి అవతల గదితలుపు ప్రక్కగాకూర్చుని కళ్ళనీళ్ళు కారుస్తోంది.

దొడ్డిలోనుంచి బిందెతో నీళ్లు తీసుక వచ్చిన కాంతమ్మ రవినిచూసి స్తంభీభూతురాలైంది.

"అమ్మా" అంటూ ఆసక్తిగా రవి పిలచాడు.

"బాబూ" అంటూ అశ్రునయనాలతో బిందె ప్రక్కగా దింపి రవి దగ్గరగావచ్చింది

తైలధారగా కారుతున్న లక్ష్మి కంటి నీటిని రవి మళ్ళీ చూశాడు అనుమానం కలిగింది. కాంతమ్మకేసి విమరనగా చూశాడు.

"అన్నయ్య యిక లేడు" రోదన స్వరంతో కాంతమ్మ అంది

"ఆఁ!" భయంగా ఒక్కసారి అరచాడు రవి

"ఫలితంలేని పెళ్ళి అన్నయ్య ప్రాణాలనే బలిగా తీసుకుంది" కళ్లనీళ్లు తుడుచుకుంటూ కాంతమ్మ అంది

రవి వటెంట చతికిలబడ్డాడు అతని కళ్ళల్లో నీళ్లు క్రమ్ముకున్నాయి ధర్మయ్య అంటే రవికున్న ప్రేమాభిమానాలు రవి అంతరాత్మకే తెలుసు

శ్వాసను గట్టిగా పీలుస్తూ, కారే కంటి నీటిని చేత్తో విసురుగా తుడుచుకొన్నాడు

అతని కళ్ళల్లో రక్తనాళాలు ఒక్కసారే ఉబికాయి జమిందారు విగ్రహం అతని మనోగగనంలో వికార స్వరూపాలతో విభ్రమణమౌతూవుంది

రవిరాకచూసిన మరిద్దరు పలకరింపుకోసం, ధర్మయ్య యింటి చావిడిలోకి వచ్చారు రవి వాళ్ళకేసి చూశాడు కాని రవిని చూసినవాళ్ళు పలకరించగల ధైర్యాన్ని పొందలేకపోయారు

"మాస్టారూ!" ఒక్కసారి ఆవేదనగా తనలో తనే గొణుక్కున్నాడు

"ఊరుకో బాబూ! ఏం చేస్తాం" వచ్చిన వారిలో ఒకతను వెనకనించి అన్నాడు.

"ఇంతకూ జమిందారే తన కడుపున పెట్టుకొన్నాడు లేకపోతే నిక్షేపంలాంటి సంసారం చూస్తుండగా ఈలా అయిపోవడమేమిటి? అని రెండో ఆసామీ సానుభూతిగా పలికాడు

రవి దిగ్గున పైకి లేచాడు గుమ్మంవైపు తిరిగాడు కాంతమ్మ భయంగా చూసింది. దగ్గరగా వచ్చింది

"మళ్ళీ ఎక్కడికి" అని ఆతురతగా అడిగింది

"వీలుంటే, వచ్చినచోటికే వెళ్ళాల్సి ఉంటుంది"

"అంటే?" అగమ్యంగా చూస్తూ కాంతమ్మ ప్రశ్నించింది

"జైలుకే" కతుగా పైకిచూస్తూ అన్నాడు.

"రవీ" అని కాంతమ్మ రవిచేతులు పట్టుకుంది కళ్ళల్లో తరుక్కున మెరుస్తున్న కన్నీటి పొరలతోనే తల్లికేసి చూసి, "అమ్మా! మాష్టారుఋణాన్ని మనం తీర్చుకోకుండానే ఆయన మరణించారు... ఆ మరణానికి కారణం మనం ఎవ్వరం మర్చిపోలేం ఈలాంటిఘోరమైన శిక్షను అనుభవించడానికి అతను చేసిన నేరం ఏమీ లేదు నేరం లేకుండా శిక్షించిన ఆ నేరస్తుడికి, నిజం తెలుసుకొని, నేరం ఉందని తెలిసికూడా ప్రతిఫలాన్ని అందజేయకపోవడం మంచిది కాదమ్మా" అని ప్రాధేయతగా తల్లిని చూస్తూ చేతులు ఆమెనుండి తప్పించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు రవి

"రవి పట్టుదలంటే మాటల్తో పనికాదు" అన్నాడు ప్రక్కనున్న పెద్దమనిషి

"ఈదెబ్బతో జమిందారు పస తేలిపోతుందిలే" అని తృప్తిగా నవ్వాడు రెండో అతను "మీరు బైటకువెళ్ళండి" కాంతమ్మ బిగ్గరగా అంది వచ్చినపెద్దలిద్దరూ మొదట్లో ఆశ్చర్యంగాచూసి, గుమ్మందగ్గరగావెళ్లి నిలబడ్డారు

మళ్ళీ కాంతమ్మ ఉద్రిక్త శాంత సమ్మిళిత స్వరంతో ఈలా అంది.

"వెళ్లండి బాబూ! మీ మాటలు ఈ సమయంలో ఉపకారానికన్నా అపకారం ఎక్కువచేస్తాయనేది మీరు మర్చిపోయారు. మీకున్న అభిమానానికి నమస్కారాలు పెడతాను వెళ్లండి"

ఆశ్చర్యంగా చూస్తూనే ఆ పెద్దలిద్దరూ గుమ్మందిగి వెళ్లిపోయారు వాళ్లు వెళ్లిన వెంటనే వీధితలుపు గడియవేసింది కాంతమ్మ

"స్నానానికిలే" రవిదగ్గరగా వచ్చి అడిగింది

"అక్కర్లేదు"

"నీక్కావలసింది నాకు తెలుసు"

"ఏమిటమ్మా అది" బాధగాచూస్తూ అడిగాడు రవి.

"నువ్వు గంగాధరంగార్ని ఏం చేద్దామనుకుంటున్నావో కాస్త చెప్పు"

శాంతమ్మ కేసి రవి చూశాడు అతని కళ్ళల్లో కసి ప్రతిబింబిస్తోంది. క్రోధంగా ఇలా అన్నాడు "ఎందువల్ల మాష్టారికి మరణం కారణమయిందో, ఆ మరణానికి కారణం ఎవ్వరో- వారికి అలాంటి శిక్ష యిస్తేనేగాని "ఇక మాట్లాడలేక, పళ్లు ఒకసారి కొరుక్కున్నాడు

"తరువాత" శాంతమ్మ అడిగింది కాని రవి సమాధానమివ్వలేదు మళ్లీ శాంతమ్మ "అంతకన్నా ముందు మరోపనిచేస్తే బావుంటుందేమో", అంది మెల్లగా—

"ఏమిటది" రవి ఆత్రంగా అడిగాడు

"ఆ శిక్ష ముందు నాకే యిస్తే"

"అమ్మా" రవి బిగ్గరగా బాధగా అరిచాడు

"ఏం?"

రవి మాట్లాడలేదు పిచ్చిగా అటూయిటూ పచారుచేస్తున్నాడు

దుఃఖపూరితవదనంలో భయాన్ని కూడా భద్రపరచుకుంటూ, మూలకూర్చున్న లక్ష్మి బిక్కుబిక్కుమంటూ రవిని చూస్తోంది

"రాక్షకులంటే, ఎవరు బాబూ?"

శాంతమ్మ మాట విని రవి వెనక్కు తిరిగి చూశాడు "మానవనాశనాన్ని కోరే గంగాధరంలాంటి వాళ్లు"అని చెప్పిమళ్లీ బింకంగా అడుగులు వేసుకుంటూ తిరుగుతున్నాడు

"మరి నువ్వు చేయబోయేపని" మళ్ళీ శాంతమ్మ అడిగింది.

"అలాంటవాళ్ళను నాశనం చెయడమే" తిరిగి చూడకుండా తలవంచి అడుగులు వేసుకుంటూనే రవి సమాధానమిచ్చాడు

"దాని పేరేమిటి?" ఈసారి శాంతమ్మ తీక్షణంగా అడిగింది ఆ ధ్వనికి రవి నిలచిపోయాడు విసుగ్గా తల్లి కేసి చూశాడు "అమ్మా! నన్ను చేటి వాగించకు నీళ్ళు తోడతానన్నావు కదూ? ఊఁ! కానియ్యి?" అంటూ లక్ష్మి ఉన్న గదివేపునకు వెళ్లాడు.

లక్ష్మి మొగంలో భయం తొలగిపోయింది. శాంతమ్మ దొడ్డివైపునకు వెళ్లింది

రవి భోజనం చేస్తున్న వైఖరి లక్ష్మికి మరీ అగమ్యంగా తోచింది

తీక్షణంగా యింటికప్పుకేసి చూస్తున్న రవి నోట్లో, చేయివేస్తున్న ముద్దలు పడుతున్నా యి పడిన ఆహారాన్ని పళ్లు నములుతున్నాయి అంతే, పదార్థాన్ని గాని రుచిని గాని అతను పరిశీలించే స్థితిలో లేడు అసంపూర్తి భోజనంతో హఠాత్తుగా పైకి లేచాడు

వంటయింట్లోంచి మజ్జిగ తీసుకవచ్చిన శాంతమ్మ, గిన్నె కేసి ఆశ్చర్యంగా చూస్తూ "అన్నమంతా అలాగు నేవుందేం?" అని అడిగింది

"ఆకలికావడల్లేదమ్మా "అన్నాడు అదో విధంగా బాధపడుతూ రవి పీట దగ్గరగా నిలిచిన రవి దగ్గరకు శాంతమ్మవచ్చింది

"ఎందుక్కావడల్లేదు?" అని మళ్ళీ అడిగింది

"ఏమో -" పైకి చూస్తూ సమాధానమిచ్చాడు

"దీనికన్నా జైల్లో భోజనమే బాగుందా?"

"ఔను! నాకదే రుచిగావుంది" అని చెప్పి క్రింద గ్లాసు తీసుకొని దొడ్డివైపునకు వెళ్ళాడు రవి

రవి చావిట్లో వేసిన మంచంమీద పడుకున్నాడు అతనికి నిద్దరపట్టలేదు ఒకసారి లేచి కూర్చున్నాడు శాంతమ్మ మెల్లగా తన గదిలోనుంచి వచ్చింది "మళ్ళీ లేచావేం?" అని అడిగింది

"అబ్బే! ఊరికే-" అంటూ తిరిగి పడుకున్నాడు రవి

రవి గురించి శాంతమ్మకు బాగా తెలుసు.

# ★ దత్తత ★

తలపెట్టినపని జరిగించేవరకూ అతను నిద్దర పోడు అయితే ఆపనిద్వారా జరిగే శేషాన్ని మానసికంగా దృశ్యరూపంలో చూసినప్పుడల్లా శాంతమ్మ భయకంపిత మౌతోంది

అరగంట గడచిన తర్వాత శాంతమ్మ మళ్ళీ చావిట్లోకి వచ్చింది తల్లి వస్తూన్న అలికిడివిన్న రవి చూస్తూన్న రెండు కళ్ళూ మూసి, గాఢనిద్రలో మునిగిపోయినట్లుగా మొగం పెట్టాడు శాంతమ్మ పరిశీలించిన మీదట, ఆందోళనారహితంగా ఒక నిట్టూర్పువిడచి, ఇష్టదేవుణ్ణి మనసులో ధ్యానించుకొని, తన గదిలోకి వెళ్ళిపోయింది

అదురుగా శాంతమ్మకు కనుకుపట్టింది వీధిలో భయంకరంగా అరుస్తున్న కుక్కల అరుపులు విని త్రుళ్ళిపడి లేచింది చావిట్లోకి వచ్చింది రవి మంచంపైన లేడు.

"లక్ష్మీ" బిగ్గరగా ఆందోళనగా శాంతమ్మ పిలచింది.

నిద్రలో ఉన్న లక్ష్మి ఉలిక్కిపడిలేచి, శాంతమ్మదగ్గరగా వచ్చింది

"రవి ఏడీ?" శాంతమ్మ ఆత్రుతగా అడిగింది లక్ష్మికి మాత్రం ఏం తెలుసు? వెర్రిగా మంచంకేసి చూసింది

"అనుకున్న పనిచేస్తాడేమో?" కంపించిపోతూ భయంగా చూసి "లక్ష్మీ! వెళదాం పద" అంటూ లక్ష్మిచేయి పట్టుకొని గుమ్మం దగ్గరగా వచ్చింది

"అమ్మా! ఇక్కడే ఉన్నా -" అనే రవి కంఠం విని ఇద్దరూ ఆగిపోయారు ధర్మయ్యగదిలోనుంచి రవి వచ్చాడు.

శాంతమ్మ లక్ష్మి ఆశ్చర్యంగా, చీకటిగా ఉన్న గదికేసి ఒకసారి, రవిమొగం కేసి ఒకసారి చూశారు

తన పెట్టెనుంచి తీసిన కైజారు మొలలో జొనుపుకున్న సంగతి తల్లికి తెలీకూడదనే భావంతో అర్థహీనంగా, భయంగాచూస్తూ నవ్వాడు

ఆ దుష్ట యత్నం శాంతమ్మమనస్సు గుర్తించ లేకపోయింది

"గదిలోకి ఎందుకు వెళ్ళావ్?" అని అడిగింది

"ఎందుకు వెళ్ళకూడదోనని వెళ్ళాను" అంటూ వెళ్లి రవి మంచంమీద కూర్చొని తల్లికేసి చూస్తూ "మనస్సేమీబాగాలేదమ్మా! ఆయన నివాసంతో పవిత్రమై ప్రశాంతంగా ఉన్న ఆ గదిలో కూర్చుంటే, శాంతి నాకు కలుగుతుందని కాస్సేపు కూర్చున్నాను" అని సమాధానం చెప్పాడు

ఈ మాటతో శాంతమ్మకు కళ్ళనీళ్లు తిరిగాయి లక్ష్మితో తిరిగి తన గదిలోకి వెళ్లింది. అప్పటికే అర్ధరాత్రి అయింది. ఇక రవి తన ప్రయత్నం విరమించుకున్నట్లుగా శాంతమ్మ నిర్ణయించుకొని నిద్దరపోతుందని రవి అనుకున్నాడు. మంచంకూడా శబ్దించకుండా రవి మెల్లగా లేచాడు శాంతమ్మ, లక్ష్మి పడుకున్న గది గుమ్మందగ్గరగా కాస్సేపు నిలచాడు బాగా నిద్రలో ఉన్నట్లుగా గుర్తించాడు. వీధి తలుపుదగ్గరకు వెళ్లి గడియమీద చేయి వేశాడు.

"నామాట విను రవీ! వద్దు" అనే శాంతమ్మమాటలు వినిపించి రవి సంభీభూతుడై పోయాడు తేరుకుని కాస్సేపటికి మెల్లగా మళ్లీ తల్లిఉన్న గదిదగ్గరకు వచ్చి తేరిచూశాడు. కాని అవి పలవరింతలుగా గుర్తించి దీర్ఘశ్వాసవిడచి, మెల్లగా వీధిగడియతీసి, బైటకు బయలుదేరాడు.

రవి జమీందారు ప్రహరీ గేటుదగ్గర నిలచాడు కాపలాదారు గాఢ నిద్రలో ఉండటం గమనించి, మెల్లగా గేటుపైకి యెక్కి ప్రహరీలోపలకు దుమికాడు.

భవంతి వీధిద్వారంగట్టిగా బిగించివుంది ప్రక్క కిటికీనించి పరిశీలిస్తే, రాము ఒక గదిలో పడుకొని నిద్దరపోతూ కనిపించాడు తన విడుదలకు కారణమైన రాముని మనస్సులో అభినందించుకున్నాడు.

పైభాగానికి పోవడానికి మరోదారిలేక స్తంభాల ఆధారంగా ప్రాకి, రెండో అంతస్తు అంచుని అందుకుని కార్యదీక్షలో కష్టాన్ని కూడా లెక్కచేయకుండా అంచుపై నిలచాడు.

గంగాధరం గది తిన్నగావెళ్లి లోపలకు చూశాడు. గంగాధరం ఒక మంచంపై పడుకుని చిన్నగా గుర్రుపెడుతున్నాడు

ప్రక్కగాఉన్న మరోమంచంపై భార్య పార్వతమ్మ పడుకొనివుంది ఏ కారణంగానో ఆమె అంత నిద్రలో ఉన్నట్లు రవికి స్ఫురించలేదు ఆమె మెళుకువగా ఉన్నంత మాత్రాన్న తన దీక్ష నెరవేరదనే నమ్మకం రవికి లేదు

అద్దాలతో అమర్చిన కిటికీని రవి తన్నాడు

"గళ్ళు"మనే శబ్దంతో రెండు అద్దాలు బద్దలై ప్రోగులుగా కూలిపోయాయి. త్రుళ్ళిపడి ముందుగా పార్వతమ్మలేచి రవిని చూసి కెవ్వున అరచింది

జమిందారు లేచాడు రవి లోపలకు దుమికాడు పార్వతమ్మ పరుగున క్రిందిభాగానికి వెళ్ళిపోయింది పోలీసుస్టేషనుకు ఫోను చేసింది తరువాత తలుపులన్నీ తెరచింది. జమీందారు ధైర్యంగానే తలగడదగ్గరకు దేవుతూ "నువ్వా" అని పరామర్శ చేస్తూ తలగడలోనికి చేయి పోనిచ్చాడు.

రవి హఠాత్తుగా గంగాధరంమీద ఉరికి కైజారుతీసి గుండెల్లో పొడిచాడు అపాయ పరిస్థితిలో కూడా జమీందారు బలంకొద్దీ కాళ్ళతో రవిని తన్నాడు

ఎడమచేతో కైజారు బాధగాపట్టుకొని, కుడిచేతో తలక్రింద పిష్టలుతీసి రవిని చూస్తూ,

"నాచావుకి ముందే—నీచావు నేను

(48-వ పేజీ చూడండి)

# కవిసార్వభౌముడు

'వేము పోయిన చోటల్లా ఈమెందుకు దాపరిస్తుందో? ఆ రక్తదృష్టికి మేమే భాగ్యులమా? రెండు మూడు లక్షల జనాభాగల ఈ మహానగరంలో ఎవరూ చేయని పాపం మేమే చేశామా?'

ఇట్లు మాట్లాడుకొంటూ నేనూ శీనయ్యా టౌనుహాలువైపు వెళ్ళుతుంటిమి. కర్ణాటకములో ఈమధ్యనే జరిగిన 'మధురకవి' వర్ధంతికోత్సవానికై ఇద్దరం బయలుదేరి యుంటిమి. మన కవులకు బ్రతికుండేదాక ఏరీతిగానైనా సహాయం చేయనప్పటికీ చచ్చిన తర్వాతనైనా శ్రద్ధాంజలు లర్పించి ధన్యులం కావ నిర్ణయించియుంటిమి.

కాని అదే రోజు 'క్షేమకారి' దర్శనం రెండు మూడుమార్లు జరిగియుండినది. ఆ బీద 'పూర్వసువాసినిని' ఎట్లు పిలవవలెనో అని, నేనూ శీనయ్యా మాట్లాడుకొని కొనకు 'క్షేమకారి' యని నిర్ణయించి యుంటిమి. మమ్ముల నిలా పీడిస్తున్న క్షేమకారి సోమవారం విశ్వేశ్వరాలయంవద్ద, మంగళవారం కాళికాలయంవద్ద, శుక్రవారం దుర్గమ్మ గుడిముందు, శనివారం వీరాంజనేయస్వామి దేవళం ముందు తప్పక కన్పించేది. ఆమె యొక్క జీర్ణమైన ఎఱ్ఱ చీర, అంతకంటె జీర్ణమై అకాలమున ముదిమి యావరించిన దేహము, తెల్లబోయిన ముఖము, హృదయాన్ని స్పందింపజేసెడి దైన్యధ్వని మనపై అదేదో అవ్యక్త పరిణామం కల్గించియుండేది. ఆమె ధ్వని చెవుల పడిందంటే మన నాడీ మరియు హృదయంయొక్క వేగం హెచ్చుచుండెడిది. కాని ఇటువంటి బూటకపు భిక్షుగాళ్ళ నెందరినో చూచిన మాకు వ్యధ కల్గేది. ఇటువంటివారి కందరికీ దయావంతులగు మహాజనులు అనాథాలయములు నిర్మించవలయునని మాట్లాడుకొని యుంటిమి.

కాని, ఆనాడు ఆమెపై మాకు కలిగిన కోపం మరెప్పుడూ కలుగలేదు. మొదట మార్కెట్ దగ్గర కనిపించింది. అక్కడ సుంకం చెల్లించి ముందుకు సాగితిమి. రెండవమారు చిక్‌పేటచౌక్‌లో షావుకారు చిన్నయ్యగారితో మాట్లాడుతున్నప్పుడు దాపరించింది. షావుకారిగారి యెదుట కృపణులనిపించుకోరాదని అక్కడా కట్నం చెల్లించాము. మూడవమారు ఉడిపిహోటల్లో కూర్చొని రవ యిడ్లీలు ముందు పెట్టుకొని వెన్నకై వేచియుండగా, అదే హృదయవిదారకమగు దైన్యవాణి.

'అయ్యా...బీదరాలిని......

ఇద్దరికీ పట్టరాని కోపం వచ్చింది. పోతే చాలు పాడుముండ. ఇడ్లీలు చల్లబడుతున్నవన్న కారణంతో మరో కాసు విసిరితిమి. కవి జయంతి ఉత్సవాలు లేకుండావుంటే, ఆనాడు ఆ క్షేమకారికి బాగా సమాధానం చేసి పంపేవాళ్ళమే. కాని ఆరోజు మధుర కవి యామెకు అడ్డుపడినాడు.

మేము టౌన్‌హాలు చేరేసరికి సమావేశ కార్యక్రమం ప్రారంభమయి వుండింది. సభాభవనం శ్రోతలతో నిండిపోయి వుండినది. లోపలకి వెళ్ళటమటుంచి ద్వారంవద్ద నిలవడం కూడా కష్టమయింది. ఎట్లో కష్టపడి ద్వారంవద్ద స్థలం చేసుకొన్నాం. ఎదురు గేటులో చూసేసరికి మాకు దిగ్భ్రమ కల్గింది. మహిళలు కూర్చొను స్థలంలో గేటువద్ద 'క్షేమకారి' నిల్చియుండినది. కన్నీరు తుడుచుకొంటూ వుండినది.

> కన్నడం :
> **శ్రీ అ. న. కృష్ణారావు**
> అనువాదం :
> **శ్రీ జానమద్ది హనుమంతశాస్త్రి**

శీనయ్యా, అబ్బే 'గుక్' మన్నాడు.

"ఈ ప్రారబ్ధం ఇక్కడకూ దాపరించిందా? ఉశ్ - ఉశ్ - ప్రారంభం" శీనయ్యా నోరు మూసుకొన్నాడు.

మొదటి ఉపన్యాసం ముగిసింది. రెండవ వారు ప్రారంభించిరి. కన్నడ సాహిత్యవేత్తలు మాట్లాడ నారంభించిరి. 'మధుర కవి' జీవితాన్ని సంగ్రహంగా చెబుతూ "సామాన్య ఉపాధ్యాయుడుగా నుండి, ఇట్టి ఉత్తమ కావ్యాన్ని రచించినాడంటే సరస్వతీ కటాక్షవీక్షణగాక మరేమి! మధుర కవియొక్క వాణి దైవవాణి అని ఆవేశంతో పల్కి ముగించిరి. తర్వాత ఉన్నత ప్రభుత్వోద్యోగు లొకరు ఉపన్యసించిరి. వారు కన్నడ సాహిత్యంలో కృషిచేసినవారే. కవి జీవితానికి కావ్యానికి గల సంబంధమును వివరిస్తూ,

"మధురకవిగారు షేక్స్పియర్ కవివలె జీవితములో, ... మంచివుండ వలె. అందుకే రామాయణం అనే కావ్యంలో సీతావియోగంకంటె, సీతాకళ్యాణం బాగున్నది. రావణుని వధకంటె లవకుశుల ప్రభవం మనోహరంగా వున్నది" అని నుడివిరి. నాల్గవవారు కళాశాలోపన్యాసకులు, మంచి వక్తలు.

"ఎంతోమంది ఆదికవి అడుగుజాడలలో నడచి రామాయణం రచించినారు. మన భాషలోనే కాక హిందీ, బెంగాలీ, గుజరాతీ, తెలుగు, అరవం మొదలగు భాషలలోను విదేశీ భాషలలోను వేర్వేరురీతులలో రచింపబడింది. మనలోని అభినవపంప, కుమార వాల్మీకిముద్దణ మొదలగువారికైతం చెప్పిందే చెప్పటం స్వభావమయింది. విన్నదే వినడానికి మన ప్రజలు సంసిద్ధులు. కాని మధురకవి ఈ యపవాదును పోగొట్టి, ఆదికవి వాల్మీకికి కూడా గోచరం కాని అనేక సుందర తత్త్వాలను రమణీయార్థకంగా ప్రతిపాదించినాడు. ఇట్టి సత్కవి తన 88 యేటనే అకాలమృత్యువువాత పడ్డాడు. ఇది మన దౌర్భాగ్యం. ఇట్టి కవి ఏ యూరోపులోనో వుండివుంటే నోబెల్ బహుమతితో సత్కారం లభించియుండేది. రాజాధిరాజులు సైతం అతని అడుగులకు మడుగులొత్తెడివారు. ఇంటింట అతని కావ్యకుసుమం వికసిస్తుండేది. రాష్ట్రానికి రాష్ట్రమే 'దాసోహం' మనెడిది. షేక్స్పియర్, బ్రౌనింగ్ షెల్లీ, కీట్సుల కేమాత్రం తీసిపోలేని ప్రతిభావంతుడు. అట్టి సత్కవిని మన మెట్లా సత్కరించేది......ఎట్లు సన్మానించేది?"

అని ఉపన్యసించి కూర్చొనిరి. అందరి కళ్ళలోను అశ్రువులు.

ఉపన్యాసాల తర్వాత ఉపన్యాసాలు. జనసందడి ఎక్కువై నిలవడం కష్టమయింది.

నేనూ శీనయ్యా హాల్ వదలి పక్కనే మెట్లపై కూర్చొని నాటి ఉత్సవాల విష

(56-వ పేజీ చూడండి)

# పిచ్చిడబ్బు

"అబ్బాయికి ప్రమోషన్ అయిందన్నారు ఈ మధ్య! జీతమెంత?" అంది ఓనాడు మాఅమ్మ చేటలో బియ్యము పోసుకుని దొడ్డివసారాలో కూచుని బాగుచేస్తూ.

అక్కడే కూచుని పువ్వులు గుచ్చుకుంటూన్న చిట్టి 'జీతం రెండువందలు! అలవెన్సులూ - అవీ - కలుపుకొని మొత్తం మూడువందలు కాబోలు వస్తాయి' అంది.

"అదృష్టవంతురాలవే అమ్మా నీవు!" అంది మా అమ్మ తిరిగి.

"ఏమి అదృష్టం? ఎంతచెట్టు కంతగాలి అని జీతం యెక్కువైనకొద్దీ ఖర్చు యెక్కువవుతోందిగాని ఎరుగదుగదా?"

"పొదుపుగా చేసుకుంటే సరి! మా కాలంలో యింత డబ్బేది?"

"ఏం పొదుపు? అన్నీ కావాలా మరి? ఏ హోదాకు తగినట్లా హోదాకు నడచుకోకపోతే లోకులేమనుకుంటారు?"

"లోకులేమన్నా అనుకుంటారని డబ్బు వృధాగా ఖర్చుపెడతామా? వచ్చిందంతా యెప్పటికప్పుడే సర్వమంగళం చేసుకుంటే తరువాత యెల్లాగు మరి?"

"తరువాతి మాటలు తరువాతే! ప్రస్తుతం గడిస్తే తరువాతి మాట!" అంది చిట్టి చేమంతిచెండు జడలో సింగారిస్తూ.

"అబ్బ! ఏమి అబ్బురమే! మూడు వందల రూపాయిలు వస్తుంటేనే సంసారం గడుపుకోలేకపోతే నలభైయాభై రూపాయలతో మా కాలంలో యెల్లా గడుపుకునే వాళ్ళం అనుకున్నావు?" అంది.

"ఆ కాలం వేరు! అప్పట్లో నలభైయాభై రూపాయిలుకూడా అక్కర్లేదు! సామాన్య సంసారానికి యింకా తక్కువే కొల్లలైపొయ్యేవి! అవి చవుకరోజులు! ఇప్పుడన్నీ ప్రియమూ - కొటకమూను!"

"ఎంత ప్రియమైనా, యెంత కొటకమైనా జాగ్రత్తగా వాడడంలో వుందిగా మరి!"

"ఏమి జాగ్రత్తో? ఇంకా యేమి జాగ్రత్తగా వుండాలో చూద్దురుగాని యీ నెలలో వాడకం! అప్పుడే మీకు తెలుస్తుంది"

వాళ్ళావిధంగా సంభాషించుకోవడం హాల్లో కూచుని ఆఫీసుపని చేసుకుంటూన్న నాకు వినిపించింది. మా అమ్మ కొంచెం పక్కవాటుగా కూచోవడం మూలంగా నా దృష్టికి ఆనడంలేదు కాని, చిట్టి నాకు తిన్నగానే వుండడంచేత ఆవిడ నా దృక్పథంలోనుంచి తప్పిపోలేదు. మా రామూ - ఇందిరా, వాళ్ళ తాతాయితో కలిసి మ్యాటినీషోకి వెళ్ళడంచేత, యింట్లో సందడిలేదు. ఆ రోజు ఆదివారం. మా అమ్మా - నాన్నా ఆ కిందటి సాయంకాలమే రాక రాక మాయింటికి రావడంచేత నేనెక్కడికీ క్యాంపుకెళ్ళకుండా యింటివద్దేవుండి అప్పటిదాకా వాళ్ళతో కాలక్షేపంచేసి, ఆఫీసుకాయితాలేవో వుంటే వాటిని సునామణిచేస్తున్నాను.

అప్పుడు సాయంత్రం సుమారు నాలుగు గంటలైనా అయివుంటుంది. చిట్టీ - మా



అమ్మా మాట్లాడుకునే మాటలు నేను వింటూనేవున్నాను. నేను మాత్రం జోక్యం కలుగజేసుకోలేదు అప్పట్లో! కాని మా అమ్మధోరణినిబట్టి, వచ్చిన డబ్బంతా మేము దూబరాగా ఖర్చుచేస్తున్నట్లూ, అదే ఆవిడ అయితే జాగ్రత్తగా ఖర్చుపెట్టి, నెలకెందో - ఏభయ్యో, నిలవచేసి చూపించగలదేమో నని నాకు ఆశకలుగకపోలేదు.

చిట్టి పువ్వులు గుచ్చుకోవడం అయిన కాస్సేపటికి "టీ" తయారుచేసి కప్పులో తెచ్చి నాయెదరటేబిలుమీదపెట్టి వెళ్ళిపోతోంది. అప్పుడు నేనేదో ఒహ గట్టి కాయితం అతి సీరియస్‌గా చూస్తూ తల పైకెత్తి—

"చూడు చిట్టీ!" అన్నాను.

చిట్టి వెనక్కు తిరిగింది—ఇంతలో నే నాలోచిస్తూన్న కాయితం ఫయిసలు కాగా అది రికార్డుచేస్తూ చిట్టి తెచ్చిన "టీ" కొంచెం కొంచెంగా పెదవులతో చప్పరిస్తున్నాను—

"ఏం! ఎందుకూ పిలిచేరు?" అంది చిట్టి. తలయెత్తకుండానే "ఔను! పిలిచేను. ఉండు విందువుగాని" అన్నాను.

చిట్టి నిలబడి నాకేసి చూస్తోంది.

"టీ" పుచ్చుకోవడం కాయితం రాయడంకూడా అయిపోయినయి

ఖాళీకప్పు చేతికిస్తూ "అయితే చిట్టీ! ఈ నెలా, వచ్చే నెలా, మా అమ్మా-నాన్నా యిక్కడే వుంటారు గనుక అమ్మనే వాడమను యింటివాడకం అంతా!" అన్నాను.

"ఊఁ!" అంది చిట్టి

"ఊఁ కాదు నిన్ననే జీతాలు వచ్చేయి గనుక డబ్బంతా ఆవిడ కిచ్చేయి! ఆవిడే ఖర్చుపెడుతుంది" అన్నాను నిష్కర్షగా.

"ఔను! నిజమే! నేనయితే అంతా ఖర్చే! ఆవిడ అంత జోరుగా ఖర్చుపెట్టదు. నాలుగు డబ్బులన్నా మిగులుస్తుంది"

మా వుభయుల అభిప్రాయాలూ అక్కడ యేకీభవించినై! తిరిగి నేను తల పైకెత్తి చిట్టిమొహంలోకి చూస్తూ—

"ఔను! అల్లాచెయ్యి!" అని, యింకా పనిచూచుకొంటున్నాను—

చిట్టి వెళ్ళిపోయింది ఆరోజే యిన్నాళ్ళనుంచి తన భుజాలమీదనున్న సంసారభారం చిట్టి మా అమ్మకెత్తింది మా అమ్మకూడా పూర్వకాలపు మనిషి అవడంచేత, తానా రోజునుంచీ సంసారం గడపడానికి పేచీ పెట్టలేదు. నేనూ - చిట్టీ సంతోషించేం! పెద్దవాళ్ళమీదే సంసారభారం పడేస్తే, యీ రోజుల్లో కష్టసుఖాలు వాళ్ళకూడా తెలుస్తవి మనం కులాసాగా కాలక్షేపం చెయ్యొచ్చునను కున్నాం మేమిద్దరమూ.

కొన్నిరోజులు గడిచినై! ఇంట్లో మామూలుఖర్చు యేమీ తగ్గలేదు. మా అమ్మ యెంత తగ్గిద్దామన్నా వీల్లేకపోయింది కారణం, మే మదోరకమైన జీవితానికిన్నాళ్ళూ అలవాటుపడి వుండడమే! మరీనీ ప్రస్తుతం దేశంలోవున్న కరువు అంతకంతకు హెచ్చుతూవుంది కాని తగ్గితేగా నాలుగు డబ్బులు మిగలడానికి! మా అమ్మ యెంత పొదుపుగా చేద్దామన్నా ఏది విషయంలోనూ రోజురోజుకు కాయితాలూ రూపాయిలూ పిచికలులా యెగిరి చక్కాపొయ్యేవి ఎప్పటికప్పుడు యీ పది రూపాయిలు దాచి యివి నేను మిగల్చగలిగేనని ఆవిడకు చెప్పడానికి వీలులేకుండా దానికి రెండుమూడు రెట్లు ఖర్చువచ్చి

కుండే కనిపెట్టుక కూచుండేది! పాప మావిడ మట్టు కేమి జేస్తుంది? ఏరోజు కారోజు యింటి వాడకానికి నోట్లు మారుస్తూ వుండడం! ఇంట్లోకి తెచ్చే వెచ్చాలు కన్ను నిండక పోవడం! అన్ని వస్తువులూ యెత్తుకు మూడునాలుగెత్తులు ప్రియమాయె! అందులోకీ ప్రతివస్తువుకూ కంట్రోలూ బ్లాకుమార్కెట్టు ధరలూ! ప్రాణం విసిగి పోయింది పాప మావిడకి సంసారం యీదలేక! ఎన్ని కాయితా లావిడ మనస్సులో యిష్టం లేకపోయినా తన చేతిమీదుగా మార్చి ఖర్చుపెట్టిందో! ఫలితం లేమి! అసంతృప్తిని!

ఓనాడావె "నావల్లకాదు యీ సంసారం దిద్దడం! ఎవరి సంసారాలు వాళ్లే చేసుకోవడం మంచిది" అంది చిట్టి కెదురుగా కూచుని మధ్యాన్నం వేళ.

చిట్టి ఆవిడ కేసి ఆశ్చర్యంగా చూస్తూ అక్కడే మానాన్న కెదురుగా తీరికగా కూచుని వున్న నా మొహం కేసి ఓమాటు చూచింది—

"అదేమిటమ్మా? అల్లా అంటావు? ఏవో, నీవూ—నాన్నా యిక్కడ వున్నన్నాళ్లూ నీ చేతిమీదే పోనియ్యరాదా?" అన్నాను.

"ఏమో నాయనా! నావల్లకాదు యింత డబ్బుఖర్చుపెట్టడం! సంసారం చూస్తే జానెడేకాని ఖర్చు మాత్రం బారెడు!" అంది తల పైకెత్తకుండానే!—

"అవును! అన్ని వస్తువులూ కొనుక్కోవాలాయెను మరి! ఏదైనా వూరకే వచ్చి పడితే డబ్బు ఖర్చుకాదు."

"ఊరకే యెవరు కొనాలన్నారు? ఈ వూళ్ళో అన్ని వస్తువులూ ప్రియమూ - కొటకమూను, అంచేత డబ్బు కనిపించదు."

"ఈవూళ్ళోనే కాదమ్మా! అంతటా యిట్లాగే వుంది. మనవూళ్ళో మనకన్నీ పండుతాయి గనుక అక్కడ మనకు వాటి ధరలు తెలిసికోవలసిన పనిలేదు".

నామాట లందుకొని మా నాన్న "మన వూళ్ళోమట్టుకు యేమి చౌక? పంట సంసారులకు మాత్రం ఖర్చులేదా? ఎన్ని కొనుక్కోవాలి తెల్లవారి లేచింతరువాత? ఆ వచ్చినడబ్బు తిండికీ, వ్యవసాయ పెట్టుబడులకీ సరిపోక "అలో-లక్ష్మణా" అని వాళ్లు యేడుస్తూనే వున్నారు" అన్నాడు.

"అయితే యింక సుఖంగావున్నది యెవరూ? బ్లాకుమార్కెట్లలో వ్యాపారం చేసి రెట్టుకు మూడునాలుగు రెట్లు ధరలు పెంచి డబ్బు సంపాయించే వర్తకులేమైనా సుఖంగా వుండాలి మరి!" అంది చిట్టి

"ఆ!" అని ఒక నిట్టూర్పు పుచ్చి "వాళ్లకుమట్టుకు సుఖం యేదీ? ఎంత డబ్బు గడించినా వాళ్లుమాత్రం డబ్బే తింటారా? తిండికీ - బట్టకీ, వాళ్ళూ ఒకళ్లమీద ఆధారపడాలిసిందే! ఒక మాదిరిగా సంపాయించి యింకోమాదిరిగా వాళ్లు ఖర్చు పెట్టాలిసిందే!" అన్నాను.



"వచ్చిందంతా ఎప్పటికప్పుడే సర్వమంగళం చేసుకుంటే తర్వాత యెల్లాగు మరి?"



# ★ పిచ్చి డబ్బు ★

"అదికాదు. ఈరోజుల్లో అందరిదగ్గరా డబ్బు యెవరికి తగినంత వారిదగ్గర వుంది. పూర్వం రూపాయి సంపాయించుకునేవాడిప్పుడు పదిరూపాయలు సంపాయిస్తున్నాడు. అయిదారేండ్ల క్రితం అణాకానుకున్న విలువ యిప్పుడు రూపాయకు లేదు. మా చిన్నతనంలో వందరూపాయలనోటు వుంటే అతడెంతో ధనవంతుడు! ఆ కాయితాన్ని యెవరూ చూడకుండా యెన్నో పెట్టెలలో పెట్టి దాచి, చివరికి దాన్ని మార్చాలిసివస్తే పదిపన్నెండు చోట్లైనా తిరగాలిసివచ్చేది. ఇప్పుడు అల్లాంటి కాయితాలు అందరివద్దా వేనకువేలున్నాయి. ఎవరిచేతిలో చూచినా నోట్లకట్టలే! డబ్బంటే యెవరికీ లక్ష్యంలేదు. దీనికంతా కారణం డబ్బుకు విలువ తగ్గడమూ - వస్తువుల విలువ హెచ్చడమూ! అందుకే దీన్ని నేను పిచ్చిడబ్బు అంటాను" అన్నాడు మా నాన్న.

"ఔను! నిజంగా పిచ్చిడబ్బే! అందుకు సందేహ మేమీలేదు. పూర్వం రూపాయ మార్చి పదహారణాలా చేస్తో పుచ్చుకుంటే వారం పదిరోజులు మహారాజులాగా యింటి వెచ్చాలకు సరిపొయ్యేది. ఇప్పుడా రూపాయకు ఒహ నెచ్చమూరాదు" అంది చిట్టి.

మా మాటలు వింటూనే మా అమ్మ చివుక్కునలేచి వంటింట్లోకి వెళ్ళి అప్పుడే తెచ్చిన బజారు వెచ్చాల జాబితా తెచ్చి మాముందు పడేసి—

"చూడండీ జాబితా! అన్ని వస్తువులూ యెల్లా మండుకుపోతున్నాయో? వీశ పావలా, అయిదణాలుండే చింతపండు రూపాయన్నర! వేడా, వేడార్ధణాకిచ్చే వుల్లిపాయలు రూపాయ! పదిహేనణాలు, రూపాయవుండే నువ్వులనూనె నాలుగున్నర! పంచదార అసలు మూర్ఖామంటే యీ మధ్య మాయమైపోయి యిప్పుడేకదా కొంచెం కొంచెం బయటికొస్తోంది! ఇహ బియ్యం సంగతి చెప్పనే అక్కర్లేదు" అని యింకా యేమేమో చెప్పబోతోంది—

ఆమె మాటకడ్డంవచ్చి "ఔనమ్మా! అన్నివస్తువుల ధరలూ మండుకపోతూనే వున్నాయి! అందుకే యివి కరువురోజులు! ఎన్నివందలు తెచ్చుకున్నా యిప్పటి కప్పుడు సంసారాలు కటకట పడడమే!" అన్నాను—

"అల్లాంటప్పుడు యీసంసారాలు యెవరుచేసినా ఒహటే! ఇవ్వాళవుండి రేపు పొయ్యేవాళ్ళం మాకెందుకు నాయనా యీ లావాదేవీలు? మీసంసారం మీరే చేసుకోండి!" అంది.

ఆమె మాటలకు చిట్టి నవ్వుతూ నా మొహంకేసి చూసింది. పాపమూ వృద్ధురాలినా బాదరబందీనుండి తప్పించమన్నట్టుగా!—

"సరే! నీకంత కష్టమయితే మా కోడలిమీదే పెట్టు ఆ భారం తిరిగి" అన్నాను.

ఆరోజునుంచే తిరిగి చిట్టి మామూలుగా తన సంసారభారం తానే మొయ్యసాగింది.

కాలం గడిచిపోతోంది, అల్లాగే వచ్చింది చాలీచాలకుండా!

ఎప్పుడేనా మాటవరసకి "చిట్టీ! యిదేమిటి? ఈనెల యింత ఖర్చా?" అని నేనంటే "ఔను! పిచ్చిడబ్బు నేనేం చేసేది?" అని జవాబిస్తోంది.

నేను చేసే ఖర్చులకుకూడా చిట్టి అప్పుడప్పుడు అజమాయిషీకొస్తే నేన్నూ అల్లాగే జవాబియ్యాక తప్పడంలేదు.

ఇంతకూ, ఈ డబ్బుకి పిచ్చివదలి మామూలుగా పూర్వపురోజులు వస్తాయో? ఇంక రానేరావో? ★

---

మద్రాసులో ట్రాములు తీసెయ్యటంతో అనేక మంది మధ్య తరగతి కుటుంబీకులకు నెలసరి ఆదాయం చాలకుండా పోయింది. అల్లాంటి వ్యక్తులలో ఒకడు, సాయంకాలం ఆఫీసునుంచి యింటికి వచ్చేటప్పుడు, బస్సు ఎక్కకుండా నడిచే వచ్చాడు. ఇంటికి రాగానే పెళ్లాన్ని పిలిచి "చూశావా మరి! ఇవాళ మూడుఅణాలు ఆదా చేశాను. బస్సు రూట్ వెంట నడిచి వచ్చేశాను." అన్నాడు.

భార్య క్షణంసేపు ఆలోచించి "ఏమండీ! ఆవచ్చేది, పోనీ ఏటాక్సీ వెనకాలనో పరుగెత్తుకొంటూ వచ్చివుంటే మూడు రూపాయిలైనా ఆదా ఐవుండేది కదండీ!" అన్నది.

—శ్రీ పి చార్లెస్ సుదర్శన రావు,
(గుంటూరు).

---

# శునక ప్రదర్శనం





"రేపు బొటానికల్ గార్డెన్స్‌లో డాగ్ షో ఉంది. మన థండర్‌ని తీసుకెళ్ళాలి సుమీ నువ్వు" అని ముదలకించాడు నరసింహం గారు.

మామయ్యకు శునక లోకంమీద ఉన్న ప్రేమ సుందరానికి తెలియని విషయం కాదు. నాలుక్కాళ్ళకల ఆజాతిజంతువుల గురించిన ఆయన విజ్ఞానం అపారమని సుందరం అనుమానం. ఏదో అత్యవసరమైన పని ఉంటేగాని మామయ్య ఇంత అపూర్వావకాశం జారవిడుచుకోడు. కాబట్టి రేపు తను థండర్ బోల్టుని – అది వాళ్ళ కుక్క పూర్తిపేరు–వెంటబెట్టుకుపోయి తత్ప్రదర్శనంలో పాల్గొని ఏమన్నా బహుమతి సంపాయిస్తే దాన్ని చేతుచ్చుకుని ఇంటికి రావాలన్నమాట. బాగానే వుంది. రోజూ తను షికారుపోవడంలా దాన్ని తీసుకుని? అల్లాగే రేపు బొటానికల్ గార్డిన్స్‌కి పోతే సరి. కొంచెం ఎక్కువ దూరం పోవాలి, అంతే.

"ఏమిటి, ఆలోచిస్తున్నావ్" అన్నాడు మామయ్య.

"ఏంలేదు."

"జరూరుగా కోయంబత్తూరు పోవాల్సినపని తగిలింది. లేకపోతే..."

సుందరానికి తెలుసు మామయ్య ఏమనబోతున్నాడో – లేకపోతే తను జన్మలో మిస్ కాడు అలాంటి అద్భుత శునక సమ్మేళనం.

"రేపు నువ్వు అమితంగా ఆనందిస్తావని నావిశ్వాసం", అని ఆంగ్లంలో తన అనూయను ప్రకటించాడు మామయ్య.

ఆయనన్నది నిజమే కావచ్చు. శుభ్రమైన కుక్కలంటే అసహ్యంలేదు సుందరానికి. అందులో ఆల్సేషియన్ లంటే అమితాభిమానం. థండర్ ఆల్సేషియన్ జాతికి చెందిందే. దాని కడుపుడక! ఎంత బలమనీ దానికి? సులభంగా బండిగుఱ్ఱాని కున్నంతబలం వుంది. తను రోజూ దాన్ని షికారుకి తీసుకుపోతాడని పేరేగాని నిజంగా తననే అది తీసికెళుతుంది. మెడపట్టీ కున్న గొలుసు ఉగ్గదీసి పట్టుకుని దాని ఉషారు అదుపులో పెట్టడం అవస్థల్లో అవస్థ. అందుకనే అనుకుంటూ ఉపేంద్ర బాబు వాళ్ళకుక్కని (అదీ ఆల్సేషియనే) తను సైకిలు తొక్కుతూ షికారు తిసుకెళ్తాడు గిండీ రోడ్డుమీద. కాని మామయ్యకు భయం, తప్పదారి చక్రంగాని కాలిమీన్నుంచి పోయేనా నిక్షేపంలాంటి కుక్క ఎందుకూ పనికిరాదని. అవును. కుంటికుక్క నెవరు

**'క్షేమేంద్ర'**

పెంచుకొంటారు ఇంట్లో? కుక్క సాంఘికఅంతస్తు చూపించే చిహ్నల్లో ఒకటి. ఎన్ని కుక్కలున్నయ్, ఏయే జాతులవీ, వాటి పోషణెంగావుంది, అవి ఇంట్లోగాని బయటగాని ఎంత మర్యాదగా మెసులుకుంటయ్! ఇవన్నీ నీ గౌరవనీయతని నిర్దుష్టంగా రెండో దశాంశస్థానందాకా తేల్చి చెప్పడానికి పెద్ద లుపయోగించే పద్ధతుల్లో ఉన్నవే.

తను చెన్నపట్టణం వచ్చిన కొత్తలో ఆశ్చర్యపడ్డాడు, "కుక్కవుంది కావున కబడ్దారుగా సంచరించవలసింది" అని ఇంగ్లీషులో రాసి గేటుకు తగిలించున్న బోర్డులు చూసి కొందరియిళ్ళకి. కావలసిన వాళ్ళొచ్చినా కండలుపట్టి పీకేస్తుందికద అలాంటికుక్క! యజమాని కర్మ కాకపోతే మరేమిటది? ఓసారి అనుభవమయింతర్వాత మళ్లీ మరుసటిరోజు గుమ్మం తొక్కడెవడు కాని. తప్పని సరిగా రావాల్సి వచ్చినా ప్రాణాలర చేతులో పెట్టుకుని బిక్కు బిక్కుమంటూ అడుగు పెట్టాలిసిందే, ఏమూలనించి నిశ్శబ్దంగా వొచ్చి పిక్కలంకించుకుంటుందో రాకాసి కుక్క అని. సామెత ప్రకారంచూస్తే, కరిచే దుర్గుణం ఉన్న కుక్కలన్నిటికీ నలుగురూ చూసి ఆనందించాలన్న వ్యామోహంలేదు; వాటి పని అవి చీమ చిటుక్కు మనకుండా చేసుకుపోతయ్. వచ్చే పబ్లిసిటీ ఎలాగూ పట్టుబడిన పెద్ద మనిషి ఆక్రోశాల్లో వస్తుందని వాటికి తెలుసేమో? తప్పకుండా తెలిసేవుంటుంది. ఎందుకంటే కుక్క తెలివైన జంతువ దానిమీద ఎన్ని కథలు, ఏం వ్యవహారం! దాని తెలివితేటలు, ధైర్య సాహసాలు, విశ్వాసం ఒకటేమిటి అన్నీ కథల్లోకి ఎక్కినయ్. కొన్ని కుక్కలు సారస్వతంలో అజరామరంగా నిల్చిపోయినయ్. ఇంతెందుకు? ఒక్క మాటలో కుక్క వ్యక్తిత్వాన్ని గురించి తెలిసినంతగా ఎవరికొక్కని ఏజంతువును గూర్చి తెలియదు. అయితే మామయ్యకు అందరికన్నా ఎక్కువ తెలుసు ఆ రకపు దైవసృష్టినిగూర్చి.

"రేపు డాగ్ షోకి పోవాలి తప్పక"అని నిశ్చయంచేసుకున్నాడు సుందరం.

అతను ఇంటర్ మీడియెట్ నించీ మెద్రాసులోనే చదివాడు మామయ్య ఇంట్లోవుండే. నరసింహంగారు ప్లీడరు; పెద్ద ప్లీడరనే చెప్పాలి, నెలకో వెయ్యిరూపాయలు తక్కువ కళ్ళ చూడరు. ఆయనకి మగసంతులేదు, ఇద్దరాడపిల్లలు మాత్రం. వాళ్ళూ సుందరంకన్న పెద్దవాళ్ళే. పెళ్ళిళ్లయి కాపరాలు చేస్తున్నారు. "మీసుందరాన్ని కాలేజీ చదువుకి మెడ్రాసెందుకు పంపకూడదూ? మాయింట్లో ఉండి చదువుకుంటాడు" అని నరసింహం గారన్నప్పుడు సుందరం ఎగిరి గంతేశాడు; వాళ్లనాన్న అడ్డుచెప్పలేదు.



# శునక ప్రదర్శనం



తల్లి మనసులోనే అన్నగారిని కృతజ్ఞతతో అభినందించింది. వాళ్ళదీ పెద్ద సంసారం; ముసిలీ ముతకా పిల్లా పీచూ అంతా కలిసి మొత్తం ఓ పదిమంది తేలతారు. సుందరం నాన్న తహసీల్దారు. పరద్రవ్యాణి లోష్టవత్; దమ్మిడీ పుచ్చుకోడు. "లాయరు వృత్తిలో నిజాయితీ లేదు. డబ్బెక్కువొచ్చే సూచనలుంటే సరి, ఎటుపడితే అటు మాట్లాడతారు" అని విమర్శిస్తాడు తన కన్న పెద్దవాడైన బావగార్ని. ఆయన మటుకు తీసిపోయాడా? "నా కక్షిదారు చెప్పింది నిజమనే విశ్వాసంతోనే వాదిస్తాను కాని అబద్ధమని నమ్మకం కలిగినప్పుడసలు వాదించనేలేను. ఇహ డబ్బెరచూపితే పక్షాలు మారుస్తారని అన్నావే అది అసత్యం. మాకూ వృత్తి న్యాయాల్లో విధి నిషేధాలున్నయ్" అంటాడు. సుందరం నాన్న ఒప్పుకున్నాడు, కొడుకుని మద్రాసులో చదువుకి పెట్టడానికి. అయితే జీతాలు మాత్రం తనే కడతాడు. అప్పటికాని ఆయనకు తృప్తి కలగలా.

సుందరం తెలివైనవాడు, మద్రాస్ కళాశాలల్లో బాగా చదువు చెపుతారు. చెడిపోయేవాళ్ళు చెడిపోతూనే వుంటారు ఎక్కడున్నా. అత నటువంటి సజ్జువాడు కాడు; ప్రతిఏడూ విడవకుండా మంచి మార్కుల్తో పాసవుతూ, ఆ ఏడే ఎం. ఏ. పరీక్ష కెళ్ళాడు. క్లాసు తప్పదు. తను బాగానే రాశాడు. దీంతరవాతేమిటి? మామయ్య లాచదవమంటాడు, అనటానికేం? అందరూ తనమల్లే సంపాయించాద్దూ? పైగా నాన్న కిష్టంలా వెధవ ప్లీడరీ. సుందరం మనస్సు ఆలిండియా సర్విసెస్ పరీక్షమీదుంది. తను ఎం. ఏకి చదువుతూనే అదికూడా దృష్టిపథంలో పెట్టుకు చదివాడు. ఏమో? అదృష్టం బాగుంటె క్లాస్‌వన్ ఆఫీసర్. "ఈ వేసంగికి ఇంటికి పోవాలా" అని ఆలోచించాడు సుందరం. ఇంటిదగ్గర అంతగా చదువు సాగదు. కాని నిర్ణయం చేసింది మామయ్య; "ప్రతేడూ వేసంగికింటికి వెళుతున్నావుగా? ఈసారికి మాతో ఢంకిపో, ఊటీపోదాం. నువ్వులేకపోతే ఏం సందడి తక్కువకాదులే మా యింట్లో. ఏమంటావ్?" అన్నాడు. సుందరం ఏమంటాడు, సంతోషంగా ఒప్పుకొన్నాడు. తత్ఫలితంగా ఓగోజా చల్లని గాలి స్వాగతం పలుకుతూండగా ఉరకలు వేసే హృదయంతో ఉదకమండలంలో దిగాడు సుందరరామ శర్మ తన మేనమామతో ఆయన పెళ్ళాంతో.

ప్రతివాడి జీవితంలోనూ కొన్ని సమస్యలు తలచూపుతయ్. కొన్ని కొన్ని సంఘటనలు జరుగుతయ్ వాడి వాడి నిర్ణయానుసారంగా. అప్పటిలో అంతగా తెలియకపోయినా భావిజీవన పంథా కొత్తగా అక్కణ్ణించే మొదలెట్టినట్టు తరవాత స్పష్టమౌతుంది, ఆ దోవ చీలినచోటికి వచ్చేవరకూ అంటే ఇంకో సమస్య తలయెత్తేవరకూ. చీలు దోవల్లో తను వచ్చిన దోవ కాక మిగిలిన రెండోదోవ తొక్కితే ఏమైఉండునూ అనేది ఊహాకందని విషయం. నీ జీవితం మళ్ళీ జీవించాలి. కాలాని కెప్పుడూ పురోగమనమే కాబట్టి అది కుదరనే కుదరదు. చెయ్యగలిగిందల్లా చేసిన తప్పు ముందుముందు నిర్ణయాల్లో సరిదిద్దుకోడం. అదీ ఒక్కొక్కప్పుడు మాత్రమే సాధ్యం.

సుందరానికి తను ఊటీ వెళ్ళడం, డాగ్‌షోకి పోవలసిరావడం తన జీవితంలో అంత ప్రముఖమైన విషయాలుగా అప్పుడు కనపట్టలా. కాని ఆ మరుసటేటే తెలిసొచ్చింది కొంచెంగా.

* * *

తెల్లవారింది. చాలామందికి సాధారణంగా, సుందరానికి అందంగా, మామయ్యకు విసుగ్గా. శునక ప్రదర్శనాన్ని మిస్ అవుతూన్నందుకు ఇంకోసారి విచారించాడు మామయ్య; సుందరం అదృష్టాన్ని అభినందించాడు; థండర్ బోల్టుకి విజయాన్ని ఆశించాడు.

రైలు కదిలేముందు హఠాత్తుగా స్ఫురించి "కుక్కని నడిపించేవు సుమీ అంతదూరం వద్దు. టాక్సీలో పోండి. ఫ్రెష్‌గా ఉండాలి అక్కడికి కెళ్ళేటప్పటికి" అని ఆదేశించాడు.

అవిఘ్నమస్తుగా అవతరించేడు సుందరం ఉలెన్ పాంటులో, సిల్కు షర్టులో, శునక ద్వితీయుడై. ఏం జనం, ఏం జనం! వినోదార్థం విచ్చేసినవాళ్ళూ, పోటీకోసమని పొరుగూళ్ళనించి కూడా కుక్కరలోకంతో దిగిన పెద్దలూ. కొన్ని కుక్కలూ, ఎక్కువ మనుషులూ. ఆడా, మగా. మంచు తెలుపుదగ్గర మొదలెట్టి మసి నలుపుదాకా దేహకాంతులు. ఇంద్రధనుస్సులో ఉన్నవీ లేనివీ అన్ని రంగులూ అక్కడే ప్రత్యక్షం. బొటానికల్ గార్డెన్స్ ఫెళ్ళుమని వెలిగిపోయింది.

థండర్ స్వజాతీయుల శక్తిసంపదల్నీ సౌందర్యాన్నీ చూపుమాత్రంలో తేల్చేసుకొని తృప్తిగా గెలుపు మనదే అని బరవాసాతో గర్వంగా అడుగు వేస్తూంటే తనని చుట్టుముట్టిన అందంలో, ఉత్సాహంలో, ఆనందంలో తన్ని తాను మరిచిపోయి తిరిగాడు సుందరం.

తిరిగితిరిగి తెలివిని పడ్డాడు. తెలివిని పడి తెల్లబోయాడు. ఎంత అందం! మనిషి పొడుగ్గా పచ్చగా, ముఖం కోలగా తెలివిగా, కళ్ళు చురుగ్గా వెలుగ్గా, ఎంత బాగుంది! ఎవరీ అమ్మాయి? గుండె ఓసారి కొట్టుకోవడం మరిచిపోయి, కొద్దిసేపు వేగంగా కొట్టుకుని, మరుక్షణం మాయమైంది ఉన్నచోట్నించి. రోమియో అండ్ జూలియెట్ ప్రథమాంకం పాకానికి దిగింది, కనీసం ఒక వేపునించయినా.

సరిగ్గా కొలిస్తే భూమికి జానెడెత్తులేని కుదిమట్టపు కుక్కొకటీ, ఓ చెయ్యి పుచ్చుకొని దిక్కులుచూస్తూ కబుర్లు చెపుతూన్న ఓ ఏడేళ్ళ కుఱ్ఱకుంక, ఇదీ పరివారం. పోలికనిబట్టి వాడు తమ్ముడు; తరహాచూస్తే కనపడ్డ పాముని కలుగున పోనిచ్చే రకం కాదు. ఆమె వాడితో ఏదో చెపుతూ నవ్వుతోంది. అందమైనవాళ్లు నవ్వుతూంటే ఎంత బాగుంటారూ; కొద్దిగా కొసలందు పైకి ముడుచుకొని వేరయిన ఎఱ్ఱని పెదిమెలూ, కొంచెం చిన్నవైన కళ్లూ, నవ్వుకి అలలా నడిచిన తీగలాంటి శరీరంలో కదలికా, అన్నీ అందంగా, ఊపిరాపే చందంగా!

కాస్సేపు ఇక్కడినించే పరిస్థితులు వేగంగా, సుందరాని కిష్టంలేనంత వేగంగా నడిచినయ్. పోతూపోతూ కుఱ్ఱకుంక ఊరుకోక థండర్ బోల్టువైపు చూస్తూ కళ్లు చికిలించి పళ్ళు ఇకిలింపుగా బయటపడేసి వెక్కిరించాడు. ఉత్తమజాతి శ్వానం ఊరుకోదు అవమానిస్తేనని వాడికి తెలియదు. గొంతికలో కోపం సుళ్ళుతిరిగి మంద్రస్థాయి అరుపుతో తోక నేలతాడించి ముందుకు దూకింది థండర్. సుందరంగాని సమయానికి దాని ఉద్ధృతం ఆపకపోతే కుఱ్ఱవాడికి మరపురాని గుణపాఠం నేర్పేది. సుందరి మొహం ఎఱ్ఱబడింది, "ఏయ్ మిష్టర్, వాళ్ళా వీళ్ళామీద ఎగిరిపడకుండా నీ కుక్కని అదుపులో పెట్టుకో" అని ఇంగ్లీషులో ఝాడించింది.

సుందరానికి కోపంరాలా, నొచ్చుకున్నాడు "ఎదటివాళ్ళని తప్పుపట్టేముందు ఎందుకు చాలామంది తనకోముందూ ప్రశ్నించుకోరూ" అని. నవ్వుతూ అన్నాడు, "మీ వెనకాల దాక్కున్న పెద్దమనిషిని కొంచెం తన ముఖకండరాలు అదుపులో పెట్టుకోమని అడగండి. నేగనక పట్టుకోకపోతే మా కుక్క అతని జబుబు చప్పగా కుదిర్చేది."

"ఏంరా, ఏంచేశావు నువ్వు?" అనే దూషణతో అసహనంలో అడుగుతోంది అర్భకుణ్ణి.

"అది కాదే, మరేమో నే నసలా కుక్క వేషే చూపెలా! ఆ చెట్టుని ఎక్కారించాను." చిన్నపిల్లల వాదం ఏ దేశంలో గాని ఒకే విధంగా నడుస్తుంది.

సుందరం నవ్వాడు. ఆమె సిగ్గుపడింది. కపోలాలికి కొత్తగా రావలసిన అరుణిమ లేదు, కోపమొచ్చినప్పుడున్న ఎఱ్ఱదనం చాలు. 'నేను చాల విచారిస్తున్నా'నని మృదువుగా అంది. ఊటీ చల్లదనాన్ని ఇంకా శీతలింపించుతయ్ అందమైన ఆడపిల్లల లజ్జావచస్సులు.

"*Not at all*" అని మర్యాదగా ఆమె విచారాన్ని తోసేశాడు కథానాయకుడు. అతను ఆలోచిస్తున్నాడు కుఱ్ఱవానికోప మణగించడమెలా అని.

"నాకు ఆల్సేషియన్లంటే ఇష్టంలేదు" అన్నదామె.

"నాకు పగ్ డాగ్స్ అంటే ఇష్టం లేకపోలేదు" అన్నాడు సుందరం నవ్వుతూ. "నన్ను ప్రేమిస్తే, నా కుక్కని ప్రేమించు" అన్న విషయ మతనికి బాగా తెలుసు.

ఆమె సంతోషించింది. "నిజంగా! మీకు పగ్ డాగ్స్ అంటే ఇష్టమా? ఇది చాలా మంచికుక్క. మా యిద్దరికీ *Perfect understanding.*" భూమికి జానెడు లేని తన కుక్క సుగుణాలు వర్ణిస్తోంది ఉత్సాహంగా. సుందరం తన్మయత్వంతో విన్నాడు, మధ్యమధ్య నోమాట అందిస్తూ.

తర్వాత కుఱ్ఱాణ్ణి బెల్లిస్తూ పిలిచాడు, "బాబమ్మా, ఇది ఎంత మంచికుక్క! షేక్‌హాండిచ్చి స్నేహంచేసుకోవూ?" అని.

"ఛీ! వెధవకుక్క. కరుస్తుంది." వెనక్కి తగ్గాడు పెంకి ఘటం!

సుందరం ఇది లాభం లేదనుకొని థండర్ వెంపు తిరిగాడు. దానికోపం చల్లారిపోయింది, కౌతుకంతో పరీక్షిస్తోంది ఆ అమ్మాయినీ పరివారాన్నీ. "తప్పు కాదూ, నువ్వు చిన్నపిల్లల్లా భయపెట్టడం? చూడిప్పుడా కుఱ్ఱాడు నీస్నేహం ఒద్దంటున్నాడు. వెళ్లి దణ్ణం పెట్టి క్షమాపణడుగు పో" అని దానిచేత రెండు కాళ్లూ ఎత్తి దణ్ణం పెట్టించాడు. నౌకరు రామిగాడు తోచని సమయాల్లో నేర్పిన విద్యలన్నీ ప్రదర్శింపించాడు దాంచేత. కుఱ్ఱవెధవకి భయం పూర్తిగా పోయింది, ఆ అమ్మాయికి కొద్దిగా ఇష్టం కలుగుతున్నట్లుంది.

"తెలివైన కుక్కేనే" అన్నది ఆశ్చర్యంగా.

"అందుకు సందేహమా?" అని గర్వపడిన సుందరం పనిలో పనిగా, 'మీ పేరు తెలుసుకోవచ్చునా?' కత్తుకలుపుతున్నాడు.

"నా పేరు మైథిలి" అన్నది.

"నేను సుందరరామశర్మని. వ్యవహారానికి సుందరాన్ని" అన్నాడు చక్కగా.

"మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకు చాల సంతోషంగా ఉన్న"దన్నది మైథిలి సగం సిగ్గుగా.

సుందరం ఎవరెస్టుశిఖరానికి ఎగబ్రాకాడు, మబ్బుల నెత్తిమీద నడిచాడు, గాలితో కేళిగా పరిగెట్టాడు. ఇన్ని చేసి ఇతోధిక ఉత్సాహంతో కబుర్లు చెప్పాడు.

మైథిలి అనుకుంది, ఎప్పుడుగాని ఇవాళ్టిలో సగమాత్రం ఆనందం తను పొందలా. ఎంత కొత్తగా కూర్మిగా, ఎంత తెలివిగా తియ్యగా మాట్లాడుతున్నాడు!

ఆమెలో ఇతః పూర్వం ఎవరియెడల గాని అననుభూతమై అతన్నిగూర్చి తెలుసుకోవాలనే ఆకాంక్ష అవ్యక్తంగా; అతనిలో ఆమెనిగూర్చి వ్యక్తంగా.

"ఈ కుక్క పేరేమిటి?"

"రాబిన్. దాని పేరో?"

"థండర్ బోల్ట్. పరుషంగా ఉంది కదూ?"

కుక్కలికి (కుఱ్ఱాలకికూడా) ఇంగ్లీషులో గాని పేర్లు పెట్టరు సాధారణంగా. అక్కడక్కడ ఒకటి రెండు పేర్లు హిందీలో కూడా కద్దు. అయితే తెలుగులోకి దిగామో, రాముడు రంగడు ఇవి తప్పితే వేరే పేర్లు కనపడవు. కుక్కమీద పంచప్రాణాలుండే యజమానికి పేరుపెట్టేవేళ అజామీళుడి కథ గాని గుర్తుకొస్తుందేమో?

డాగ్ షో మొదలెట్టింది.

కాకర్ స్పానియల్, బుల్ టెరియర్, చౌ చౌ ఏవో తలాతోకా లేనన్ని రకాలు, జాతిభేదాన్ని బట్టి రిట్రీవింగ్‌కీ విధేయతకీ వేర్వేరే అన్నీ కలిసి దిక్కుమాలినన్ని బహుమతులు. థండర్స్ ఆల్సేషియన్లకి ప్రత్యేకించిన కప్పు తన్నుకుపోయింది. రాబిన్‌కి ఏ బహుమతీ వచ్చే అదృష్టం పట్టలా.

సుందరం తన విచారాన్ని వెలిబుచ్చాడు, "ఇం చక్కని చిన్న కుక్క" అని రాబిన్‌ని మెచ్చుకున్నాడు. "ఎంత మంచివాడితను" అనుకున్నదామె మనస్సులో. అతన్నీ కుక్కనీ అభినందించింది.

"మీరు వేసవి కొచ్చారనుకుంటానే యిక్కడికి?" అన్నాడు సుందరం.

అవునన్నట్లు తలూపింది. "అసలు మాది మెడ్రాసు. నే నక్కడ ఇంటర్ చదువుతున్నా" నంది.

"అలా చెప్పు. నువ్వు షోడశివి. అందుకనే మధురంగా రేఖామాత్రంగా ఆ శైశవరాగం నీ మాటల్లో" అనుకున్నాడు సుందరం. అతను భావుకుడు.

అంతా కథలోకి మల్లే, కలలోకిమల్లే — ఇద్దరికీ, అతని కెక్కువగా ఆమెకి కొంచెం తక్కువగా. "సాయంసమయాలు మన మీ కుక్కల్నేసుకుని ఎందుకు షికారు పోగూడదూ" అని సుందరం సజెశ్చన్. ఆమె ఉత్సాహం చూపింది. అతను ఆకాశం అంటాడు.

ఉప్పెనలా గుండెలో విప్లవిస్తూన్న ఆనందం, వెన్నెల వెలిగించిన వినువీధిగా మనస్సు. గాలిలో తేలిపోతూన్నట్లు తన కన్న ముందడుగు వేస్తూన్న సుందరాన్ని చూచి ఏమయిందీతనికి అని ప్రశ్నార్థకంగా తెల్లబోయిందథండర్, ఇంటికి పోతూంటే.

మర్నాడు మామయ్య సంతోషం వెలిబుచ్చడానికి తగినన్ని మాటలు దొరక్కపోయినయ్ ఏ భాషలోనూ. "నే నుండవలసింది అక్కడ" అన్నాడు కొసకి. సుందరానికి మామయ్యరావడంమూలాన ఎవరికొక్కని వచ్చే అదనపు లాభమేమిటో అర్థంకాలా.

మైథిలి కోసమన్నా తను అలిండియా సర్వీసెస్‌కి గట్టిగా చదవాలి. సుందరం పుస్తకాలు ముందేసుకుని తీవ్రంగా చదవడం మొదలెట్టాడు. కాని మామయ్యకంతా వేళాకోళం - ఆయనకి మైథిలి సంగతి తెలియదు — "అరెరే, ఎందుకోయ్ అంత కోపం నీ పుస్తకాలమీద. వాటి కొక్కస్త విశ్రాంతి ఇవ్వు మరి" అన్నాడు. ఇంతలో పెళ్ళాం అటు రాగా ఆయనకి హాస్యరస ప్రకోపం అధికమైంది...... "ఒరేయ్ సుందరం నిన్ను చూసి అప్పుడప్పుడనుకుంటా, నా నీ కీడైన కూతురు నాకు లేకపోయెనే అని. నువ్వు కూడా మీ అత్తయ్యనెప్పుడూ అడగవేం, చేపా చేపా ఎందుకెండలేదూ? అని."

సుందరం మొదటిసారిగా మామయ్య మాటలు లెక్కపెట్టలా; పుస్తకంనించి తలయెత్తలేదతను. 



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 129. జ్యోతిషము నిజమా?

అని పెక్కురు అడుగుతున్నారు. ఇది ఒక్కరి సమాధానమువల్ల తేమలదు. జ్యోతిష ఫలితాలు చాలా అబద్ధమౌతూ ఉంటాయి అని ఎంతమందికో తెలుసు. అలాంటప్పుడల్లా జ్యోతిష్కులు జననకాలము సరిగ్గా తెలియకపోవడము వల్లనే ఆ తప్పులౌతాయిగాని ఆకాలము తెలిస్తే తప్పిమని సరిపోతాయని చెప్పడముకూడా చాలా మందికి తెలుసును. అయితే విజ్ఞానదృష్టితో చూచినప్పుడు జ్యోతిషముయొక్క నిర్దుష్టతను గురించి కొన్ని సందేహాలు కలుగుతాయి. వాటిని చెప్తాను.

(1) జ్యోతిషానికి పునాది ఏది? మానవ జీవితాన్ని గ్రహాలు నడుపుతాయన్నదే కదా? గ్రహాలకీ మానవజీవితానికీ సంబంధమేమిటి? గ్రహాలనుంచి మనకు చేరే వెల్తురు మన జీవితాల్ని తిప్పుతుంది అంటారు కొందరు. కాంతివంతాలైన సూర్యచంద్రుల రశ్మికేగాని తక్కిన గ్రహాలకాంతికి భూమి మీది జీవరాసులమీద ఏప్రభావమున్నట్లూ ఇంతవరకూ వైజ్ఞానికులకు తెలియరాలేదు. 'నేను కాకపోయినా ముందుముందు కనుక్కోగల రంటారు కొందరు. కావచ్చును. అయితే ఇంతవరకూ జ్యోతిష్కులు గణించని యురేనస్, నెప్ట్యూను, ప్లూటో, ఏప్షి రాయున్న సంగతి ఏమిటి? వాటికి మానవ జీవితాన్ని నడిపేశక్తులు లేవంటారా? వెల్తురికి మానవజీవితమ్మీద ఏ ప్రభావమున్నా, నక్షత్రాలకాంతి మాట ఏమిటి? సూర్యుడి కాంతికీ నక్షత్రాల కాంతికీ తేడా ఎక్కువ లేదే?

సరే. గ్రహాలకు ఏవో శక్తులున్నాయన్నారు. రాహుకేతువులు నీడలుగదా; వాటికేమి శక్తి ఉండగలదూ? వాటికే వెల్తురూ లేదే?

జననకాలముగదా గుర్తించమంటారూ? మీరెంత సూక్ష్మంగా విభజించినా, ఒకరోజున పుట్టగల శిశువుల జాతకాలు మొత్తమే 720 గానో తేల్తాయి. పగటి గడియలు కొన్ని మినహాయిస్తే ఇవి ఇంకా తగుతాయి. అంటే ఒకే జాతకం గలవారు ఎంతమందో వుండాలే? అలాంటివారేగదా జ్యోతిషానికి చక్కని ఉపపత్తి!' ఇలాంటివెన్ని శోధించారు మీరు?

ఎవ్వరూ ఈ పనిచేసినట్టులేదు. కవలల జాతకాలలో ఎంతపాటి సామరస్యము కనబడుతుంది? సామరస్యమువల్లనే ఉపపత్తి లభిస్తుందిగాని విభేదమువల్ల కాదు.

గ్రహాలకే కాక రాసులకుకూడ శక్తులున్నాయంటారే, దీని కాధారమేమిటి? రాసులకీ, గ్రహాలకీ చాలాదూరం. రాసులకున్న ప్రభావం తక్కిన నక్షత్రాలకి కల్పించకపోడం అసమగ్రతకాదూ? రాశ్యధిపతి' అనగా యేమిటి? ఎన్నో జ్యోతిర్వర్షాలదూరమున్న నక్షత్రాల కల్పిత కుటుంబాలకీ, దగ్గరగానున్న గ్రహాలకే సంబంధమేమిటి? ఇంతకన్నా పెద్ద వెర్రి ఉంటుందా?

మానవుడి స్వప్రయత్నమూ, భగవంతుడి సాయమూ అన్నవి ఏ గ్రహాలు నిర్ణయిస్తాయీ? గ్రహశాంతులు చేయిస్తారే-, వాటిని నడిపే గ్రహమేది? "నీకరుణయే నాకు చంద్రతారాబలము" అని పురందదాసూ, "గ్రహబలమేమి, రామానుగ్రహబలమే బలము" అని త్యాగరాజస్వామి చెప్పారే, అదే నిజమైతే గ్రహాలగొడవ యెందుకు? ఆ రాముణ్ణే కొలవరాదా?

జ్యోతిషము ఎలాగు వృద్ధి అయిందో, ఒక శతాబ్దములో లేని జ్యోతిషగ్రంథాలలోని వస్తువు తక్కిన శతాబ్దాలలో ఎలాగు, ఏ సూత్రాల ననుసరించి వచ్చిందో, ఆయా గ్రహాలకి ఆయా నిర్ణీతసంవత్సరాల దశలే ఎలాగు వచ్చెయో, ఆ నక్షత్రాలకీ ఆ గ్రహదశకీ టాకీ ఏ సబబుననుసరించి ప్రవేశపెట్టారో ఎవరేనా విమర్శించి చూశారా?

మరి ఏమిటాధారమూ జ్యోతిషానికీ? ప్రజల వెర్రి నమ్మకమా? అన్నట్లు జ్యోతిష ఫలితాలన్నీ జరిగేటట్లయితే వాటిని తెలుసుకు లాభం ఏమిటి? మార్చగలిస్తే గ్రహశక్తు లేమయినట్టూ?

## 130. చారిత్రక సూత్రాలు

విజ్ఞానశాస్త్రాలన్నిటిలోనూ సృష్టిలో కచ్చితంగా నడిచే సూత్రాలుంటాయి. 'ప్రతీవస్తువూ మరోకవస్తువుని ఆకర్షిస్తుంది,' 'రాసాయనిక మార్పులో తొలిద్రవ్యాలకంటె ఫలద్రవ్యాల నైసర్గికశక్తి తక్కువగా వుంటుంది,' 'స్థావర జంగమప్రాణులు పరిస్థితుల కనుగుణంగా సర్దుకుంటాయి,' 'వస్తువులధరలు అవసర సమృద్ధులనుబట్టి వుంటాయి,' వంటివి. ఈసూత్రాలు తెలుసుకోడమువల్ల పురుషార్థాలు సాధించడములో మన ప్రయత్నాల్ని అసాధ్యపు దారుల్లోనూ, దుస్సాధ్యపు దారుల్లోనూ పడనివ్వకుండా సుసాధ్యపు దారుల్లో నడుపుకోవచ్చును. అయితే మనకి పనికి వచ్చే చారిత్రిక సూత్రాలు ఏమేనా వున్నాయా? చరిత్రలను పఠించడము వల్ల మానసికవికాసము మాత్రమే కాకుండా, వర్తమానకాలములో మనకి పనికివచ్చే

సూత్రాలు ఏవేనా తెలుస్తాయా అని ప్రశ్న.

ఉన్నాయి. చరిత్రని మెలకువతో పరిశీలిస్తే దొరుకుతాయి చక్కని సూత్రాలు. ఇవి ముఖ్యంగా మానవస్వభావాన్ని వివరిస్తాయి. కనక, మన ప్రయత్నాల్లో చక్కగా పనికి వస్తాయి.

'నీకే కష్టమైన నీపని సాధించడానికి నీ బంటుని పంపకు' పంపేలాభముండదు. దారాసుల్తాను, దక్కనునించి ఢిల్లీమీదికి ఎత్తివచ్చిన ఔరంగజేబుతో యుద్ధముచేయడానికి సైన్యవూయత్తముచేసి, దానిని తాను నడపడానికి బదులు జస్వంతసింగుని పంపేడు. జస్వంతుడు గట్టియుద్ధమే చేశాడుగాని, అతని మొగలసైనికులకు ప్రతిపక్షములో రాజకుమారుడూ (ఔరంగజేబు) తమ్ముననడిపేది తాబేదారు 'కాఫరూ' కనపడ్డారు. విజయము ఔరంగజేబుదే అయింది. దారాయే స్వయముగా వచ్చియుంటే 'సముగరు' యుద్ధఫలితమే కాదు; భారతదేశచరిత్రే మారియుండును.

'చేస్తాడో చెయ్యడో అని సందేహించవలసిన నౌకరును పనికి పంపవలసివస్తే వాణ్ణి పంపి, ఆ వెంటనే నువ్వూ వెళ్లు.' అక్బరు చిత్తూరుకోటని సాధించవలసివచ్చింది. రాజపుత్ర సర్దారుణ్ణి సైన్యమిచ్చి పంపేడు. కాని, వాడు కన్నెర్రా యుద్ధము చెయ్యడేమో అని అనుమానముంది. కొద్ది గంటలలో తానుకూడా మిగిలిన సిబ్బందితో చిత్తూరు వెలపల తయారయాడు. మరొకసారి ఇలాంటి అవసరమువస్తే ఆ తాబేదారు అశ్రద్ధ చెయ్యడు.

"తాబేదారు ప్రతికూలుడో అనుకూలుడో తెలియనప్పుడు నమ్మకమైన బంటుచేత హుకుమును పంపి, వాడి వెనకనే కొంచెం తాళి నువ్వు వెళ్లు." అక్బరు బైరాముఖాను కుట్రచేస్తున్నాడని తెలుసుకుని పరివారమంతటితోనూ ఆగ్రాకి వెళ్ళిపోయి, తన సహోయుల సందర్శి కూర్చుకుని, "మక్కాయాత్రకు పయనము కమ్మని బైరాముఖానునికి వార్తనంపి, వెనువెంటనే తానూ సైన్యంతో తయారయ్యాడు. హుకుము తెచ్చినవాడిమీద బైరాముఖానుని తమ్ముడు తెగ ఎగిరేడు. 'నీ అక్బరుకు తన సింహాసన మీ బైరాముఖానుని ప్రసాదమే అని తెలియదా' అనీ, ఇంకా యెన్నో. ఈ అరుపులతో బైరాముని పక్షుపుబలము ఖర్చైపోయింది. అక్బరు అప్పుడే వచ్చి బహిరాముని తమ్ముని చేతులూ కాళ్ళూ కట్టించి కోటగోడమీదనుంచి కింద పడవేయించి, బహిరామునితో "దాదాజీ! చలియే మక్కాకే" అన్నాడు! అక్బరు రాకుంటే ప్రబోధములాగ పనిచేయగలిగిన మాటలు అక్బరు రావడమువల్ల రాజద్రోహమై పోయాయి.

"నీపని నిర్వహిస్తూంటే శత్రువునేనా సరే కూలతోయకు. అందువల్ల నీపని రెట్టింపైపోతుంది" ఇంగ్లీషువారికి అమెరికాలో, కనడాలోనుండిన ఫ్రెంచివారూ, సంయుక్తరాష్ట్రపు ఆంగ్లేయులూ, ఇద్దరు శత్రువు లేర్పడ్డారు పద్దెనిమిదో శతాబ్దపు ఉత్తరభాగములో. ఫ్రెంచివారి భయంవల్ల సంయుక్త రాష్ట్రాలవారు విజృంభించలేక పోయారు. తెలివితక్కువగా, ఆంగ్లేయులు ఫ్రెంచివారితో యుద్ధాలుచేసి అణగలొక్కరు. దానితో ఉన్న అడ్డు కాస్తాపోయి అమెరికనులు విజృంభించారు. దెబ్బతిన్న అక్కసుచేత ఫ్రెంచివారు అమెరికనులకు సాయపడి వారి స్వాతంత్ర్య ప్రకటనకి సాయంచేశారు. దక్కనులోని మహమ్మదీయ రాజ్యాల్ని రూపుమాపి, ఔరంగజేబు మహారాష్ట్ర విజృంభణానికి దారి చేశాడు.

## చిట్టిప్రశ్నలకు జవాబులు

—నీటి తాకిడికి సముద్రపు తీరాన్న ఉన్న శిలలు విధిలమై ఇసుక రేణువులుగా ఏర్పడతాయి సముద్రతీరంలో. గాలి తాకిడికి దొర్లి దొర్లి శిథిలమై ఇసుక రేణువులౌతాయి యెడారులలో. సముద్రపు ఇసుక రేణువు అంచులు ఎక్కువగా అరగవు: ఆ ఇసుక ఆట్టే దూరము పోదుగదా? ఎడారి ఇసుకరేణువులు బహుదూరము కొట్టుకు పోడములో వాటి అంచులు మొద్దుగా అరిగిపోతాయి.

—జ్ఞానేంద్రియాలన్నిటికంటె కన్ను ఎక్కువ ఉపయోగము. శబ్దము విన్నప్పటికీ, కారణము ఏమిటా అని చూస్తాము. కనక కన్ను తెరచి ఉంచినంతసేపూ వస్తువుల ఆకారమూ, రంగూ, కదలికా మన మెదడుకి అందుతూనే వుంటాయి. అందువల్ల విశ్రాంతి దూరమౌతుంది. కన్ను మూసి పక్కమీద వాలితే, ఇక పనిచేయగల జ్ఞానేంద్రియము చెవి ఒక్కటే. నిద్రపోబోయేటప్పుడు చెవిలో దూదులు పెట్టుకోడము మనదేశములో అంత అవసరము లేదు. యుద్ధసమయాల్లో కావాలేమో. కంటి మూతతో మనకీ బాహ్యప్రపంచానికి నడుమ రెప్ప తెర పడిపోయి విశ్రాంతికి సాయపడుతుంది. అందుకే ప్రాణులన్నీ కళ్లుముయ్యడము. ★



రామప్ప దేవాలయంలో ప్రేమికుల శిల్పం

“అయ్యోపాపం పెద్దముల్లే!”

చిత్రకారుడు
శ్రీ గోలి
శేషయ్య,
తెనాలి






# తప్పిపోయిన పాప



రచన: శ్రీనివాస కాశ్యప

అమ్మ చూచారమ్మ
నాచిట్టి తండ్రినీ!
అగుపించలేదమ్మ
ఇంటిలో వాడూ!

* * *

ముద్దుమోమున ఆడు
ముంగురులవాడు-
ముద్దుకృష్ణునిలాగు
ముచ్చటొస్తాడూ!

* * *

కలువరేకులవంటి
కన్నులవాడూ!
కిలకిలా నవ్వుతాడు
చిలకలా వాడూ!!

* * *

వచ్చి రాని మాట
ఉచ్చరిస్తాడూ!-
తప్పటడుగులు వేస్తు
తప్పిపోయాడూ!

ఇంటిలోపల నేను
వంటచేస్తున్నాను
ఇంతలో వాడెటకో
దారి తీశాడూ!

* * *

మీరు చూచారమ్మ
మీరు చూచేరా ?
త్వరగ చెప్పండమ్మ
త్వరగ చెప్పండీ ?!

* * *

విన్నవారంతాను
విస్తుపోయారూ!
తెలియదంచును
కళ్లు తేలవేశారూ!!

* * *

అమ్మ వూరంతాను
వెతికి వచ్చిందీ!-
సుతుని గానక తాను
వెతను పొందిందీ!

ఇంతలో ఒకపాప
అంత చెప్పిందీ:-
ఇంటిలోనే వుండె
కొంటె పాపాయీ!!

* *

పాప చెప్పిన యపుడె
పరుగిడుచు అమ్మ
పాపాయికడకపుడె
పరుగెత్తె నమ్మ!

* *

పోయి చూచినతోడ
పోకి రబ్బాయీ!
ఇంటిలో ఊయలలో
వంటరిగ నిదురించె!!

* *

తన తెలివితక్కువకు
తనలోన తానె-
అమ్మ విస్మయమంది
నెమ్మదిగ నవ్వింది!



అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

### 4

మా పడవప్రయాణం ప్రారంభమైంది. నాటి వుదయకాల వాతావరణం అతి మనోహరంగావుంది. అది వసంతఋతువు అంత్యదశ అయినా కావచ్చు; లేదా గ్రీష్మఋతు ప్రారంభదశ అయినా కావచ్చు. ఈ రెంటిలో ఏది మీకు యిష్టమైతే, అదే అప్పటిఋతువు అనుకోవచ్చు; మరేమీ ఫరవాలేదు. నూతనంగా యౌవ్వనదశలో అడుగు పెట్టిన కన్యకి ఎలాంటి పులకరింపులు వస్తుంటాయో, అలాంటి పరిణామాలేవో ప్రకృతిలో కూడా జరుగుతున్నట్లున్నాయి. చెట్లఆకుల్లో లేతదనంపోయి అప్పుడప్పుడే ముదురు రంగు తొంగిచూస్తోంది.

మాపడవ నదిమీద తేలిపోతోంది. నదికి రెండువైపులా జనావాసాల వెనుకభాగాలు బారులు తీర్చివున్నాయి. నదీజలం విరజిమ్మిన సూర్యకాంతిలో ఆగోడలన్నీ కళ్లు మిరిమిట్లుగొలిపేలా వెలిగిపోతున్నాయి. పడవవాళ్లు నడిచేందుకు కొయ్యబల్లలతో తాపడంచేసిన బాటఒకటి నదిపొడుగునా ఒక పక్కగా కనిపిస్తోంది. మధ్యలో అప్పుడప్పుడూ ఏదో ఒకభోటు మాకుఎదురై, ఆకాస్సేపూ నది అంతా సందడిగావుంది. తెడ్లువేస్తున్న హారిస్సుగాడు వుండి వుండీ ఎవరినో తిట్టి పోగులుపెట్టుతున్నాడు.

ట్యూడర్ రాజులనాటి పాతకోట దూరంగా కనిపిస్తోంది. వీటన్నిటితోనూ నాకళ్లముందే కదిలే ఆదృశ్యం చైతన్యపూరితంగా కనిపించింది. అన్ని రకాల శబ్దాలలోనూ అదేదో ఒకరకమైన గంభీర నిశ్శబ్దమే తోచింది. నిద్రకది సమయం కాకపోయినా, యీ అనుభూతుల మూలంగా నాకళ్లయెదుట ఏవేవో కలలు కదిలిపోవటం ఆరంభించాయి... క్రమ క్రమంగా స్వాప్నిక జగత్తులో పడిపోయి, అంతులేని ఆలోచనలు చేస్తున్నాను.

ముందుగా యీ 'కింగ్స్టన్' అనే వూరిపేరు మనస్సులో మెదిలింది. దీన్నే శాక్సన్ రాజుల రోజుల్లో 'క్లైనింగస్టన్' అని పిలిచేవారు. ఆరాజులకందరికీ మూర్ధాభిషేకాలు యిచ్చోటనే జరిగేవి. సీజరు, ఇంగ్లండుమీదికి దండెత్తి వచ్చినప్పుడు, యిక్కడే దిగాడు. నాటి రోమన్ సైనికులు ఆ కనుపించే గుట్టలమీదనే మకాం చేశారు. జనవాక్యాలని బట్టి చూస్తే ఇటీవలి కాలంలో ఎలిజబెత్ రాణీలాగే, ఆ ప్రాచీన యుగంలో సీజర్ కూడా ఇంగ్లండులో అన్ని చోట్లా మకాం చేసినట్లు తోస్తుంది: అయితే యీ వ్యక్తు లిద్దరిలోనూ ఒక్క వ్యత్యాసం వుంది. ఎలిజబెత్తురాణి యెక్కడికెళ్లినా హోటళ్లలోనే మకాం చేసి

మూలం :
జెరోమ్ కె. జెరోమ్



అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

# ★ ముచ్చటగా ముగ్గురు ★

నట్లు చెప్పటానికి చరిత్ర ఆధారాలువున్నాయి, సీజర్ మాత్రం ఏహోటల్లోకీ వెళ్లినట్లు కనిపించదు.

లండన్ చుట్టుపట్ల పదిమైళ్లదూరంలో వుండే హోటళ్లలోనూ ఏఒక్కదాన్నీ వదిలిపెట్టకుండా యీ ఎలిజబెత్తు రాణీగారు ప్రతిహోటల్లోనూ ఎప్పుడో ఒకప్పుడు ప్రవేశించినట్లో, బసచేసినట్లో, గంటో అరగంటో అక్కడ గడిపినట్లో కనిపిస్తుంది. ఈహారిస్సు గాడు కూడా ఎప్పటికైనా తన జీవితంలో నూతన అధ్యాయం ఒకటి ప్రారంభించి, పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకొని చచ్చిపోయేతోగా ఇంగ్లండుకి ప్రధాన మంత్రి అవుతాడనుకోండి. వాడి మరణానంతరం దేశంలోవుండే ప్రతిహోటలు, వాకిట్లో "స్వర్గీయ హారిస్సు యీ హోటల్లోనే సారా సేవించేవాడు." అనో, "స్వర్గీయ హారిస్సు 1888 వేసవిలో యీ హోటల్లోనే డ్రింకులు త్రాగారు" అనో, "స్వర్గీయ హారిస్సు ప్రధానమంత్రి కాక పూర్వం (1886లో) యీహోటల్లోనుంచి తరుమబడ్డాడనో బోర్డ్లు తగిలించేస్తారు.

ఏహోటల్ చూసినా యీ హారిస్సుగాడి స్మరణతో మారుమ్రోగి పోతూవుంటుంది. ఆకారణం చేత, జనం వీధుల్లోపడి యీ హారిస్సుగాడి గొడవలేని హోటల్ కోసం పనిగట్టుకు వెతుకుతారు. చివరికెక్కడో ఒక మారుమూల ప్రదేశంలో "ఈ చుట్టుపట్లలో హారిస్సు ప్రవేశించని ఏకైక హోటలు యిదే!" అని బోర్డు వ్రాసివున్న ఒక హోటల్ కనిపిస్తుంది. హారిస్సు యీఒక్క హోటల్లోకి ప్రవేశించక పోవటానికిగల కారణాలు ఏమిటైవుంటాయోనని జనమంతా ఆహోటల్ మీదికి విరుచుకుపడతారు.

ఇలాంటి చరిత్రప్రసిద్ధమైన 'కైనింగ్స్టన్' పట్టణానికి ఎల్లాంటి పతనదశ వచ్చిందో!

ఈనాటికీ యిక్కడ మిగిలివున్న భవనాలని చూస్తుంటే, యీపట్టణం రాజనగరుగావున్న రోజుల నాటి వైభవ ప్రాభావాలన్నీ స్ఫురణకు వస్తాయి. ఆనాడు రాజవీధుల్లో ఎక్కడ చూసినా, ఎప్పుడు చూసినా పంచకళ్యాణీ గుర్రాలను పూన్చిన బళ్లు ఒకదానితో ఒకటి పోటీపడి పరుగులు తీస్తుండేవి. ఏవీథిలో చూచినా అందమైన ముఖాలు, ధగధగ మెరిసిపోయే ఆభరణాలు, ఫెళఫెళలాడే సిల్కుదుస్తులే! 'ప్రతి' యింటికీ ఎత్తైనగోడలు;-అతి విశాలమైన గదులు; పెద్దపెద్ద కిటికీలు వుండేవి. ఇళ్లు అంటే ఏమిటో, అవి కట్టడ మెలాగో తెలిసినవాళ్లు కట్టినయిళ్లు అవి! భవననిర్మాణంలో వాళ్లు వుపయోగించిన ఎర్ర యిటికెలు కాలం గడిచినకొద్దీ యింకా గట్టిబడ్డాయి. ఆకొయ్యమెట్లు, వాళ్లు ఎంత నేర్పుగా వేశారో ఏమోకానీ, యిన్నిఏళ్లు గడిచాక కూడా, అవి మనుష్యులు దిగుతున్నప్పుడు కిర్రుమని అయినా అనవు.

కొయ్యమెట్లమాట వచ్చేసరికి, నాకు యీ కింగ్స్టన్ లోనే ఒకానొక భవనంలోని మెట్లసంగతి జ్ఞాపకం వస్తున్నది. ఆభవనంలో యిప్పుడొక షాపు వున్నది. ఇప్పుడు దాన్ని చూసినవాళ్లకెవరికైనా, అది ఒకనాటి రాజభవనమని తోచకమానదు. కింగ్స్టన్ లో వుండే మా మిత్రుడొకడు హాట్ కొనుక్కుందామని ఒకరోజున ఆషాపుకి వెళ్లాడు. హాట్ తీసుకొని డబ్బులుయిచ్చేసి తిరిగి వస్తుండగా, ఆషాపు యజమాని యితణ్ణి వెనక్కిపిలిచి, "చెక్కడంపని చేసిన కొయ్య ఏమైనా చూస్తారా?" అని అడిగాడట. 'చూస్తానన్నాడు' మావాడు-ఇకనేం-వీణ్ణి సరాసరి లోపలికి రమ్మని మేడ మెట్లమీదగా నడిపించుకెళ్లాడు. మెట్లమీద మాత్రమే కాకుండా ప్రక్కనవుండే కమ్మీలమీదా, గోడలమీదా అంతటా చక్కని బొమ్మలు చెక్కివున్నాయట. అదంతా చూసిన మా మిత్రుడు యిది మామూలు మనుష్యులువుండే యిల్లు కాదని, ఎవరో జమీందారు లుండవలసిన సౌధమనీ అనుకొన్నాడట. వాళ్లిద్దరూ మెట్లుఅన్నీ ఎక్కి ఒక పెద్దహాలులోకి వెళ్లారు. ఆహాలు గోడలనిండా నీలిరంగు కాగితాలు అంటించి వున్నాయట. ఇక్కడికి తనను ఎందుకు తీసుకొచ్చినట్లా అని మా మిత్రుడు విస్తుబోతుండగా, షాపుయజమాని ఒకగోడమీద వేళ్లతో మోగించాడట. కొయ్యమీద కొట్టినశబ్దం

వచ్చింది. "చూడండీ! ఆ మెట్లమీాద వున్నట్లే, యీ హాలు హాలుఅంతా పైకప్పుదాకా కూడా, బొమ్మలు చెక్కిన కొయ్యతోనే తాపడం చేశారు!" అన్నాడట ఆషాపు యజమాని.

మా మిత్రుడికి చాలా ఆశ్చర్యం వేసింది. "అయితే దాన్నంతటినీ యిలా కాగితాలతో కప్పేస్తేశారేం?" అని అడిగాడు.

"కారణం మరేమీా లేదండీ! ఆ చెక్కడం చాలా విలువైంది. దాన్ని బయటికి కనిపించేలా అట్టే పెట్టానంటే, యిక యీ యింట్లోవుండే ప్రతి వస్తువునీ, ప్రతిమనిషినీ అందుకు తగ్గట్టుగా తయారు చేసుకోవాలి. అదీగాక,—ఈకాగితాలు అంటించక ముందు, యీగదిలోకి వస్తే—అదేమిటో అన్ని బొమ్మలు అవీ చూస్తూవుంటే — మనస్సు ఎందుకో గుంజాటన పడేది. ఇప్పుడు నాప్రాణానికి ఎంతో హాయిగా వుంది" అన్నాడు ఆషాపు యజమాని.

ఆషాపు యజమాని వెలిబుచ్చిన అభిప్రాయాలను గూర్చి మనం ఏవిధంగానూ తప్పు పట్టలేం. (నిజానికి తప్పు పట్టితేనే వాడికి చమ్మగా వుండవచ్చు. అది వేరేవిషయం అనుకోండి!) ఏమైతేనేం—గతుకుల్లో పడిపోకుండా జీవితం సాఫీగా సాగిపోతేచాలు ననుకొనే మామూలు గృహస్థుల దృక్పథమే ఆషాపు యజమానిదీ. అంతేకాని పురాతత్వ వస్తుసేకరణ కోసం పరవళ్లుత్రొక్కే అసాధారణ వ్యక్తుల దృక్పథం కాదు. ఆవిధమైన దృక్పథం లేనివారికి యిన్ని బొమ్మల మధ్య మసలటం చాలా బాధాకరంగానే వుంటుంది. చర్చిలో కాపరం చెయ్యవలసివస్తే ఎల్లా వుంటుందో, యిలాంటి రాజభవనాల్లో మామూలు గృహస్థులు వుండవలసి వచ్చినా అల్లాగే వుంటుంది.

ఈషాపు యజమానివిషయంలో చిత్రంగా తోచే అంశం ఏమిటంటే, కొయ్యబొమ్మలంటే అట్టే అభిమానంలేని యీాయన వాటిమధ్యనే కాపరం చేయువలసి రావటమూ; అల్లాంటి బొమ్మలు ఒకటి రెండైనా యింట్లో అట్టేపెట్టుకొంటే జన్మ తరించిపోతుందనుకొనే అనేకమందికి ఆ అవకాశం రాక పోవటమూ. ఒకవిధంగా చూస్తే ప్రపంచమంతా యింతేనేమో అనిపిస్తుంది. ఈభూమిమీాద వుండే ప్రతివాడిదగ్గరా వాడికి అక్కరలేని వస్తువులు మాత్రమే వుంటాయి. వాడు వేటికోసం అహర్నిశాలూ కలవరించి పోతుంటాడో అవన్నీ ఇతరుల దగ్గిర వుండిపోతాయి

పెళ్లి చేసుకొన్న వాళ్లని ఎవరిని చూసినా, వాళ్లకి పిల్లాలు అక్కరలేనట్లే ప్రవర్తిస్తుంటారు. పెళ్లి కానివాళ్లంతా పిల్లాలకోసం తహతహలాడిపోతుంటారు. తనపొట్టనే పోషించుకోలేని పేదవాడికి, మొక్కల్లాంటి పిల్లలు కనీసం అరడజనుమంది అయినా పుట్టుకొస్తారు. డబ్బువున్న దంపతులు, తమ ఐశ్వర్యాన్ని అందిపుచ్చుకొని అనుభవించే వారసులు లేక, కుళ్లి కుళ్లి చచ్చిపోతుంటారు.

ఏమిటో—అంతా చిత్రంగా వుంటుంది! కాకపోయినా యీామాదిరి ఆలోచనలు ఆలోచించటం కూడా అట్టే అంత మంచిపనికాదు. ఆలోచించినకొద్దీ మనస్సు పాడవటంతప్ప వేరే ప్రయోజనం ఏమీా వుండదు.

మేము చదువుకొనే రోజుల్లో ఒక కుర్రాడు వుండేవాడు. వాడి అసలు పేరు 'స్టివెంగ్స్'. మేము మాత్రం వాణ్ణి వుడికించటానికి 'సాండ్‌ఫర్డ్ అండ్ మెర్టన్' అనే కంపెనీ పేరుతో పిలుస్తుండేవాళ్లం. వాడిలాంటివాణ్ణి నేనింతవరకూ చూడలేదంటే అందులో అతిశయోక్తి ఏమీాలేదు. చదువుఅంటే వాడికి నిజంగా చాలా యిష్టం. గ్రీకు, లాటిన్ లాంటి భాషలు నేర్చుకోవటం కోసం వాడు అర్ధరాత్రి అపరాత్రి లేచికూర్చొని చదువుతుండేవాడు. "అవన్నీ ఇప్పుడు ఎందుకులేరా!" అన్నవాడితో దెబ్బలాడేవాడు. ఫ్రెంచిభాష వున్నదంట్టే అందులో వుండే క్రియాపదాల పేర్లు తలుచుకొంటేనే ఎంత గుండె నిబ్బరంగల మనిషి అయినా బేజారైపోవలసిందే. అటువంటిది, యీా అర్భకుడు, గుండె దిట్టం చేసుకొని వాటిజోలికి పోవటమే కాక, ఎవరు ఏరకమైన ఆశ పెట్టినా ఆపుస్తకం వదిలిపెట్టకుండా అల్లా చదివేస్తూనే వుండేవాడు. తనలాంటి బుద్ధిమంతుణ్ణి కన్నందుకు తన తల్లితండ్రులకి ఏదో ఘనత వచ్చిపడుతుందనుకొనేవాడు. అలాగే తనలాంటి మేధావి మా స్కూలులో వుండటం, స్కూలుకే గౌరవమని భావిస్తుండేవాడు స్కూలులో ప్రతిప్రయిజు తనేకొట్టే

(54-వ పేజీ చూడండి)

# పరీక్ష-చదువు

శర్మ, సూరి ఇద్దరూ మంచి స్నేహితులు. సూరికన్నా శర్మ తెలివి గలవాడు. శర్మకే మంచి మార్కులు వస్తూండేవి. అందరి మాష్టర్లకి శర్మఅంటే ఎంతో ఇష్టం. ఇంట్లో కూడా, వాళ్ళ అన్నయ్యల కన్న శర్మ ఎంతో స్వతంత్రంగా మెలిగేవాడు. కారణ మేమంటే అతనంటే అందరికి ఇష్టము కనుక.

కానీ పాపం సూరి ఒట్టి అమాయకుడు. శర్మతో స్నేహము చేసినా శర్మగుణాలు సూరికి అబ్బేవే కావు. దీనికి కారణము లేకపోలేదు. సూరి చాలా తలబిరుసుగా ఉంటాడు. శర్మ పగలల్లా తిరిగి గొడవచేసినా రాత్రులు చదివే వాడు. కాని సూరి రాత్రికూడా బబ్బుండేవాడు. స్కూల్లో సూరి అందరికన్న ఆఖరు వస్తుండే వాడు. అందుకని పాపము సూరిని బాగు పరుద్దామని శర్మ, చాలా సార్లు చదివించేవాడు. అయినా ప్రయోజనము లేకపోయేది. సూరికి మరో ఛెడుగుణము ఉండేది. వాళ్ళఅమ్మ వాళ్ళు ఏమైనా కొనుక్కురమ్మని బజారుకు పంపిస్తే తప్పకుండా అంగీకరించే వాడు. ఎందుకో తెలుసా? ధరలు ఎక్కువగా ఉన్నాయని కొనేసి కమీషను లాగే స్తుండే వాడు. ఈసంగతి వాళ్ళ అమ్మగార్కి తెలిసినా కొడుకు మీద ఉన్న ప్రేమకొద్దీ ఊరు కుండేది.

ఇన్ని ఉన్నా సూరికి మంచి గుణాలు కూడా లేకపోలేదు. ఇతనికి బీదపిల్లలులంటే బలేప్రేమ. తను ఏం తింటున్నా, ఎవరైనా, బీదవాళ్ళు అడిగితే వాళ్ళకు కూడా ఇచ్చి తృప్తిపరచేవాడు. ధనవంతుల బిడ్డలంటే ఇతనికి బలేకోపము. "వాళ్ళకు డబ్బుపొగరు జాస్తి" అని సూరివాళ్ళను ఎపుడూ ఏవో పేర్లుపెట్టి ఏడ్పించేవాడు. చిలిపి

శ్రీ కొంపల్లి బ్రహ్మానందరావు

చేష్టలు అంటే సూరికి బలే సరదా ఒకరోజు సూరి వాళ్ళ లెక్కల మాష్టార్ని ఏడిపించాలని ఓగమ్మత్తు చేశాడు. మాష్టారండీ! మీరు రోజూ ఒకదాని మొహాన్కి పౌడరు పూసి తుడిపేస్తూ ఉంటారు గదండీ! అని అడిగాడు క్లాసులో. "వెధవా! నేనూ రోజూ ఎవరి మొహాన్కి అసలు పౌడరు పూయనే పూయను ఈతడవ అలాంటి వెధవ మాటలు మాట్లాడావంటే నస్పెండు చేస్తాను" అని గద్దించాడు. అపుడు సూరి, మాష్టారు కోపం పడవద్దుసార్, రోజూ బోర్డుమీద వ్రాశి డస్టరుతో తుడిపేస్తూ ఉంటారు గదండీ? అని అనేసరికి క్లాసులో పిల్లలంతా ఘక్కున నవ్వారు.

మార్చినెల దాటి ఏప్రిల్ దగ్గరకు వచ్చింది. పరీక్షలకు ఎంతో గడువులేదు. అందరు బాగా చదువు తున్నారు. శర్మ రాత్రిం బగళ్ళు విసుగు లేకుండా చదివేస్తున్నాడు. కాని సూరికి పుస్తకం ముందున్న దనే గాని చదవ బుద్ధవటములేదు. ఎవరిచెట్టుకు మామిడీ కాయలు బాగా కాస్తాయా? అని ఆలోచిస్తూ ఉండేవాడు.

రెండు రోజులుకు పరీక్షలనగా సూరికి భయంవేసింది. పరీక్ష ఫేలవుతానని. ఇంట్లో వాళ్ళనాన్న గారు కేకలేస్తున్నారు చదువులేదని. శర్మ దగ్గరకుపోయి ఏం చేయాలో ఎలా చేస్తే పరీక్ష ప్యాసు అవ గలడో ఉపాయం చెప్పమని కోరాడు. కాని ఇప్పుడు అనుకుంటే ఏం లాభం? ఇపుడు ఏం చదవ గలడు? అందుకని శర్మ ఒక ఉపాయం ఆలోచించాడు. సూరి ఇలా రా అన్నాడు శర్మ "ఒరేయి! నేను ఒక మాట చెప్తాను వింటావా?" అని అడిగాడు. 'తప్పకుండా' అన్నాడు సూరి. సరే చెప్తావిను. "రాత్రికి నువ్వు ఒంటరిగా ఒక గదిలో పడు కొని నీకు ఏదేవుడు అంటే ఇష్టమో ఆదేవుడ్ని మనసారా తలంచుకొని ఇలా ప్రార్థన చేయి. ఓ దేవా ఈ రాత్రికి మా హెడ్ మాష్టారు దగ్గరఉన్న మా పరీక్ష పేపర్లలో ప్రశ్నలు ఇచ్చిందీ తెలిపావంటే నీకు 50 కొబ్బరి కాయ లు కొడ్తాను" అని మొక్కుకో అని

ఉపాయం చెప్పేడు శర్మ "కానీ జాగ్రత్తగా చేయ్యాలి ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా నీకు ప్రశ్నలు అందవు" అన్నాడు. నేను చెప్పినట్టు చేసేవంటే నీకు ఒక 'కల' వస్తుంది. ఆకలలో నీకోరిక నెరవేర కలదు అని అన్నాడు శర్మ.

నిజమేనని నమ్మాడు సూరి. శర్మ చెప్పినట్లే తూ. చ తప్పకుండా చేసేడు.

మరునాడు పొద్దునే శర్మ దగ్గరకు పరుగెత్తుకొని వచ్చాడు సూరి.

"ఏం నేను చెప్పినట్లు చేశావా?" అని అడిగాడు శర్మ.

ఆ చేశాను. అన్నాడు సూరి.

"అయితే ఏమయింది"? అని అడిగాడు శర్మ.

"లాభం లేకపోయింది" అన్నాడు సూరి.

"ఏం జరిగిందో చెప్పరా" అన్నాడు నవ్వుతూ శర్మ.

"సరే విను. ఆరాత్రి ఒక కల వచ్చింది ఆకలలో నేను హెడ్ మాష్టారు ఇంటికి పోయినట్టు ఆయన తలక్రింద ఉన్న తాళం చెవులు తీసి బీరువా తెరచినట్టు వచ్చింది."

"అయితే ప్రశ్నలు చదువుకున్నావా? అని అడిగాడు శర్మ

ఉండవోయ్ అడ్డు రాబాకు అంటూ మళ్ళీ చెప్పేడు

ప్రశ్నల పేపర్లు ఒక చీలసీలుచేసి ఉన్నయ్ ఎత ఉ దీచినా చి ఊడిరావటం లే అందుకని అక్కడ బల్లమీద కత్తెర ఉంటే దాన్ని తీసుకొని కత్తిరిద్దామని ఇంతలోనే మెలుకువ వచ్చింది



"ఆ కలలో నేను హెడ్‌మాష్టారింటికి పోయినట్లు, ఆయన తలక్రింద ఉన్న తాళము చెవులు తీసినట్లు..."

అంటే ప్రశ్నలు నీదాక రాకముందే మెలుకువ వచ్చిందన్నమాట" అని అడిగాడు శర్మ.

అంతటితో 'పోతే బాగానే ఉండేది. సాబాటని వేలుపెట్టి కొరుక్కుంటున్నాను" అని చెప్పినవ్వాడు.

తిక్క కుదిరింది ఇంక ఎప్పుడూ వెధవపనులకు పోకు అంటూ వాళ్ల అమ్మ సూరిని ఇంటికి లాక్కుపోయింది. ★

# బడిగంటలు

శ్రీ పైడిమర్రి
వేంకటసుబ్బారావు

'టంగ్, టంగ్, టంగ్'

'ఇది లెక్కల గంట రఘూ!'

'పాడుగంట, పోనిద్దూ! డ్రామా పార్టీవాళ్లు సామాను లారీలతో వెళ్లిపోతున్నారు. నేను, నువ్వూ యిద్దరం వస్తామని చెప్పాను. లే, పోదాం...ఎవరితోనైనా ఈసంగతి అన్నావా?'

'అన్నా, నేనెందు కంటా.'

బడి ప్రహారీగోడ వెలుపల చెట్ల కింద మాట్లాడుతూ ఉన్న బాలాయి రఘు ఇద్దరూ లేచారు.

'టంగ్, టంగ్, టంగ్, బళ్లో మ్రోగిన గంటలశబ్దం బడి గర్భంలో నుంచి బయలుదేరి దిక్కుల చెరగులకు ప్రాకుతూ బడికి దూరమై పోతూ ఉన్నట్లు బాలాయి, రఘూ బడికి దూరంగా, అడ్డదారిలో ఎవరూ తమ పనిని పసిపట్టకుండా ఉండేట్టు నడిచిపోయారు. అప్పుడే బయలుదేరబోతూ ఉన్న ఒక లారీని కలుసుకొని ఇద్దరూ ఎక్కారు. లారీ సాగింది. దూరంగా కనబడుతూన్న బాలాయి బడి, ఆఊరు క్రమంగా దూరమై పోతున్నాయి. పచ్చగా పంట కెదిగిన చేల ప్రక్కనుంచీ పచ్చిక బీళ్ల కెడముగా నడుస్తున్నది లారీ. ఎండ తీవ్రత ఏమీలేదు. చల్లగా గాలి వీస్తూ ఉంది.

'బాలాయ్! చూడూ! ఎంత హాయిగా ఉందో! మనకు పాఠాలు, బడి పేచీయేమీలేదు. పాటలు, ఆటలు, నాటకాలే మన జీవితం.

'నిజం - రఘూ! ఛ లేనోయ్! పాడుబడి. గణగణ గంట కొట్టే సరికి పరుగెత్తుకు పోవాలి. నిముషం తీరుబడి లేకుండా కొంపలో హోంవర్కు రాయాలి. అర్థంకాని ఇంగ్లీషూ లెక్కలకోసం మా అన్నయ్య తోమితోమి చంపే స్తూంటాడు.

'అందుకనే గా! ఈ ఎత్తు వేసింది. అందరూ ఎంతో స్వతంత్రంగా ఉంటారు. కాని మనం ఖైదీల మాదిరిగా ఉంటాము. బడిని యమలోకమనీ, ఆబళ్ల పంతులు యమధర్మరాజనీ, ఆయన దగ్గర యమదండంలాంటి కోదండం, కాలపాశంలాటి తోడపాశం ఉంటాయనీ ఎవరో ఒకాయన చెప్పాడు. నిజంగా బడి చదువంటే యమ యాతన..."

'నాకు బడమంటే నే భయం, మాస్టారికి బెత్తం చేతిలో ఉన్నప్పుడు చూచానా, చెప్పేదేంలేదు. ఇంట్లో కూడా యింతే. మా అన్నయ్య అసాధ్యుడు - చద్మాలు వలుస్తుంటాడు. మా నాన్న మాత్రం ఏమనడుకాని..."

'ఔనురా! పెద్దవాళ్లంతా ఇంతే'

'బాలశిక్ష చదువుతున్నప్పటి నుంచే నాకీ భావాలన్నీ కలిగాయి. ఎప్పుడు బయటపడి స్వతంత్రంగా ఉంటానా అనీ...అసలు స్వతంత్రంగా ఉండాలనే కోరిక మన పిల్లలకే లేనట్లుంది. అంతా చచ్చు దద్దమ్మలు లాగా ఆపాడు జెయిలు లాటి బళ్లోపడి మురుగుతున్నారు.

'మనం స్వతంత్రంగా ఉన్నామని ఎప్పుడనుకోవాలంటే మనం బళ్లోకిపోతున్నా, ఎక్కడికిపోయినా ఏం చేసినా, ఎవరూ ఏం, జోక్యం తీసుకోగూడదు - అప్పుడే. మనం హాయిగా ఉంటే వాళ్లకెందుకో ఏడుపు?'

'మూచి ఓర్వలేదు-పాడు ప్రపంచం బాలాయ్. పోనీలే'

లారీ పోయిపోయి ఒక పెద్ద మైదానంలో ఆగింది. ఇంతకు ముందుగానే వేరే లారీలల్లోవచ్చిన కొంతమంది డ్రామాపార్టీ వారు పెద్దడేరాలు వగైరా వేసి స్టేజి నిర్మించారు. మర్నాడు కృష్ణలీల నాటకం. ఊళ్లోఅంతా బాజాలతో పత్రికలు పంచారు. రఘు బాలాయి వినోదవేషాలతో పాటు తిరిగారు.

రాత్రి తొమ్మిదిన్నరైంది. అందరూ వారి వారి వేషాలు వేసుకుంటున్నారు. రఘు 'బాలాయికి' మరికొందరు పిల్లలకు గోపాల బాలుర వేషాలు వేశారు. కృష్ణ వేషంతో పాటు కిరీటం

మాత్రమే అని మేనేజరు, రఘుకి, బాలాయికి ఆదేశించాడు.

నాటకం మొదలయ్యేసరికి రాత్రి పదిన్నరయింది. శ్రీకృష్ణ జననం వగైరా కథాభాగం జరిగే టప్పటికి పన్నెండు కావచ్చింది. ప్రయాణబడలిక బాగా తీరక, నిద్రకాచడం అలవాటులేని కారణంవల్ల బాలాయ్‌కి నిద్ర బాగా వచ్చింది. ఆవేశంతోనే నేపథ్యం (*Green room*) లోనే ఒరిగాడు. రఘు బాగా ధక్కాముక్కీలు తిన్నవాడు కాబట్టి వచ్చేనిద్రను ఆగబట్టుకొని కూర్చున్నాడు.

గోపాల బాలుర వేషాలు రావాలనేసరికి రఘూ కొందరు పిల్లల వేషాలవారూ అవులిస్తూ హాజరైనారు. బాలాయ్ లేవలేదు. లేపడానికి ఎంతో ప్రయత్నించారు. చివరకు మేనేజరు కూడా ప్రయత్నించి విసుగుపడ్డాడు. ఈ కుర్రాడితో నాటకం బాగా సాగేట్లే ఉందంటూ ముందు నాటకం నడిపాడు-బాలాయ్ లేకుండానే.

మరునాడు ఉదయం బాలాయ్‌ని బాగా మందలించాడు మేనేజర్ - బాలాయ్ ఆ గదమాయింపులు సహింపలేకపోయాడు. ఎక్కడలేని దుఃఖం వచ్చింది. వాళ్ల నాన్న అన్నయ్య జ్ఞాపకంవచ్చారు. తల్లి చిన్నప్పుడే చనిపోయింది. తండ్రి యెంతో ప్రేమగా చూచేవాడు. ఒక్కనాడైనా కండ్లా, నోటా బెదరించిన పాపాన పోలేదు. ఏ విషయంలోనూ పిల్లవాడికి లోపం జరుగకుండా చూచేవాడు. గారాబం చేసేవాడు. అవన్నీ



ఒడిని దూరంగా అడ్డదారిలో ఎవరూ తమని పసిపట్టకుండా నడిచిపోయారు.

తలచుకొని తలచుకొని వెక్కి వెక్కి యేడ్చాడు.

అలవాటు లేని నాటకజీవితములో కాలము గడపడం కష్టమైపోయింది. ఒకరాత్రి వదిలి యింకో రాత్రి నాటకంలో వేషంవేసి నిద్ర కాస్తూ నటించడం ఎంతో కష్టమనిపించింది. మొదట చూచినప్పుడు ఎంత వినోదముగా హాయిగొల్పేదిగా కనబడిందో, ఇప్పుడు క్రమేణా బాధ, అసహ్యం పుట్టిస్తూ వచ్చింది ఆనాటక జీవితం.

రఘూ! ఇంటికి వెళ్లిపోదాం. ఈ బాధ పడలేను' అన్నాడు చాలా రకలు బాలాయి రఘుతో.

'ఛీ! ఎంత పిరికి మాటలు మాట్లాడుతున్నావ్' బాలాయ్! నాకు ఎంతో హాయిగా ఉంది.

అన్నదమ్ములు యిద్దరూ బస్తీలో వుండి కాలేజీలో చదువు కొంటున్నారు. ఒక రోజున వాళ్ల నాన్నగారికి జబ్బుగా వున్నదని పల్లెటూరి నుంచి వుత్తరం వచ్చింది. ఇద్దరూ కాసేపు కంగారు పడ్డారు. అన్న ఎల్లాగో ధైర్యం తెచ్చుకొని, తమ్ముణ్ణి స్వగ్రామముపోయిరమ్మన్నాడు. అక్కడికెళ్లి నాన్నగారి పరిస్థితి ఎల్లావుందో టెలిగ్రాం యిమ్మని చెప్పుతూ, ప్రతి టెలిగ్రాంలోనూ 9 మాటలకి తక్కువ కాకుండా వ్రాయ వచ్చునని చెప్పి పంపించాడు.

తమ్ముడు వూరికి వెళ్ళిన మరునాడు అన్నకి ఒక టెలిగ్రాంవచ్చింది. అందులో యిల్లావుంది:

"క్షేమంగా వచ్చాను. నాన్నగారు పోయారు అమ్మ వుంది కొత్త సినిమా చూశావా"

# బడిగంటలు

నీవు నాలుగురోజులు అలవాటు పడితే నీకూ హాయిగానే ఉంటుంది. అయితే, ఇప్పుడు యింటికి ఎట్లా పోదామంటావ్? మా నాన్న, అన్నయ్య, మావాళ్లూ చూచారా చంపేస్తారు.

'ఔను రఘూ!...కాని మా నాన్న వాళ్లు ఈ మేనేజరంత కఠినంగానైతే ఉండరనుకుంటా. పోవడానికి నాకు ధైర్యంలేదు. నువ్వు ధైర్యమిస్తేగాని పోలేను... ఈ ఘోరంలో ఉండలేను.' బాలాయ్ కళ్లలో నీళ్లు తిరిగాయి.

'బాలాయ్! నాతమ్ముడూ! ఏడవకు-నేను ఉన్నానుగా! కొన్నాళ్లు నాటకంలో పనిచేస్తూ, బాగా నటించడం నేర్చుకుంటే అన్నం పెట్టడమే కాకుండా డబ్బుకూడా యిస్తారు. రంగనాథంగారు చూచావా మనలాగానే మొదట వచ్చాడట - మేనేజరు మేనకోడలు లక్ష్మి చెప్పింది-ఆయన కెంతో జీతం తెలుసా? అన్నం పెట్టి నూరు రూపాయలు. మనకు అంతడబ్బు దొరికితే మనం హాయిగా ఖర్చు పెట్టుకోవచ్చు.

బాలాయ్‌కి డబ్బు యిస్తుంటే అభిరుచి కలిగి నాటకంలో తనతో పాటు ఉంటాడని రఘు మేనేజరును చూచి, 'ఏమన్నా నెలజీతం యిప్పించం.., బాలాయ్ తొందర పడుతున్నాడు' అన్నాడు.

మేనేజరు బాలాయ్ మీద మండిపడ్డాడు-'ఏమాత్రం రాత్రిళ్లు మేలుకోలేడు. ఏనాటకానికీ పనికిరాడు. అతనికి అన్నంపెట్టడమే దండుగ' అంటూ-

'బాలాయ్ చిన్నవాడు. తండ్రి వాళ్లకోసం బెంగపడ్డాడు. డబ్బు యిస్తే కొంచెం ప్రోత్సాహంగా ఉంటుంది. రఘు ప్రాధేయపడ్డాడు.

'అబ్బాయ్! నీకు కూడా యిష్టము ఉంటే ఉండు. లేకుంటే వెళ్లొచ్చు. అబ్బా, అమ్మా కోసం బెంగపడేవాళ్లు మాకక్కరలేదు. ఎవరన్నా ఆడపిల్లలయితే డ్యాన్సుకు ఉపయోగించేవారు ఇతనితో మాకేం ఉపయోగంలేదు అతనికిక్కడ స్థానంలేదు. ఈరోజే వెళ్లమను' మేనేజరు గిరుక్కున తిరిగి స్టేజీలోకి వెళ్ళి సగం పూర్తి చేసిన సీను ఒకటి రంగులు దిద్దుతూ కూర్చున్నాడు.

రఘు తన ఉపాయం తబ్బిబ్బైనందుకు విచారపడ్డాడు. బాలాయ్‌తో యీమాట ఏముఖం పెట్టుకొని చెబుతాడు? మర్నాడు మొండి పట్టుదలగల మేనేజరు బాలాయ్‌తోనే . వెళ్ళిపొమ్మని ఖండితంగా చెప్పాడు. బాలాయ్‌కి ఏం తోచలేదు. బిక్కమొగం వేసుకొని రఘుకోసం నలువైపులా చూచాడు. డ్రామాహాలు బయట లక్ష్మితో కబుర్లు చెప్పుకుంటూ ఉన్న రఘు కనిపించాడు.

'రఘూ! రఘూ! నన్ను మేనేజరు వెళ్లిపొమ్మన్నాడు రఘూ!'

'ఔను బాలాయ్. నిన్న నాతోనూ అన్నాడు... బాలాయ్ భుజంమీద చెయ్యివేసుకొని దూరంగా వెళ్లాడు మాట్లాడుతూ. రఘు, లక్ష్మికి యిప్పుడే వస్తానని చెప్పి, ఆవిడని డ్రామా హాలులోకి పంపించి,

బాలాయ్! నువ్వు ప్రస్తుతం యిక్కడినుండి వెళ్లు. మేనేజరుకు నచ్చచెప్పి నిన్ను పిల్చుకుంటా- కొద్దిరోజులు తాళు, యింతలో ఆయన కోపం తగ్గిపోతుంది.

అప్పుడు మన మాట వినక పోతాడా!'

'రఘూ! నేను పోవలిసిందేనా! నేనొక్కణ్ణే పోవాలా రఘూ!...' బాలాయ్ గొంతులోనుంచి మాట రాలేకపోతోంది. కళ్లల్లోంచి నీళ్లు బుగ్గలమీద దిగ జారాయి.

"మళ్లీ కలుసుకుందాము! తప్పక నిన్ను త్వరలోనే యిక్కడికి తీసుకొనేటట్టు ప్రయత్నిస్తా. అధైర్య పడకు...' బాలాయ్ గదవ పట్టుకొని కళ్లల్లోకి చూచాడు రఘు ఆకర్షమైన చూపులతో-

'రఘూ! రఘూ!' వెనకనుండి లక్ష్మి కేక వేసింది.

'వస్తున్నా' అంటూ రఘు బాలాయ్‌ని విడిచి వెళ్లాడు.

బాలాయ్‌కి జనసమ్మర్దమైన ప్రపంచమంతా శూన్యంగా కనిపించింది. నిరాశా నిస్పృహాలతో బరువైన పాదాలతో ముందుకు సాగాడు. ప్రొద్దున కాఫీ కూడా పుచ్చుకోలేదు. నీరసంగా ఉన్నాడు. అయినా అక్కడ ఉండటానికి మనసొప్పలేదు. ప్రక్కన సమీపంలో ఉన్న యింకో బస్తీకి బయలుదేరాడు. అతి కష్టంమీద ఆఊరు చేరుకున్నాడు, దారిలో వంతెనల మీద, రోడ్డు ప్రక్కన చెట్లనీడల్లో కూర్చుంటూ.

బస్తీలో యెక్కడా పండ్ల దుకాణాలు మిఠాయీల అంగళ్లు ఫలహార, భోజనహోటళ్లు కానవస్తున్నాయి. తినేవాళ్లు కమ్మగా తింటూ కిళ్ళీలు నములుతూ, సిగరెట్లు పీలుస్తూ దారినపోతున్నారు. ఈ ప్రపంచంలో తాను తప్పితే, తనలాగా, ఆకలితో, కష్టాలతో బాధపడేవాళ్లెవరూ లేరని బాలాయి దుఃఖపడ్డాడు. జేబులో ఒక కానీ కూడా, యేమైనా కొనుక్కొని తినడానికి లేదని విచారపడ్డాడు. తన జీవితమును అసహ్యించుకొన్నాడు. ఆకలి బాధనుండి తప్పుకునే మార్గాంతరం లేదు. బిచ్చమెత్తుకోనైనా, నాలుగు డబ్బులు సంపాదించి కడుపులో తిండి పడెయ్యంది తప్పదని నిశ్చయించుకున్నాడు. బస్సుస్టాండు, రైల్వే స్టేషన్ వంకకు వెళ్లాడు. అక్కడ కనబడ్డ కొంతమంది ప్రయాణీకుల యెదుట చేయిజాచి నిల్చున్నాడు. ఒక కానైనా వేసే ధర్మాత్ములు లేకపోయారు. తనతో పాటుగా భిక్షావృత్తియే జీవనోపాధిగాగల వ్యక్తులు, కనబడ్డ మనిషినల్లా వేధిస్తూ డబ్బులు వసూలు చేస్తున్నారు. ఆపనికి సరిపోయిన తెలివి, మాటలు, ఓర్పు, బాలాయికి లేవు. గారాబంగా పెరిగినవాడాయె. చెయ్యిజాచి రెండు పర్యాయాలు బిచ్చం వెయ్యమని అడుగబోయాడు. కాని నోరాడలేదు. రెండో ప్రక్కన తనయీడు కుర్రవాళ్లు మూటలెత్తుకొని వెళ్లుతున్నారు. బేడ, పావలా, కూలీ మాట్లాడుకుంటున్నారు. ఇది మంచిదనిపించింది, చేయిజాచి బిచ్చమెత్తుకోవడంకంటె. ఆకలిదప్పులు విచారించే తల్లి దండ్రులు బయట యెవరుంటారు?-ఎవడికి వాడే-

బాలాయి ఒక ప్రయాణీకుని సంచి కూలీ మాట్లాడుకోకుండానే ఎత్తుకు వెళ్లాడు. ఆసంచి యజమాని చేతిలో పెట్టిన నాలుగణాలు డబ్బులతో తృప్తిపడ్డాడు బాలాయి. ఆడబ్బులు పెట్టి కాఫీహోటలులో కాఫీఫలహారం పుచ్చుకున్నాడు. కొంచెం బలం వచ్చింది. ఆరోజు అర్ధరూపాయి కూలీ డబ్బులు మళ్ళీ సంపాయించాడు. అవి దగ్గర పెట్టుకొని సత్రంలో పోయి ముడుక్కున్నాడు. పైన కప్పుకునేందుకు గుడ్డ లేదు. క్రిందపరచుకునేందుకు చాపా లేదు. నాపబండలనేల చల్లగా చలి. నిద్రపట్టలేదు. తెల్లవార్లు అట్లాగే గోడకు ఒరిగి కళ్లు మూసుకుని గడిపాడు. మర్నాడు అదే కార్యక్రమం. ఇట్లా గడుస్తున్నాయి బాలాయి జీవితాధ్యాయంలో కొన్ని ఘట్టాలు. రఘు రేపు వస్తాడో, మాపు వస్తాడో అన్న ఆశతో-కాలవ్యవధి యెక్కువైన కొలది ఆశ క్రమేణ అంతరించ సాగింది.

## 2

అక్కడ మిలిటరీ రిక్రూటింగు ఆఫీసరు వృధాగా తిరిగేయువకులను పట్టుకొని సైన్యములో చేర్చుకొని పోతూ ఉన్నాడు. బాలాయి కొంచెం బొద్దుశరీరం వాడు; సెకండు ఫారందాకా చదివాడు. నిలువ నీడ లేకుండా తిరుగుతున్నాడాయె సైన్యంలో చేర్చుకొని బొంబాయికి రవాణా చేశాడు.

సైనికోద్యోగం తట్టుకోవడం అశక్యమైపోయింది. కఠినమైన ఉద్యోగ ధర్మం. ఎప్పుడు విరామం లేకుండా అధికారుల చెప్పు చేతల్లో మెలగాలి. వేళప్రకారం తనపనులు నిర్వర్తిస్తూ ఉండాలి. ఉదయం తెల్లవారుజామున నాలుగు గంటలకే లేచి ముఖం కడుక్కొని సైనిక లాంఛనం బిళ్లలు మెరుగు పెట్టు

#  బడిగంటలు 

కాని శుభ్రంగా దుస్తులు ధరించి డ్రిల్లుచేయ పోవాలి. మధ్యాహ్న సాయంత్రాలు అల్లాగే డ్రిల్లు. తినే తిండి అంతా ఆడ్రిల్లుక్రిందే హుతమై పోయేది. కొండలు, నదులు అనకుండా ఏస్థితిలో ఉన్నా నరే, నడువమంటే నడువాలి. పరుగెత్త మంటే పరుగెత్తాలి. ఏమాత్రం తప్పినా చంపేస్తారు. దినగండం-నూరేండ్లాయుస్సు. తప్పించుకు పోకుంటే గడిచేట్టు కనబడలేదు. ఒకటి రెండుసార్లు ప్రయత్నించాడు అందుకు. కాని అప్పుడే అధికారులు ఎదురుపడడం, తలవంచుకొని తాను డ్యూటీలో ఉన్నట్లు నటించడం జరిగింది. రోజూ బెంగపడి పోతూ ఉన్నాడు.

బాలాయిమీద ప్రేమగల కొందరు సహోద్యోగులు అతన్ని సానుభూతితో చూచేవారు. ఒక మోతాదు సారాయి పడితే ఆ దిగులు పోతుందని, సర్దాగా మాట్లాడుకుంటున్న సమయంలో గ్లాసులోపోసి బాలాయి చేతి కందించారు. అలవాటు లేకపోవడం వల్ల ఆ ఘాటు వాసనచూచి ముఖము విరుచుకొని ప్రక్కకు తీసి పెట్టాడు.

'ఇది పుచ్చుకో. చాలా కులాసాగా ఉంటుంది. మేము త్రాగుతున్నాముగా. ఊఁ, నువ్వూ కానీయ్!' అన్నారు ఒక్కగొంతుతో, తాముకూడా ప్రక్కన త్రాగుతూ. బలవంత పెట్టారు. బాలాయికికూ మోజుపుట్టింది. పుచ్చుకొన్నాడు. ఎల్లాగో అల్లాగు, శరీరంలోకి ఏదో విద్యుచ్ఛక్తి ప్రాకి నట్లయింది. ఎంతో హాయిఅని పించింది. 'ఏమిటిది' అడిగాడు బాలాయి. వారు 'సీసా' చూపారు.

ప్రతిరోజూ బాలాయి దానిని ఆరాధించడం మొదలుపెట్టాడు. జీతంలో వచ్చిన డబ్బంతా నిత్యం త్రాగేసారాయికి ఖర్చుపెట్టసాగాడు. తనతోపాటు తనమిత్రులతో కలిసి, వీలుకొలది కులాసాగా త్రాగుతూ ఉండేవారు. మొదటి నిస్పృహా, ఆబెంగ యిప్పుడులేదు. క్రమేణా ఆ వాతావరణములో కలిసి పోయాడు.

త్రాగుడూ అందుకు తోడుగా రాత్రీపగలు అనకుండా పీల్చే సిగరెట్లు మితము తప్పిన జీవితవిధానం వల్ల బాలాయికి జ్వరం తగులుకున్నది. దాన్ని యేమాత్రం లెక్క చేయలేదు. చికిత్స విషయం శ్రద్ధ తీసుకోవడం అటుంచి తన అభ్యాసాలను, మార్చుకోలేదు. పూర్తిగా నీరసించి తనశక్తికి మించి లేవలేని పరిస్థితి వచ్చేదాక యే డాక్టరుకు చూపించలేదు. చివరకు ఒకనాడు మిలిటరీ డాక్టరుతో పరీక్ష చేయించుకొమ్మని స్నేహితులు బలవంత పెట్టారు-కొన్నాళ్లు దాకా అక్కడే వైద్యం చేశారు. ఏమీ ఉపయోగం కనబడలేదు. కట్ట కడపట అతనికి సైనికోద్యోగం చేయడానికి అర్హతలేదని వైద్యపరీక్షలో తెలిపారు. బాలాయికి యివ్వతేలిన జీతంబాబతు డబ్బిచ్చి వెళ్లిపొమ్మని ఆర్డరిచ్చేశారు సైనికాధికారులు.

బాలాయి ఎటూ కానివాడై ఉండిపోయాడు. తానెక్కడికి పోవాలి? ఈ జబ్బుపరిస్థితిలో బాలాయి కళ్లు తెరచాడు. తన యిల్లు గుర్తుకువచ్చింది. తనతండ్రి, తనఅన్న, తనమీద ఎంత ప్రేమతో ఉండేవారు - సరిగా చదువుకున్నా చదవకున్నా, బడికి పోయినా, పోకున్నా, పరీక్షలో గెలిచినా, తప్పినా ఒకదెబ్బ కొట్టకుండా గారాబంగా పెంచారు. చిన్న తనంలో తల్లి మరణించిందని బళ్లో పంతుళ్లకు కూడా కొట్టవద్దని' కళ్లా నోటా బెదరించమని చెప్పాడు తండ్రి. ఒకపూట ఆలస్యంగా యింటికి పోతే వేయికళ్లతో ఎదురు చూస్తుంటాడు తండ్రి. తనకోసం ఊరంతా వెతుకుతాడు అన్నయ్య గోపాలుడు. కోరిన వస్తువల్లా యిస్తూ, చేసినట్లల్లా ఓర్పుతో చూచే తండ్రి, ఎప్పుడు చదువుకొమ్మని తన మేలుకోసం బాధ పడుతున్న అన్నయ్య అన్ని సౌకర్యాలతో ఉన్నయిల్లు తన కళ్లకు గోచరించాయి. తాను తన కుటుంబమువారిపట్ల, చివరకు సంఘముపట్లకూడా గొప్ప అపచారము చేసినట్లున్నూ, ఆపాప ఫలితం యిల్లాగ అనుభవిస్తున్నట్లున్నూ గ్రహించాడు. కాని ఇందుకు కారణం రఘు. వాడు బళ్లో చదువనీయకుండా ఆటల్లోకి యీడ్చి, సినీమాలు చూపించి, పేకముక్క లాడించి, నాటకంలో ప్రవేశింపజేసి అక్కడినుంచీ ఎందుకు కాకుండా అంతరిక్షంలో విడిచిపెట్టాడు. అతని ఆకర్షకంగా ఉన్నమాటలు చూచి మోస పోయాను-ఇల్లువదలి ఎంతో కాల

మయింది. నేను కనబడక పోయే సరికి ఇంటిదగ్గర ఎంత బాధపడుతున్నారో!... ఈస్థితిలో నన్ను చూస్తే ఎంతైనా ఆప్యాయంగా ఆహ్వానిస్తారు. ఇప్పుడు వేరే కరణ్యంకూడా లేదు - నాటకం మేనేజరు వెళ్లగొట్టి నంతటితో నేరుగా యింటికి చేరుకుంటే యింతస్థితిలోకి వచ్చేదికాదు. ఇప్పుడైనా యింటికి వెళ్లడం మంచిది. మానాన్న, మా అన్నయ్య నన్ను చూచిందే ఘనంగా భావిస్తారు. తప్పక భావిస్తారు—నాకూ సగం వ్యాధి వాళ్లను చూస్తేనే కుదురుతుంది".. జ్వరంతో మూల్గుతూ తనయింటి కలలు కంటూ తనడేరాలో పడుకున్నాడు. అప్పుడే సైనికాధికారి నుండి, ఉత్తరువు వచ్చింది, సైనికుల క్యాంపు ఖాళీచేసి, బాలాయిని వెళ్లమని. కాపలా సిపాయీ త్వరగా వెళ్లిపొమ్మని బాలాయిని తొందరించాడు. అట్లాగే మూల్గుతూ ఎవరికీ చెప్పకుండా రైలుస్టేషన్ దారి పట్టాడు; ఇంటికి వెళ్లడానికి.

## 3

బాలాయి వరుసగా నాలుగు రోజులు ప్రయాణం చేయడంవల్లను, వర్షఋతువు వగుటవల్లను మధ్య మధ్య వానలో తడవడం, ఈకునవల్లను, మరింత జ్వరం ఎక్కువయింది. అప్పుడప్పుడు వస్తున్న పొడిదగ్గు కళ్లెదగ్గుగా తీవ్రరూపంలో ప్రత్యక్షమయింది. ఆగకుండా వచ్చేదగ్గు, జ్వరం, నీరసంతో అతి కష్టంమీద, యిల్లు చేరుకున్నాడు.

పదుగురుజనంతో కళకళలాడుతూ ఉన్న ఆ యింట్లోకి ఈహైన్యస్థితిలో ప్రవేశించాలంటే బాలాయికి కాళ్లాడలేదు. శరీరం వణకిపోయింది. చిఱు చెమటలు పట్టాయి. ఇంటి సమీపంలోకివచ్చి వెనక్కుపోవడం మంచిది కాదంటూ ధైర్యం తెచ్చుకొని లోపల ప్రవేశించాడు. పెట్టె, పరుపుచుట్ట, మోసుకవచ్చిన కూలీతో మెల్లగా అడుగులు పెడుతూ.

ఆఫీసు కాగితాలు చూస్తున్న గోపాలశర్మ సైనికవేషంలోఉన్న తమ్ముణ్ణిచూచి మొదట పోల్చుకోలేకపోయాడు. గడ్డం మీసం రాని స్థితిలో యిల్లువదలి, పెద్దవాడై, ఎన్నో మార్పులతో వచ్చాడు—గోపాలశర్మ "ఎవరు?" అని అడుగలేక పోతున్నాడు. బాలాయి తానెవరో చెప్పుకోలేక పోతున్నాడు. కొంతసేపటి దాక దూరంగా ఉండే ఇద్దరూ ఒకర్నొకరు చూస్తూ పోల్చుకొంటూ ఉండిపోయారు- ప్రయత్నంగా గోపాలశర్మ 'బాలాయివికదూ!' అన్నాడు.

గుటకలు మ్రింగుతూ- 'అ... అ...అవు...ను...' అని తత్తరపోయాడు. బాలాయి, కళ్లనిండా నీళ్లు క్రమ్మాయి-పెదవులు కంపించాయి. గోపాలశర్మ ఒక్కదూకులో తమ్ముణ్ణిచేరి కవుగలించుకున్నాడు. దేహం కాలిపోతూ ఉన్నది-జ్వరమని తెలుసుకున్నాడు. మాట్లాడలేని స్థితిలో ఉన్న బాలాయికి పరుపువేసి పడుకోబెట్టాడు. బాలాయికి పడుకున్నాక మెదడు పనిచేయడం మొదలు పెట్టింది.

'నాన్న ఎక్కడున్నాడని' అడిగాడు బాలాయి అన్నను. చనిపోయాడని చెప్పాడు శర్మ-

బావురుమన్నాడు తమ్ముడు— అన్నతమ్ముడి ప్రక్కనే ఆలోచనామగ్నుడై కూర్చుని వుండిపోయాడు. అప్పుడే బళ్లో మధ్యాహ్నం బడి విడిచేగంటలు మూడు నిమిషాలదాకా 'టంగ్...టంగ్...టంగ్... మని కొట్టారు. బడిదగ్గర యిల్లు—చెవుల్లోనే మ్రోగినట్లు వినిపించాయి. బాలాయి గుండెల్లో చేటలతో చెరిగినట్లనిపించింది. పూర్వపు స్మృతులెన్నో తలపులోకి వచ్చాయి. కన్నీళ్లు కాలువలుగా వాటంతటవే ప్రవహించాయి.

గోపాలశర్మ తమ్ముడి జ్వరం గురించి డాక్టరుకు చూపాడు. పరీక్షచేసి క్షయవ్యాధిఅనితేల్చారు. పరిశుభ్రమైన గాలికోసం బయట దూరంగా ఉన్న పాకలో పడక యేర్పాటుచేశారు. మందు ఆహారం వగైరా యివ్వడానికి తగిన యేర్పాట్లు చేశారు. అన్నయ్య వదిన తగు శ్రద్ధతో పరామర్శిస్తూ ఉంటారు. కాని యింకెవ్వరూ దగ్గరవచ్చి కూర్చుండేవారు లేరు. అందరికీ క్షయవ్యాధి అంటేనే భయం. ఈ దురవస్థ తెలుసుకొని బాధపడ్డాడు బాలాయి. పైగా ఒక్కసారిగా త్రాగుడు మానేశాడు, యింట్లో బాగుండదని. బాధలన్నీ తనలోనే సహిస్తున్నాడు. ప్రాణాలు ఉగ్గపట్టాడు. ఎప్పుడూ అతనికి చెప్పరాని విసుగు, బాధ.

మెదడు, నాడీ మండలము దెబ్బతిన్నాయని డాక్టర్లు చెప్పారు. 'టంగ్ టంగ్ టంగ్' బళ్లో గంటలు

#  బడిగంటలు 

వాటివాటి సమయాల్లో ఆగకుండా మ్రోగుతూనే ఉన్నాయి. బడికి సెలవులుకూడా లేవు ఆహారంలో. మ్రోగుతుంటే ఆగంటల చప్పుడుకు బాలాయి చెవులు భరించలేక పోతున్నాయి. మెదడు శరీరం అశక్తతరంగాల మీద దిరికింపిస్తున్నాయి - ఆగంటల్లో యిమిడిన పవిత్ర జీవిత చర్య చేయిజారి పోయిందనీ అతి గారాబంగా పెంచిన తండ్రిని చూడజాలకపోయి తినే అని బాధపడేవాడు. తాను చదువుతుండిన పుస్తకాలు వ్రాస్తుండిన కాపీలు, చదివించిన పంతుళ్లు బళ్లో మ్రోగిన ప్రతి గంట చప్పుడుతో ప్రత్యక్షమయ్యేవారు.

'అన్నయ్యా! ఈగంటల ధ్వని భరించలేను. దూరంగా ఎక్కడికైనా పంపించు. ఈచప్పుడు వినకుంటే హాయిగా ఉంటుంది.' బ్రతిమాలాడు అన్నయ్యను.

ఇది జబ్బులక్షణమే - అన్నారు డాక్టర్లు. బాలాయిమాట ఎవరూ వినిపించుకోలేదు. తమ్ముణ్ణి కాపాడమని డాక్టర్లను బ్రతిమాలాడు గోపాలశర్మ. చెప్పిన మందల్లా తెప్పించి యిప్పిస్తూనే ఉన్నాడు. సేవకావృత్తిలో నిద్రాహారములులేక సగమైపోయినాడు.

ఒకతల్లికడుపున పుట్టిన ఇద్దరు అన్నదమ్ములు బుద్ధి తెలిసినప్పటి నుండి కలిసియున్నట్లే లేదు. బాల్యములోనే కలిగింది ఇద్దరికి యెడబాటు. తమ్ముడు కనబడక పోయిన రోజు గోపాలశర్మ యెంతో వెదకినాడు. తండ్రి వెదకివేసారి 'బాలాయ్, బాలాయ్,' అని కలవరిస్తూ మరణించాడు. తమ్ముడు తిరిగి వచ్చేపక్షంలో ఏలాటి లోపం లేకుండా పోషించమని తండ్రి ఆదేశం-తమ్ముణ్ణి ఎట్లా కలిసికోగలనా అని అదే పట్టుదలతో ప్రయత్నించాడు. చిట్ట చివరకు ఏదో విధంగా కలుసికొన్నారు కాని గొప్ప ప్రమాదస్థితిలో. సర్వశక్తులు తమ్ముణ్ణి కాపాడుకోవాలని ఉపయోగిస్తున్నాడు.

బళ్లో ఉదయాది సాయంత్రం దాకా గంటలు మ్రోగుతూనే ఉన్నాయి. బాలాయి పశ్చాత్తాపాగ్నితో దహించుకుపోతూ, బుద్ధి ఎఱుగకుండా జీవితాన్ని చెడగొట్టుకున్నందుకు బుద్ధి తెలిసి అనుభవించవలసివచ్చింది అని బాధపడుతూనే ఉన్నాడు—

"అన్నయ్యా! నా జీవితం మిమ్ముల బాధించడంకోసమే ఉన్నట్లుంది" అన్నాడు బాలాయి. బత్తాయిపండు రసం గ్లాసులోపోసి యిస్తూన్న గోపాలశర్మతో.

'తమ్ముడూ! నీవు యేంకొరత పెట్టుకోవాన జరిగిందేమో' జరిగి పోయింది. దైవకృపవలన నీవు త్వరగా ఆరోగ్యం పొందితే చాలు...' అందుకున్నాడు శర్మ.

'నాజీవితం పాపమయం. జీవించాలనే కోరికలేదు-కాని నాన్నను నా అజ్ఞానంవల్ల ఎంతో బాధ పెట్టాను. ఒక్కసారి క్షమించమని నాన్నను వేడుకునే భాగ్యంలేక పోయింది, నాకోసం కృశించి మరణించాడు...నాజీవితగాథ యిట్లానే అజ్ఞాతంగా పోవడమే మేలు...'

గోపాల శర్మ హృదయం చల్ల చేసినట్లయింది - తమ్ముణ్ణి అట్లే చూస్తూ ఉండిపోయాడు. అప్పుడే సాయంత్రం బడి విడుపుగంట బాగా మ్రోగింది.

'అబ్బా! ఇది సాయంత్రంగంట. తెల్లవార్లూ హాయిగా పడుకోవచ్చు' అన్నాడు బాలాయి హీనస్వరంతో నిట్టూరుస్తూ—

బాలాయి పశ్చాత్తాపం, చరమస్థితి పొందింది. ఎన్ని గంటలు మ్రోగినా అతని చెవికి చేరరాని స్థానాన్ని చేరుకున్నాడు-

ఎంతశ్రమపడ్డా తమ్ముడు దక్కనందుకు గోపాల శర్మకు మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. సహజముగా కలిగిన సోదరప్రేమకు కరిగిన గుండెలో తమ్ముడి కళేబరాన్ని కన్నీళ్లతో కడిగాడు.

'తమ్ముడూ! నువ్వు మళ్ళీ కనబడకున్నా బాగుండేది గదా? ఎన్నడైనా కలుసుకుంటాననే ఆశతోనైనా ఉండేవాణ్ణి. ఇప్పుడు కలుసుకొని నాఆశను నిరాశామయం చేశావా!' అంటూ దుఃఖించాడు. చూచినవాళ్లందరూ కన్నీళ్లు పెట్టుకున్నారు.

బళ్లోగంటలు వాటివాటి సమయాల్లో మ్రోగుతూనే ఉన్నాయి. ఆగంటల మధ్యన యిట్లా ఎంతమంది అనురాగాలు జీవితాలు కాలగర్భంలో మరుగై పోతున్నాయో!



'స్థితి స్థాపకశక్తి అనగా నేమి' అని వుపాధ్యాయుని ప్రశ్న.

"వంచినసూ, లాగినసూ, మెలిత్రిప్పినసూ ఆకారము మారి పట్టువదలగనే యధాస్థితికివచ్చు దానిని స్థితిస్థాపక శక్తి అని అందురు" అని విద్యార్థి సమాధానం.

దానికి ఉదాహరణమేమి'? అని వుపాధ్యాయుని రెండో ప్రశ్న.

'ఉక్క తోక' విద్యార్థి సమాధానం.

—విజయ (తెనాలి)

# దత్తత

(13-వ పేజీ తరువాయి)

చూస్తాను" అంటూ పిష్టలు గురిచూపాడు.

శాంతమ్మ ఎప్పుడొచ్చిందో చూసిన రవికి ఆశ్చర్యం కలిగింది. రవి కడ్డుగా శాంతమ్మ నిలబడింది

బాధగా—కళ్ళు బిగబట్టి "తప్పుకో" అని గంగాధరం అరిచాడు.

అప్పటికే దాసదాసీజనం పైకి వచ్చారు. "ఢాం" అనే ధ్వనితో—శాంతమ్మగుండెల్లో పిష్టలుగుండు దూసుకుపోయింది పేల్చినవెంటనే జమిందారు సెలకొరిగాడు. శాంతమ్మ రవి ప్రక్కగా పడిపోయింది

రాము పార్వతమ్మ ఈ భీభత్సాన్ని చూశారు. పార్వతమ్మ భర్తకాళ్ళచెంత దుఃఖభారంతో వాలిపోయింది

రాము మానసికపరిస్థితి కల్లోలంగా ఉంది. తొందరగా వెళ్ళి తండ్రిచేతిలో పిష్టలు తీశాడు. రవికేసి చూపాడు

శాంతమ్మతో వచ్చిన లక్ష్మి అంతవరకూ తుదుగునే వుంది. ఇప్పుడు రాము ఎదుటగా వచ్చి నిలచింది రాము అప్రయత్నంగా పిష్టలు విడచి, "నాన్నా!" అంటూ తండ్రి రక్తమయ శరీరాన్ని ఆలింగనం చేసుకున్నాడు లక్ష్మి శాంతమ్మదగ్గరగా మౌనంగా కూచుని కళ్ళనీళ్లు కారుస్తోంది.

ఉభయుల ప్రాణాలు యింకా పోలేదని వారి తీవ్రతర బాధాపూరిత ఉఛ్వాసనిశ్వాసలే చెబుతున్నాయి.

శాంతమ్మ తలతిప్పి జమిందారుకేసి చూసింది. "చచ్చేముందయినా నిజము చెబితే మన ఆత్మలకు శాంతి కలుగుతుంది" అని హీనంగా అంది.

జమిందారు కళ్ళనీళ్లుకూడా అంతా యిప్పుడే చూశారు అంత బాధలో జమిందారు శాంతమ్మవైపు కష్టంగా తలతిప్పాడు. "ఒకనాడన్నా నామాట నువ్వు కాదనలేదు. ఇప్పుడు నీమాట కాదనను" అంటూ రాముకేసి చూసి "రామూ! నువ్వు నాకు దత్తుడవు నీ కన్న తల్లి శాంతమ్మ.. అబ్బా!" అంటూ బాధ సహించలేక కైజారు లాక్కొని కళ్లుమూశాడు.

రాము భయాశ్చర్యాలతో శాంతమ్మకేసి చూశాడు శాంతమ్మ ఆశగా చూస్తూ "బాబూ" అని ఆఖరిసారిగా చేతులు చాచింది.

"అమ్మా" అంటూ రాము శాంతమ్మ చేతుల్లో వాలిపోయాడు.

శాంతమ్మ అంత బాధలోనూ ఏదో అవ్యాజమైన ఆనందాన్ని అనుభవిస్తూ రాము తల నిమిరింది మెల్లగా రాము తలఎత్తి శాంతమ్మ కళ్ళల్లోకి చూశాడు శాంతమ్మ రాము చేతిని అందుకొని, లక్ష్మిచేతులో పెట్టి "శిక్ష! అనుభవిస్తానన్నావు కదూ? ఇదే శిక్ష" అంటూ ఆమె బాధాపూర్వకమైన చిరునవ్వులతోనే ప్రాణం విడచింది

అంత దుఃఖంలో మునిగిఉండగానే ఆశ్చర్యకరమైన మరో దృశ్యం అంతా చూశారు.

ఎదురుగా సర్కిల్ యిన్స్పెక్టరూ, పోలీసులూ వచ్చి నిలచారు.

రవి మెల్లగాలేచి సర్కిల్ దగ్గరగా వెళ్ళి 'హంతకుణ్ణి నేనే' అంటూ చేయి అందజేశాడు.

"రవీ-" అంటూ అప్పుడే గ్రహించిన అతిసన్నిహిత బాంధవ్య మమకారంతో రాము అరచాడు.

"అన్నయ్యా!" రవి గద్గదికంగా అన్నాడు. ఒక్కసారి తనివితీరా రాము రవిని ఆలింగనం చేసుకున్నాడు.

సర్కిల్ రవి చేతులకు సంకెళ్లువేశాడు. రవి లక్ష్మికేసి చూస్తూ "వొదినా! అన్నయ్యతో సుఖంగా జీవించు అన్నాడు. లక్ష్మి ఒక్కసారి ఉబికి వచ్చిన దుఃఖంతో శాంతమ్మ ప్రేతశరీరంలో తల దాచుకుంది. రవిని చూస్తూ ఆఖరున కళ్ళనీళ్ళతో రాము "ఒకే తల్లిబిడ్డలమన్న సంగతి ఇప్పుడే తెలిసింది పుట్టుకతోనే ఈ భాగ్యం నాకు వొక్కగా పుట్టిందనుకున్నాను కాని వచ్చింది. మనిద్దరం మనుషులమై మళ్ళీ బాల్యని జయించి తిరిగివస్తే నాతో సమానంగా నిన్నుకూడా గౌరవించుకుంటాను తమ్ముడూ!" అన్నాడు.

సమాప్తి



యునైటెడ్ ఆర్టిస్ట్సు శ్యామలా వారి "పల్లెపడుచు" లో రామశర్మ

# ఫిలిం క్లబ్బులు

శ్రీ జి. యస్. భూషణ్

సినిమాలు మనం చూస్తున్నాం. ఎక్కువగా సినిమా థియేటర్లలోనే చూస్తున్నాం. కొన్ని వందలమంది ఒకేసారి సినిమా చూసి ఆనందిస్తున్నాం. మనం చూసే సినిమాలన్నీ 35 మిల్లి మీటర్ల ఫిలిం మీద తీసినవే. ఇదికాక యింకా మూడు రకాల ఫిలిములమీద సినిమాలు తీస్తారు. అవి 16 మి. మీ, 9·5 మి. మీ, 8 మి.మీ. ఫిల్ములు. ఈ సైజు ఫిలిములను చూసేందుకు అనువుగా ఆయా సైజుల ప్రొజెక్టరులు ఉన్నాయి. ఇన్ని రకాల సైజులు ఎందుకు ఉండవలసివచ్చినది అనే ప్రశ్న వస్తుంది. ఒక్కొక్క సైజు ఫిలిముకు ఒక్కొక్క ప్రత్యేక ప్రయోజనం ఉంది.

కొన్ని వందలమందికి పైగా సినిమా చూడాలనుకుంటే 35 మి. మీ. ఫిలిం ప్రొజెక్టరును ఉపయోగించుకోవచ్చు. ముఖ్యంగా ఇండియాలో ఉండే చాలవరకు అన్ని థియేటర్లలోను 35 మి. మీ. ప్రొజెక్టర్లు ఉపయోగిస్తున్నారు. ఒక క్లాసు రూములోని విద్యార్థులు గాని, ఒక క్లబ్బులోని మెంబర్లు గాని, ఒక చిత్రం చూడాలనుకొంటే అంతా థియేటరుకే పోనక్కరలేకుండా విశాలమైన హాలులో ప్రదర్శించుకొనేందుకు, 35 మి. మీ. ప్రొజెక్టర్లకంటే చాల తక్కువ ఖరీదులో, సంస్థలు, స్కూళ్లు కొనుక్కోగలిగిన ధరలలో 16 మి. మీ, 9.5 మి. మీ. ప్రొజెక్టర్లు దొరుకుతాయి. వాటి సహాయంతో శబ్దంతో కూడిన చిత్రాలను చూడవచ్చు. 9·5 మి. మీ. కెమేరాలు ప్రొజెక్టర్లు అంతగా వాడుకలో లేవు.

ఒక కుటుంబములోని వ్యక్తులుమాత్రమే ఒక గదిలో ప్రదర్శించుకొనేందుకు అనువుగా 8 మి. మీ. ప్రొజెక్టరులు చాల తక్కువ ధరలో దొరుకుతాయి. సినిమా తీసుకొనేందుకు వీలుగా తక్కువ ధరలోనే కెమేరాలు కూడా దొరుకుతాయి. అయితే 8 మి. మీ. ఫిల్ముతో సైలెంటు చిత్రాలు మాత్రమే తీసేందుకు వీలుంటుంది. మిగిలిన మూడు రకాల సైజులలో (9·5, 16, 35 మి. మీటర్లలో) శబ్ద చిత్రాలు తీసేందుకు వీలుంటుంది.

మనకు చాలినన్ని థియేటర్లు లేవు. కొన్ని కొన్నిచోట్ల ఒక్కొక్క థియేటరుపై సుమారు 10, 12 గ్రామాలపైగా జనం ఆధారపడి ఉండడం సామాన్యంగా చూస్తుంటాం. పట్టణాలలో ఉండే థియేట



వీళ్లధరతం పట్టిస్తానని ఇంటి యజమాని వెళ్లి పోలీసును లాక్కొచ్చాడు.
"బూరెల మూకుడు" లో శ్యామల, లక్ష్మణ్, రామకృష్ణ.





16 మిల్లిమీటర్ల సౌండు ప్రొజెక్టరును ఈ రెండు పెట్టెలలో ఇమిడ్చి ఒకమనిషి మోసికొనివెళ్లవచ్చును.

← 16 మిల్లిమీటర్ల సైలెంట్ ప్రొజెక్టరు.

ర్లలో సైతం మనకు కావలసిన చిత్రాలు రాకపోవడమో, లేకపోతే ఒకే చిత్రం కొన్ని వారాలతరబడి ప్రదర్శింపబడడమో జరుగుతూంటుంది క్రొత్త చిత్రాలను చూడాలనుకొన్న జనం ఆ థియేటరులోకి వేరొక చిత్రం వచ్చేదాకా నిరీక్షించాలి తరువాతైనా మనకు కావలసిన చిత్రం రాక పోవచ్చు ఈవిధమైన అసంతృప్తిని నివారించేందుకు ఫిలింక్లబ్బులు ఎక్కువగా ఉపయోగపడతాయి థియేటర్లు లేని ప్రాంతాల్లోకూడా యీ క్లబ్బుల ద్వారా ఆ కొరత చాలవరకు నివారింపబడుతుంది

ఫిలిం క్లబ్బులు అనేమాట మనకు క్రొత్త గాని, విదేశాలలో యిటువంటి క్లబ్బులు, చాలా ఉన్నాయి వీటి మూలంగా ప్రత్యేకం వినోదానికి సంబంధించిన చిత్రాలే కాకుండా విజ్ఞానానికి అవసర మైన చిత్రాలు కూడా ప్రదర్శించుకో వచ్చు ఇందుకుగాను ఎక్కువగా 16 మి. మీ. సౌండ్ ప్రొజెక్టర్లనే ఉపయోగిస్తారు

విదేశాలలో థియేటర్లలో ప్రదర్శనకు 6 మి మీ ప్రొజెక్టర్లు వాడుకలో న్నాయి ఎక్కువమంది జనానికి చూపిం చేందుకు వీలుగా ఎక్కువ కాంతి నిచ్చే 16 మి మీ ఆర్కు లాంపు ప్రొజెక్టరులు వుపయోగిస్తారు మనం చూసే 35 మి మీ ప్రొజెక్టరులాగే చిన్నసైజులో 16 మి. మీ ఆర్కు లాంపు ప్రొజెక్టరులు ఉంటాయి 16 మి మీ పోర్టబుల్ ప్రొజె క్టర్లలో 750 - 1000 వాట్ల బల్బులు ఉప యోగిస్తారు

ఫిలింక్లబ్బులలో 300 మొదలు 800 జనం పైగా ఒకేసారి చిత్రాన్ని చూసేం దుకు వీలుంటుంది ఇందుకు ఏ విధమైన ప్రొజెక్టరును ఉపయోగించాలి అనే ప్రశ్న వచ్చినప్పుడు, తక్కువ ఖరీదులో క్వాలిటీ చెడకుండా ప్రదర్శనకు వీలుండి, ఎక్క డకు పడితే అక్కడకు సులువుగా తీసుకొని పోయేటందుకు అనువుగా ఉండే ప్రొజె క్టరుయొక్క అవసరం ఎంతైనా ఉంది



16 మిల్లీమీటర్ల సౌండ్ ఫిలిం ప్రొజెక్టరు.



మార్కెట్లో కలుసుకున్న గౌరి, ముత్తయ్య యిచ్చిన అణా తిరిగి యిచ్చివేస్తున్నది.
**ప్రసాద్ ఆర్ట్స్‌వారి "పెంపుడు కొడుకు"లో శ్రీరామమూర్తి సావిత్రి,**

అందుకుగాను 16 మి. మీ. పోర్టబుల్ సౌండ్ ప్రొజెక్టరును ఉపయోగించవచ్చు కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన విజువల్ ఎడ్యుకేషన్ స్కీము ద్వారా స్కూళ్ళలో ప్రదర్శించిన చిత్రాలన్నీ 16 మి మీ సౌండ్ ప్రొజెక్టర్ల ద్వారానే చూపించడం జరిగింది కొన్ని కొన్ని స్కూళ్ళలో 16 మి మీ. సైలెంటు ప్రొజెక్టర్లు ఉన్నాయి కొబట్టి వీటితో మనకు ఉన్న పరిచయం కొద్ది మాత్రమే.

ఫిలిం క్లబ్బులకు ప్రత్యేకించి 16 మి. మీ సౌండ్ ప్రొజెక్టర్లనే ఉపయోగించడంలో చాలా లాభాలున్నాయి ఈ సౌండ్ ప్రొజెక్టరు పరికరాలన్నీ కలిపి ఒక వ్యక్తి సులువుగా తీసుకొనిపోగలిగేందుకు వీలుగా రెండు పెట్టెలలో అమర్చబడి ఉంటాయి కొబట్టి ఎక్కడకు పడితే అక్కడకు తీసుకొనిపోయి ప్రదర్శించేందుకు సులువుగా ఉంటుంది. తక్కువ ఖరీదులో దొరుకుతాయి. 35 మి మీ ఫిలిం ప్రదర్శనపై గల కొన్ని నిర్బంధాలు దీనికి లేవు ప్రొజెక్టరును ఉపయోగించే విధానాన్ని ఒకసారి అర్థం చేసుకొంటే ఎవరైనాసరే ప్రొజెక్టరును ఉపయోగించవచ్చు మనకు మామూలుగా లభ్యమయే కరెంటుతో ప్రొజెక్టరును నడుపవచ్చు విద్యుచ్ఛక్తిలేని ప్రాంతాల్లో ఒక పోర్టబుల్ జెనరేటరుద్వారా ప్రొజెక్టరును పని చేయించవచ్చు.

ఈ సౌండ్ ప్రొజెక్టరులో ఉండే ఆంప్లిఫైయర్ (*amplifier*)తో మైక్, లౌడ్ స్పీకర్లను పని చేయించవచ్చు కొన్నికొన్ని ప్రొజెక్టర్లలో ప్రొజెక్టరునుండి ఆంప్లిఫైయరు వేరేగా వచ్చే ఏర్పాట్లు ఉన్నాయి సైలెంటు చిత్రాన్ని ప్రదర్శిస్తున్నప్పుడు మైక్ ద్వారా ప్రదర్శిస్తున్న చిత్రానికి సంబంధించిన విషయాలు మాట్లాడవచ్చు

ఈ ప్రొజెక్టర్లలోనే యిప్పుడు క్రొత్త ప్రొజెక్టర్లు వస్తున్నాయి ఆ ప్రొజెక్టర్లలో మాగ్నటిక్ రికార్డర్ కూడా అమర్చబడి ఉంటుంది దాని సహాయంతో ఏ సైలెంటు ఫిల్ముకైనా సరే శబ్దాన్ని సమకూర్చవచ్చు చిత్రం ప్రదర్శిస్తున్నప్పుడు చిత్రంలోని సన్నివేశాలకు అనుగుణంగా శబ్దాన్ని యిస్తే ఆ శబ్దాలనన్నిటిని *tape recorder* ద్వారా ఫిల్ముపై ఉండే *Magnetic ribbon* మీద రికార్డు చేస్తుంది. మళ్ళీ ఆ ఫిల్మును ఎన్నిసార్లు ప్రదర్శించినప్పటికీ ప్రతీసారి శబ్దాన్ని సమకూర్చ నక్కరలేకుండా ఆ మాగ్నటిక్ రికార్డరు ఫిలింమీద యింతకుపూర్వం రికార్డుచేసిన శబ్దాన్ని సమకూరుస్తూంటుంది దీనికి సంబంధించిన విషయాలు వేరొకసారి చర్చిద్దాం ఈ ప్రొజెక్టర్ల ఖరీదు మామూలు సౌండ్ ప్రొజెక్టర్ల ధరలలో దొరుకుతాయి ఈ ప్రొజెక్టర్లు మనకు అంతగా వాడుకలోకి యింకా రాలేదు

ఫిలిం క్లబ్బులకు ఉపయోగపడే ఫిల్ముల గురించి చూస్తే, చాలవరకు యింగ్లీషు, హిందీచిత్రాలు 16 మి మీ ఫిలిం సైజులో కొద్ది అద్దెకు లభ్యమవుతాయి 35 మి మీ ఫిలిం సైజులో సైతం సామాన్యంగా దొరకని కొన్ని విజ్ఞానవిషయిక చిత్రాలు 16 మి మీ ఫిలిం సైజులో విరివిగా దొరుకుతాయి ఫిలిం క్లబ్బుల అవసరాలనుబట్టి తెలుగు, అరవం కథాచిత్రాలుకూడా లభ్యమయే అవకాశముంది ఆర్. కె ఒరేడియో, వార్నర్ బ్రదర్స్, మెట్రో గోల్డ్విన్ మేయర్, రిపబ్లిక్, కొలంబియా కంపెనీల చిత్రాలు, వాల్ట్ డిస్నీ కార్టూన్ ఫిలిములు, ఒకటేమిటి, యించుమించు అన్ని యింగ్లీషు చిత్రాలు, ఆవారా, బర్సాత్, కాలీఘటా, అనార్కలీ, ఛోటీమా వగైరా చాలవరకు హిందీ చిత్రాలు 16 మి మీ ఫిలిం సైజులో అద్దెకు లభిస్తాయి ఇవికాక ఎడ్యుకేషనల్ ఫిలిమ్స్‌వారు తయారుచేసే అన్ని చిత్రాలు ఫిజిక్స్, జాగ్రఫీ, కెమిస్ట్రీ, సోషల్ స్టడీస్, యిండస్ట్రీస్, జంతుశాస్త్రం వగైరా అన్ని విద్యా విషయాలమీద చిత్రాలు లభిస్తాయి.

ఇకపోతే యీ చిత్రాలను ఒక నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఒక నిర్ణీత ప్రదేశంలో, అందరికి అందుబాటులో ఉండే ధరకు ప్రదర్శించడానికి ఒక ఆర్గనైజేషను అవసరం అవే ఫిలిం క్లబ్బులు ఒక క్లబు ద్వారానే యీ విషయాలు జరగవలసిన అవసరం ఉన్నది అంటున్నానంటే, దాని వల్ల కొన్ని ప్రత్యేక ప్రయోజనాలున్నాయి ఏ ఒక్క వ్యక్తి అయినా వ్యాపారదృష్టితో నడిపితే అది వ్యక్తి ప్రయోజనాలకి ఉపయోగపడుతుందే తప్ప సమష్టి ప్రయోజనాలకు ఉపయోగపడదు కొబట్టి, అందరికీ అందుబాటులో ప్రదర్శనలు జరుగకపోవచ్చు కొబట్టే సమష్టి ప్రయోజనాలకు ఉపయోగపడే ఫిలిం క్లబ్బుల అవసరం ఎంతైనా ఉంది వ్యాపార దృష్టితో నడపాలంటే వినోదపు పన్ను, లైసెన్సు, వగైరా ప్రభుత్వపు ఆంక్షలు, నిబంధనలు అడ్డు వస్తాయి

స్థానికంగా కొన్ని కొన్నిచోట్ల క్లబ్బులు ఉండనేఉంటాయి ఆ క్లబ్బులకు, ఫిలిం క్లబ్బును అనుబంధంగా నడిపిస్తే వీలుగా ఉంటుంది లేదా స్థానికంగా ఉండే ఒక వ్యక్తి యీ బాధ్యతను తీసుకొన్నా మంచిదే క్లబ్బు ద్వారా యివ్వబడే ప్రదర్శనలు ప్రయివేటు ప్రదర్శనల క్రిందకే వస్తాయి కొబట్టే ప్రభుత్వపు వినోదపు పన్ను బాధ ఉండదు. క్లబ్బును సొంతంగా నడపాలంటే క్లబ్బువల్ల కలిగే ప్రయోజనాలను విపులీకరించవలసిన అవసరం ఉంది తక్కువ ధరలో ఎక్కువ చిత్రాలు తాము కోరినవి చూడవచ్చు; క్లబ్బుద్వారా వచ్చే ఫలితాల ద్వారా ఉచిత ప్రదర్శ



నవయుగ వారి "జ్యోతి" లో శ్రీరామమూర్తి

లు, ఎక్కువ సౌకర్యాలు కలిగించుకోవచ్చు.

ఇక క్లబ్బు నిర్మాణ విషయాలకి పోతే సభ్యులను జేర్పించడం మొదటిది మన దేశంలో ఫిలిమ్ క్లబ్బులు కొత్త గనుక మొదట్లో నే అనుకొన్నంత ప్రోత్సాహం లభించకపోవచ్చు కాని, ఒకటి రెండు ప్రదర్శనల అనంతరం క్లబ్బు ప్రయోజనాలను వాస్తవంగా గుర్తించడంద్వారా ఎక్కువ ప్రోత్సాహం లభించే అవకాశం ఉంది సభ్యుల ప్రవేశరుసుం క్రింద 0-8-0 నుండి 1-0-0 వరకు పెట్టవచ్చు తరువాత మనిషికి నెలవారీ ఒకటి నుండి రెండు రూపాయల వరకు పెట్టవచ్చు. నెలకు కనీసం నాలుగు కథా చిత్రాలు చూపించాలి సభ్యుల సంఖ్యనుబట్టి, చందా డబ్బునిబట్టి ప్రదర్శనల సంఖ్య పెరగడం, ఒక్కొక్క ప్రదర్శనం చూసేందుకయ్యే ఖర్చుతగ్గడం మొదలైన సౌకర్యాలు ఉంటాయి క్లబ్బుయొక్క సభ్యత్వం ద్వారా నెలకు వచ్చే నికరాదాయాన్ని నిర్ణయించుకోవాలి

మొట్టమొదటిసారిగా ఆ క్లబ్బుకు ఒక సౌండ్ ప్రొజెక్టరు, క్లబ్బు వ్యవహారాలను చక్కబెట్టుకొనే ఒక వ్యక్తి అవసరం ఇతనికి సహాయకుడుగా, ముఖ్యంగా చందాలు వసూలుచేసేందుకు, కార్యక్రమాన్ని సభ్యులకు తెలిపేందుకు వేరొక వ్యక్తి అవసరమవుతాడు. వీరిద్దరిని నెలజీతాలమీద నియమించడం మంచిది అంటే యిద్దరు వ్యక్తుల కృషివల్ల క్లబ్ కార్యక్రమాలు నిర్విఘ్నంగా కొనసాగించవచ్చు చిత్రాలను, ప్రదర్శనాస్థలాలను నిర్ణయించేందుకు స్థానికంగా ఉంటే పలుకుబడిగల వ్యక్తులను కూడా క్లబ్బుకమిటీలో సభ్యులుగా చేర్చుకోవడం చాలా ఉపయోగిస్తుంది స్థానిక థియేటరు యజమానినికూడా క్లబ్బు కమిటీలో వేసుకోగలిగితే ఒక విధంగా సహాయపడేందుకు అవకాశముంటుంది

మొట్టమొదటిసారిగా క్లబ్బును ఎదుర్కొనేది 16 మి మీ. సౌండు ప్రొజెక్టరు సమస్య అంటే ప్రొజెక్టరు, యింకా తదితర పరికరాలు కొనేందుకు కావలసిన డబ్బు. పరికరాలతో సహా ప్రొజెక్టరు ఖరీదు సుమారు 4000 రూపాయలు ఉంటుంది. ఇదే పెద్ద సమస్యగా ఉంటుంది. ప్రొజెక్టర్లను అద్దెకుకూడా యిస్తారు కాని స్వంతంగా ప్రొజెక్టరు ఉంటేనే లాభం ఉంటుంది లేకపోతే ప్రొజెక్టరుయొక్క ప్రయోజనాలు పరిమితంగానే ఉంటాయి. ఒకేసారి అంత డబ్బు పెట్టుబడి పెట్టడం సాధ్యంకాని పక్షంలో వాయిదాల పద్ధతిమీద ప్రొజెక్టరును సంపాదించే ఏర్పాటైనా చేసుకోవచ్చు ఏది ఎల్లాగయినా క్లబ్బుకు స్వంత ప్రొజెక్టరు చాల అవసరం

సభ్యులు పట్టేందుకు వీలుగా టౌనహాలు గాని, విశాల ప్రదేశంగాని, అవసరమైతే ఆరుబయటగాని ప్రదర్శనలు జరుపుకోవచ్చు సభ్యులు చాలా ఎక్కువ అయినప్పుడు రెండుసార్లు ప్రదర్శనలిచ్చి సభ్యులందరికీ చిత్రాన్ని చూపించవచ్చు స్థానికంగా ఉంటే థియేటరు యజమాని ఫిలిం క్లబ్బుయందు కమిటీమెంబరుగా ఉండి శ్రద్ధ తీసుకొనే అవకాశముంటే థియేటరునే క్లబ్బుప్రదర్శనకు యిచ్చే ప్రయత్నం చేయవచ్చు. వారానికి ఒకటిగాని రెండుగాని ప్రదర్శన లిచ్చేటప్పుడు సర్వసాధారణంగా అందరికీ అందుబాటులో ఉం[illegible] విధంగా కని, ఆదివారాలలో ఉదయంపూట పెత్తే సినిమాహాలును, వాళ్ళ ప్రదర[illegible] ఆటంకం లేకుండా ఉపయోగిం[illegible] వచ్చును

ఆ విధమైన థియేటరుసదుపాయంలేని ప్రాంతాల్లో విశాలమైన ఏ హాలులోనైనా ప్రదర్శన యివ్వవచ్చు. ఎలక్ట్రిసిటిలేని ప్రాంతాల్లోకూడా ప్రొజెక్టరును పనిచేయించేందుకు ఒక పోర్టబుల్ జెనరేటరును ఉపయోగించవచ్చు.

క్లబ్బుకు ప్రతీనెలా అయే ఖర్చులు అంచనా వేసుకొంటే దానిప్రకారం సభ్యుల సంఖ్యనుబట్టి నెల చందా నిర్ణయించవచ్చు

చిత్రాల జాబితా తయారుచేయడం[illegible] వాటికి సంబంధించిన కంపెనీలతో ఉ[illegible] ప్రత్యుత్తరాలు జరపడం, చిత్రాల లిస్టు మెంబర్లకు అందజేయడం అవసరమైతే ప్రొజక్టరును నడపడం మొదలైనవాటికి ఆఫీసులో ఒక వ్యక్తి, అనునిత్యం సభ్యులను కలుసుకొంటూ సభ్యత్వరుసుం వసూళు చేసేందుకు తదితర కార్యక్రమాలకు ఒక

పుత్రవాడు, వీరిద్దరూ జీతంమీద పని చేయవలసి ఉంటుంది. ఆఫీసులో ఉండే వ్యక్తిగాని, లేకపోతే విషయపరిజ్ఞానం గల వేరొక వ్యక్తిగాని ప్రదర్శన సమయంలో ప్రొజెక్టరును ఆపరేట్ చేయవచ్చు. సాధ్యమైనంతవరకు ఒకే ఒక వ్యక్తి అన్ని సమయాల్లోనూ ఆపరేట్ చేయడం మంచిది. క్లబ్బు స్తోమతనుబట్టి పై యిద్దరివ్యక్తుల జీతాల నిర్ణయం జరగాలి. ప్రవేశరుసుంగా వసూలు చేసిన మొత్తం ఆఫీసు పరికరాలకు వినియోగించుకోవచ్చు.

కథా చిత్రాలకు యిక ప్రదర్శనకు అద్దె రు 50 నుండి 75 రూ వరకు ఉంటుంది. పంచరంగుల చిత్రాలయితే రు 80 నుండి రు 100 వరకు ఉంటుంది. హ్రస్వ చిత్రాలు (వాల్ట్ డిస్నీ కార్టూన్లు, విద్యా విషయిక చిత్రాలు వగైరా) అద్దె రు 2 8-0 నుండి రు 15 వరకు ఉంటుంది. ఈ అద్దె చార్జీలు క్లబ్బుల పరిచయాలనుబట్టి కొన్ని పరిస్థితులలో యింకా తక్కువకు వచ్చేం దుకు అవకాశముంది. క్లబ్బుకు కొంత రిజర్వుఫండు ఉంచడం చాల అవసరం. ప్రతినెల ప్రొజెక్టరు అరుగుదలక్రింద కొంత డబ్బు కేటాయించాలి. ఆ డబ్బుతో ప్రొజెక్టరు ధర కొద్ది నెలలలో రాబట్టుకొనే ప్రయత్నం చేయవచ్చు. ఎప్పుడైనా అవసరమయే ప్రొజెక్టరు మరమ్మతుఛార్జీలక్రింద ఆ డబ్బులో కొంతవినియోగించుకోవచ్చు.

ఈ క్రింది పట్టికను జాగ్రత్తగా పరిశీలిస్తే రాబడి ప్రకారం బడ్జెట్టును వేసుకొనేందుకు వీలుంటుంది. ఒక్కొక్క ప్రదర్శనకు ఫిలిం అద్దె సగటున రు 60

(ప్రక్క పేజీలో పట్టిక చూడండి)

ఈ పై పట్టికను పరిశీలిస్తే మనకు ఒక విషయం బోధపడుతుంది. ఎంతమంది ఎక్కువ సభ్యులుంటే అంతగా క్లబ్బుకు లాభం వస్తుంది. ఏ పరిస్థితులలోనైనా సరే ఒక్కొక్క ప్రదర్శనకు సభ్యునికి అయే ఖర్చు 8 అణాలకు మించకుండా ఉండేలాగున చూడడం మంచిది.

సభ్యుడుగాఉన్న వ్యక్తితో ఎవరైనా అతిథులుకూడా ప్రదర్శనకు వస్తే, మామూలుగా ఒక్కొక్క సభ్యునికి ప్రదర్శనకు అయే ఖర్చుపైన రెండణాలు అధికంగా వసూలు చేయవచ్చు. ఆరీత్యాకూడా క్లబ్బు ఆదాయం పెరిగే అవకాశముంది.

క్లబ్బుతరఫున జరిగే సమావేశాలకు ప్రొజెక్టరులోని మైక్‌ను ఉపయోగించవచ్చు. కొన్ని పరిమిత పరిస్థితులలో క్లబ్బుకు సంబంధించని యితర కార్యక్రమాలకు కూడ లౌడ్‌స్పీకర్లను సప్లైచేసి క్లబ్బుకు ఆదాయం చేకూర్చవచ్చు.

ఫిలిం క్లబ్బులోని సభ్యులు వాళ్ళ పరిస్థితులకు అనుకూలంగా కొన్ని నిబంధనలను ఏర్పరచుకొని పాటిస్తే, క్లబ్బు విజయవంతంగా నడుస్తుంది.

కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో సహకార సంఘాలకు ప్రభుత్వం కొంత ధనం అప్పుయివ్వడం జరుగుతూంటుంది. ఆ విధమైన సహకారం క్లబ్బుకుకూడా లభిస్తే ఎక్కువ



మచ్చిక పరచి నీలకంఠం మనసులో మాట గ్రహిస్తున్న కాంతం

నేషనల్ ఆర్ట్ వారి పిచ్చి పుల్లయ్య లో కృష్ణకుమారి, రమణారెడ్డి

క్రమ లేకుండానే ప్రొజెక్టరును సంపాదించవచ్చు.

ప్రభుత్వ విజువల్ ఎడ్యుకేషన్ స్కీములో పనిచేసిన కొన్ని సంస్థలవద్ద ప్రస్తుతం ఉండే ప్రొజెక్టర్లతో ఫిలిం క్లబ్బులను స్థాపిస్తే బాగుంటుంది. ఏలూరులో యీమధ్య ఫిలిం క్లబ్బు స్థాపించి ప్రదర్శనలిచ్చారన్న వార్త విన్నాం. అదేవిధంగా ప్రతిచోట ఫిలింక్లబ్బులు అభివృద్ధిలోకి రాగలవని ఆశిద్దాం. ★

సినిమాల్లో చేరాలని చాలా వుబలాట పడుతున్న ఒక పడుచుపిల్ల పదిమందినీ అడిగింది: సినిమాల్లో చేరాలంటే ఏది సులువైన మార్గమో చెప్పమని. ఆపది మందిలోకి ఒక గడుసువాడు "నీజుట్టు చాలా పొట్టిగావుంది. మంచి నవరం ఒకటి పెట్టుకొని వెళ్లావంటే చాలు,నీకు హీరోయిన్ ఛాన్స్ వచ్చేస్తుంద"ని చెప్పాడు,ఆ అమ్మాయి అల్లాగే చేసింది. కంపెనీ డైరెక్టరు యీ అమ్మాయిని అన్ని ప్రశ్నలూ వేసి, చివరికి ఆ నవరం బేరమాడి కొనుక్కొన్నాడు.

## ఒక నెలకు పట్టిక

| నెలకు యిచ్చే ప్రదర్శనల సంఖ్య | ఆఫీసు ఎస్టాబ్లిష్ మెంటు జీతాలు, స్టేషనరీ వగైరా | ప్రదర్శనకు అయే ఖర్చు (కరెంటు చార్జీలు బిల్లు వగైరా) | సభ్యుల సంఖ్య | నెల చందా | మొత్తం ఆదాయం సభ్యుల పరంగా. | నెలకు అయే మొత్తం ఖర్చు | ప్రొజెక్టరు అరుగుదల ఛార్జీలు | రిజర్వు |
|---|---|---|---|---|---|---|---|---|
| | రు | రు | | రు | రు | రు | రు | రు |
| 4 | 125 | 80 | 250 | 2-0-0 | 500 | 445 | 75 | Nil |
| 4 | 150 | 100 | 400 | 1-8-0 | 600 | 490 | 100 | 10 |
| 6 | 175 | 150 | 400 | 2-0-0 | 800 | 685 | 100 | 15 |
| 4 | 200 | 150 | 600 | 1-8-0 | 900 | 590 | 100 | 210 |



రత్నదీప్ పిక్చర్సువారి "నౌలఖా హార్" హిందీ చిత్రంలో అరవిందకుమార్, మీనాకుమారి.

యునైటెడ్ టెక్నీషియన్స్ ఎండ్ శ్యామలా వారి "పల్లెపడుచు" లో కృష్ణకుమారి, చలం, సి. ఎస్ ఆర్.

చిత్రసమీక్ష:

# ఆండ్రోక్లిస్ ఎండ్ ది లయన్

## (ANDROCLES AND THE LION)

క్రైస్తవమత ప్రచారం ఆరంభకాలపు రోమన్ల పుక్కిటికథ ఆధారంగా బెర్నార్డ్ షా రచించిన ఈ నాటికను గేబ్రియల్ పాస్కల్ చిత్రీకరించాడు. (ఇది జూన్ 26 వ తేదీనుంచి ఓడియన్ సినిమాలో ప్రదర్శించబడుతోంది) కథ చిరపరిచితమైనదే. క్రీస్తు మతం పుచ్చుకున్న వారిని రోమన్లు హింసించుతున్న రోజుల్లో, క్రీస్తుమతస్థులు భూతదయ, త్యాగశీలము, అహింసా తత్వాలవల్ల తమ ఔన్నత్యాన్ని ప్రదర్శించి ఎలా మత వ్యాప్తి చేయగలిగారో నిరూపించడానికి ఈ కథ ప్రచారం చెయ్యబడింది. ఆండ్రోక్లిస్ అనే క్రీస్తు మతస్థుడు అడవిలో ఒక సింహానికి పాదంలో ముల్లు తీసి బాధ నివారిస్తాడు. తరువాత రోమన్లు అతనిని పట్టుకుని దైవవశాత్తు అదే సింహానికి ఎరగా పంపినప్పుడు ఆ సింహం అతనిని గుర్తించి భక్షించక విడిచిపెట్టి మైత్రి చూపుతుంది. రోమన్ చక్రవర్తి, రోమ్ నగరవాసులు ఇదంతా క్రీస్తుమత ప్రభావమేనని భావించి క్రైస్తవులను హింసించడం మానివేస్తారు.

క్రీస్తుమత ప్రచారాన్నీ హింసా విధానాన్నీ కూడా అధిక్షేపిస్తూ బెర్నార్డ్ షా ఈ కథ నుపయోగించుకుని ఆండ్రోక్లిస్ ఎండ్ ది లయన్ నాటిక రచించాడు. హింస చూసి వినోదం పొందిన రోమన్లు అనాగరికులనీ, ప్రమాదం ఆసన్నమైనప్పుడు పోరాడి చనిపోవడంకంటె ఒక ఆదర్శం కోసం కోరి మృత్యువు నాహ్వానించడం ఘనమనీ భావించే క్రైస్తవుల నాగరికతలో రోమన్ల 'అనాగరికతలో కంటె మించిన సారం లేదని ఇందులో బెర్నార్డ్ షా సూచించాడు. ఒక చెంప కొడితే మరొక చెంప చూపాలని క్రీస్తు బోధించిన ఆదర్శాన్ని అక్షరాలా ఆచరించిన ఒక మహాబలిష్ఠుడు ఆ ఆదర్శాన్ని ఇతరులకు బోధించడంకోసం 'నీ చెంపకూడా నేను కొడతాను రెండో చెంప చూపడం నేర్చుకో' అని చెయ్యెత్తుతాడు. బుద్ధిబలం కలవారి వంచనలకు లొంగిన అనాగరికుల అమాయకత్వమూ ఆర్ద్ర స్వభావమూ కూడా ఇందులో చిత్రించబడినాయి.



# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ కె. మారుతీ రామిరెడ్డి—చీరాల.

ఇండియా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ పతంజలిశాస్త్రిగారు ఆంధ్రులని విన్నాను. ఎంతవరకు నిజం?

—పతంజలిశాస్త్రిగారు తమిళులు.

మ్యునిసిపల్, అసెంబ్లీ, పార్లమెంటు యెన్నికలలో, సినిమా తారలు పోటీ చేస్తే సునాయాసంగా గెలుస్తా రనుకుంటాను. మరి వారెవరూ అందుకు ప్రయత్నించినట్లు కనబడదేం?

—కంట్రాక్టులు తక్కువయ్యే రోజుల్లో ఎన్నికలు వస్తే పోటీచేస్తారేమో!

*　　*　　*

శ్రీమతి ఊం. వి. యస్. రత్నకుమారి—హైదరాబాద్.

తెలుగు చిత్రములలో సంపూర్ణ హాస్య చిత్ర మేది?

—గురాజా దొంగ, తెనాలిరామకృష్ణ, గుణ సుందరి కథ, తారుమారు, పెళ్లి చేసి చూడు.

*　　*　　*

శ్రీ మక్కువమల్లి సుబ్బారావు—నెల్లూరు.

ఝాంసీ-కి-రాణీ ఫొటోగ్రాఫర్ పేరేమిటి? వారు తీసిన ఇతర చిత్రా లేమిటి?

—జాన్ హాలర్. గాన్ విత్ ది విండ్ మొదలైన ప్రసిద్ధ చిత్రాలను తీశారు.

*　　*　　*

శ్రీ యస్. రామయ్య—రాజమండ్రి.

మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చినది గాబట్టి మన ప్రభుత్వం రామపాదసాగర ప్రాజక్టును నిర్మిస్తుందా? ఎప్పుడు?

—ఏ ప్రాజెక్టయినాసరే నిర్మించబోదని ప్రభుత్వం ఎప్పుడూ చెప్పదు. 'ఎప్పుడు' అని అడిగితేమాత్రం మనతరంలో కాదని మనం సమాధానం చెప్పుకోవలసివస్తుంది.

*　　*　　*

శ్రీ సి. హెచ్. శంకరశాస్త్రి—గుంటూరు.

ఆంధ్రులలో శృంగారరసమును పోషించగల నటీనటు లున్నారా?

—కొన్నికొన్ని శృంగారచేష్టలు ప్రదర్శించాలని యత్నించేవారే కాని శృంగార రసాన్ని పుష్టిగా పోషించగలవా రెవరూ తెలుగు సినిమా రంగంలో కనపడరు.

యన్. టి. రామారావూ, ఏ. నాగేశ్వరావులలో విద్యార్థిగా నటించగల నటుడెవరు?

—నటనకు మాట అటుంచి, ఏ పాత్ర యిచ్చినా విద్యార్థిగా నటిస్తారు యన్. టి. రామారావు.

*　　*　　*

శ్రీ డి. రెడ్డి—రేగుంటపాడు.

దేవుడు లేడని నా స్నేహితుడు వాదించుచున్నాడు. దేవుడు ఉన్నాడనే నిదర్శనాన్ని ఎలా చూపించాలి?

—దేవు డున్నాడా లేడా అని ఇంతవరకూ వాదించినవారే కాని నిదర్శనం చూపి నిర్ధారణ చేసినవారు లేరు.

*　　*　　*

శ్రీ డి. దయాకరరెడ్డి—కోవూరు.

ఆంధ్రరాష్ట్రం గొడవల్లో పడి, అల్లారుముద్దుగా పెరిగే మా అబ్బాయి తొడలో తుపాకిగుండు చొచ్చుకొనిపోయింది. ఎంత ప్రయత్నించినా వాడికి ఆ బాధ నివారణ కాలేదు. ఆంధ్రరాష్ట్రము వచ్చినాకైనా వాడు సుఖం అనుభవించగలడా?

—బాధా నివారణ వైద్యునిచేతిపని. సుఖం దుఃఖం వ్యక్తిగత నిర్ణయ సాధ్యమైనవి. వ్యక్తిగత సుఖదుఃఖాలకీ రాష్ట్రసిద్ధికీ సంబంధం లేదు. ఇంక ప్రజలమాటంటారా – దైవాధీనం.

*　　*　　*

శ్రీ వి. నరసింహారావు—ఆరోగ్యవరం.

హిందూదేశంలో మృదువుగా, వినసొంపుగా యుండే భాష ఏది? అందమైన లిపి ఏదో తెలవిస్తారా?

—ఎవరి భాష వారికి అందంగానూ, సొంపుగానే వుంటుంది. అయితే ఒక్కొక్క భాషకి ఒక్కొక్క రకమైన సౌరభం, శబ్దాలకు విన్యాసం, విశిష్టత ఉంటాయి. లిపి కూడా అంతే. తెలుగు, కన్నడం. గుజరాతీ భాషల లిపులు ఒయ్యారంగా ఉంటాయి. దేవనాగరి ఠీవిగా ఉంటుంది. ఉర్దూ చిత్రలేఖనాన్ని పోలివుంటుంది. బెంగాలీ లిపికి తెలుగువారి ఒయ్యారం, శిల్ప విశిష్టతా కూడా కనపడతాయి. తమిళం అచ్చుకూర్చినట్లు దూరంనించి చూస్తే ముచ్చటగా వుంటుంది. ఇలాగే అన్నీ.

*　　*　　*

శ్రీ ఆర్. గోపాల్—రేపల్లె.

చిత్రకారులు చిత్రములు చిత్రించుటలో రామ, కృష్ణ ఇత్యాది దేవతలకు జుట్టుమాత్ర ముండునట్లు చిత్రించెదరుగాని, గడ్డములు, మీసములు ఎందువలన చిత్రించరు?

—దేవతా విగ్రహములను ఏవిధంగా చిత్రించవలెనో, ఏవిధంగా చెక్కవలెనో ఆగమ శాస్త్రములలో చెప్పబడివుంది. దేవత్వమును స్ఫురింపజేయు నిమిత్తము ఆయా రూపములను ప్రత్యేక విశిష్ట లక్షణములతో చిత్రించడం అవసరం. మీసములు అనేవి, గడ్డములు అనేవి, రాజస తామస గుణములను స్ఫురింపజేయవచ్చు. అందువల్ల మీసములు గడ్డములు లేకుండా దేవత్వమును మూర్తీభవించేటట్లు చేయవలెనంటే ఆ చిన్న వ్యత్యాసం చాలా ముఖ్యమని కన్పిస్తోంది.

*　　*　　*

శ్రీమతి ఎస్. రాజేశ్వరీరాణి—కాళహస్తి.

చిన్నవాళ్లు తుమ్మితే చిరంజీవి అంటారు. పెద్దవాళ్లు తుమ్మితే వెధవా! ఛీ! అంటారు ఎందుచేత?

—తుమ్ములు విశేషంగా రావడం అనేది అనారోగ్య లక్షణం. ఆరోగ్యమునకు కొంత భంగం కలుగుచున్నదని సూచిస్తుంది. ఆ కారణంచేత, చిన్నపిల్లలు తుమ్మినయెడల ప్రక్కనున్న పెద్దవాళ్ళు ఆ చిన్నపిల్లలకు ఆరోగ్యం కలుగవలెనని ఆశీర్వదించాలి. వారు చిరకాలం జీవించవలెననీ ఆశీర్వదించాలి. "చిరంజీవి" అనాలి.

ఏపనియైనా ప్రారంభించేటప్పుడుగాని ప్రారంభించాలని మనస్సులో అనుకొన్నప్పుడుగాని, ప్రక్కనున్న వారికిగాని, మనకుగాని, ఆరోగ్యభంగం కలుగకూడదు. ఆరోగ్యభంగ సూచకమైన తుమ్ములువస్తే అది అపశకునం. అటువంటి విఘ్నసూచకమైన తుమ్మను తుమ్మినందుకే మనస్సులో విసుగుపుట్టి, చీకాకుచేత "ఛీ!" అంటారు. కాని, ఆవిధంగా అనడం మంచిదికాదు.

చిలకలు, పావురాలు, పిచికలు మొదలైన పక్షులు ఉండగా శ్రాద్ధంనాడు ప్రత్యేకించి పితృదేవతలు కాకి రూపంగానే ఎందుకు వస్తారు?

—భూతసంతృప్తిని మనము చేసినట్లయితే, ప్రేతాత్మలకు సంతృప్తి అయినట్లే. గుడిలోని దేవునకు గాని, రాములవారి పటమునకు విగ్రహమునకుగాని మనము నివేదన చేస్తే అందువల్ల భగవంతుణ్ని మనము

సంతృప్తి పరచవచ్చునని ఆ పని చేస్తున్నాము. భగవంతుడు అన్నింటిలోనూ ఉన్నాడు. కాని, ప్రతివస్తువుకూ మనము నివేదన చేయుటలేదు. అదిన్నీగాక, ప్రతి ప్రదేశంలోనూ సమృద్ధిగా "క్యావ్! క్యావ్!" అని పిలువగానే కాకులు వచ్చినట్లుగా యితర పక్షులు రావు. కాని, తత్వ పరిశీలన చేస్తే భూతసంతృప్తి నిమిత్తము పిండమును వేసేటప్పుడు భూచర, జలచర, ఖేచరములకు వేయవలసిన దన్నారు. నీటిలోని చేపలు వగైరాలుకూడా తినవచ్చునన్నారు మన పూర్వులు.

* * *

శ్రీ బండ లక్ష్మణరావు—సికింద్రాబాద్.

సిరి గలిగిన వారికి మురిపె మేది?

—సిరికి ఊపిరి ఆడకుండా మూట గట్టి పెట్టెలో పెట్టి, తాళంవేసి బంధించి ఆ తాళం చెవులను మొలలో కట్టుకొని తిరగడమే సిరి గలవారికి మురిపెం.

ప్రఖ్యాతి, గౌరవము, కావలెనంటే ప్రజలందరూ తన్ను గురించి ఘనంగా చెప్పుకోవాలి అంటే అందుకు సాధనమేమిటి?

—ఏ ప్రజలైతే మనలను గొప్పవానుగా చూడవలెనని కోరుతున్నామో, ఆ ప్రజలకంటే మనము గొప్పవాళ్ళం కావాలి. మనలోఉన్న గొప్పతనం మనం గ్రహించాలి. ఆత్మగౌరవంతో ఆత్మ స్వాతంత్ర్యంతో బ్రతకాలి. తన్నుతాను గౌరవించుకో గల్గినవానినే లోకం గౌరవిస్తుంది. వ్యక్తియైనా, జాతియైనా అంతే.

* * *

శ్రీ యం. సుబ్బారావు—పాలకొల్లు.

జంటగావున్న అరటిపళ్ళు తినకూడదంటారు. నిజమేనా? ఎందువల్ల?

—జంటగాఉన్న అరటిపండ్లు దంపతుల జంటవంటివని కొందరికి ఊహాకల్పితమైన భ్రమ ఉంది. అట్టి జంటను విభజించి భుజించడానికి వారి మనస్సు ఒప్పుకోదు. అది అజ్ఞానమైన సాధు హృదయ లక్షణం. అటువంటివితింటే, కవలపిల్లలు పుడతారనే భయంకూడా వాడుకలో వుంది.

* * *

శ్రీ ఐ. వీరేశ్వరరావు—తణుకు.

హిందూశాస్త్ర ప్రకారం వివాహ సమయంలో వధూవరులకు అరుంధతీ నక్షత్రమును చూపించుటకు కారణమేమి?

—వసిష్ఠులవారి భార్య అరుంధతి. ఈమె పతి భక్తిలో ప్రసిద్ధికెక్కిన స్త్రీ. ఆకాశంలో సప్త మహర్షులు అనే నక్షత్ర కూటంలో వసిష్ఠుని ప్రక్కనే అరుంధతీ నక్షత్రం ఎడబాయకుండా ఉంటుంది. క్రొత్తగా వివాహము చేసికొన్న నూతన దంపతులు అరుంధతీ నక్షత్రమును సందర్శించి అటువంటి ఆదర్శప్రాయ దాంపత్య ధర్మమును అనుసరించవలెనని పెద్దల అభిప్రాయం.

శ్రీ బి. సత్యనారాయణగారు—విజయనగరం.

దేవాలయంలో దైవ దర్శనమునకు వెళ్లే ముందు గణగణమని గంటవాయించి వెడతారెందుకూ?

—దేవాలయంలోనికి వెళ్లునప్పుడు స్వామిని భజనచేస్తూ వెళ్ళాలి. తాళాలు వాయించవచ్చు. స్వామికీ జయ్! అని జయ జయధ్వానములు చేయాలి. లేదా కనీసం జేగంట వాయించాలి. "భగవంతునకు జై!" అనడంలో అర్థం ఏమిటంటే, "భగవత్సంకల్పము జయప్రదంగా సాగవలెను" అనే టటువంటి మన కోరికను భక్తి ప్రపత్తులతో వెల్లడించటం. అందుకొరకే జేగంట వాయించడం.

ఈశ్వరుడు విగ్రహరూపములో ఏ కోవెలలలోను లేకపోవుటకు కారణం ఏమిటి?

—ఈశ్వరుని విగ్రహం నటరాజమూర్తి రూపంలో దక్షిణదేశంలో ఉంది. కాని నంది విగ్రహమే యీశ్వర చిహ్నం. నంది యొక్క మూపురమే లింగాకారము. పానవట్టముమీది లింగము అనేది మూపురం ప్రధానంగా కన్పిస్తూ పరున్న నందివిగ్రహ చిహ్నముని గ్రహించవలెను.

* * *

శ్రీమతి కె. పద్మావతమ్మ—బెంగుళూరు.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము లను నాల్గు వేదములను మనలనుండి పాశ్చాత్యు లపహరించుకొనిపోయినారని, అందులో అథర్వణ వేదమునందు యంత్రసంబంధమైన అన్ని రహస్యములూ లిఖింపబడియుంటం జేసి దాని మూలాధారంగా పాశ్చాత్యులు అనేక పరిశోధనలు చేయకలిగారని పెద్దలు అంటుంటారు. ఇది ఎంతవరకు నిజము? వేదములను రచించిన దెవరు? ప్రమాణము లున్నవా?

—వేదాలను సోమకాసురుడనేవాడు అపహరించాడనీ, విష్ణుమూర్తి మత్స్యావతారం ఎత్తి వాటిని వెనక్కి తీసుకొచ్చాడనీ పురాణాల్లో ఒక గాథ వుంది. అంతేగాని పాశ్చాత్యులు అపహరించిన మాట నిజం కాదు. మన వేదాలు మనదగ్గిరే వున్నాయి. వాటిలో ఆధునిక యంత్రాలకు సంబంధించిన టెక్నాలజీ ఏమీలేదు. పాశ్చాత్యులు స్వతంత్రంగా పరిశోధనలు చేసి ఆధునిక విజ్ఞానాన్ని నిర్మించారు. వేదాలు పూర్వఋషిప్రోక్తాలు.

* * *

శ్రీ నండూరు హనుమంతరావు—బందరు.

"త్రిపాది పక్షి" (బాగా తిరిగేవాణ్ణి) అంటారు. అంటే అర్థం ఏమిటి?

—నక్షత్రములలో కొన్నింటికి మూడేసి పాదములు ఉన్నాయి. అటువంటివి అమంగళకరములైనవి. వీధులవెంట పనిపాటులు లేకుండా తిరిగేవారు సోమరిపోతులు. అటువంటివాళ్ళు అమంగళ నక్షత్రములలాగున తిరుగుతూ ఉంటారు. ఆకాశంలో దిక్కులేని పక్షులవలె విచ్చలవిడిగా తిరిగేవారిని "పక్షి" అని దూషించడం గుంటూరు జిల్లాలో కొన్ని ప్రాంతములలో వాడుకగా ఉంది.

ఆలస్యం అమృతం విషం అన్నారు. తొందరపడి ఏపనీ చేయకూడదు అన్నారు. అవసరమైన పరిస్థితులలో ఈ రెండింటిలో దేన్ని అనుసరించాలి? ఇలా మన శాస్త్రాలలో చాలా సామెతలున్నాయి. కారణం?

—నిమ్మకాయ రసం పైత్యహరం గనుక, శరీరానికి మంచిది ఆరోగ్యకరం అని ఆరోగ్యశాస్త్రంలో ఉంది. నిమ్మకాయ రసం శైత్యంచేసి శిరోభారం జ్వరంకూడా కలుగజేస్తుంది గనుక అనారోగ్యకరం అని ఆరోగ్యశాస్త్రంలో ఉంది. ఈ రెండింటిలో దేనిని అనుసరించాలి? ఆయా సందర్భ పరిస్థితులనుబట్టి ఆయా వస్తువును ఉపయోగించడం మంచిది. ఆయా వస్తువును ఉపయోగించక వర్జించడంకూడా మంచిదే. శరీరానికి సంబంధించిన ఆహార ధర్మముల వంటివే, మనలోక వ్యవహార ధర్మసూత్రములు కూడా.

* * *

శ్రీ ఒంగారు ఆనందరావు—పాలకొల్లు.

ఈలోకంలో స్త్రీ అంటే అసహ్యించుకొనే మానవుడు ఉంటాడా! అలా ఉన్నట్లయితే అతడు ప్రతి స్త్రీని అసహ్యించుకుంటాడా?

—భర్తృహరి అనే పండితుడు సుభాషితం అనే గ్రంథంలో వైరాగ్య శతకం రచించి అందులో "కామినీ గర్హణము" అనే పద్ధతిలో స్త్రీని అసహ్యించుకుంటూ దూషిస్తూ పద్యాలు వ్రాశాడు. అతడు స్త్రీజాతినే దూషిస్తూ వ్రాశాడు. అటువంటి వాళ్లు ఉంటారని ఊహించి వ్రాశాడు. కాని, స్త్రీ అంటే అసహ్యించుకొనేవాడు సంసారం అంటే అసహ్యించుకొని, ప్రపంచం అంటే అసహ్యించుకొని, తన్నుతానే అసహ్యించుకొని, ఆత్మదూషణ, ఆత్మహత్య చేసికొనడం సంభవించవచ్చు. అటువంటి "బుద్ధిజాడ్య జనితోన్మాదుల్" లేరని చెప్పజాలము. ★



# ముచ్చటగా ముగ్గురు



(33-పేజీ తరువాయి)

యాల్యలనీ, అందరిచేతా తనే తెలివైనవాడననిపించుకోవాలని, యీమాదిరి తెలివితక్కువ యోచనలు ఎన్నో వాడి బుర్రనిండా వుండేవి. ఇంత దురాగతమైన ఆలోచనలు గలవాణ్ణి నేను ఎక్కడా చూడలేదు. ఇన్ని ఆలోచనలు వున్నప్పటికీ, వాడివల్ల ఎవ్వరికీ ఎటువంటిచెరుపూ జరగలేదు. చదువును గూర్చి అన్ని ఆశలు పేరపెట్టుకొన్న ఆకుర్రాడు వారానికి రెండుసార్లు వల్లమాలిన జబ్బుపడుతూ వుండేవాడు. వాడిలాగా జబ్బు పడగలగటం మరెవ్వడికీ చేతకాదు కూడను. వాడు వుండేచోటికి పదిమైళ్ల దూరంలో ఎక్కడ ఎవరికి ఏవ్యాధివచ్చినా, వీడికీ వెంటనే అదివచ్చేసేది ఆరావటంలోనూ ఏదో మామూలుగా కాక, మహా వుధృతంగా వచ్చేసేది. వాడి తత్వం అదేమితత్వమో కాని, దట్టంగా మంచుపడే నవంబరు డిసెంబరు నెలల్లోకూడా, వాడికి ఒక్కసారి వీధిలోకి వెళ్లివస్తే చాలు వడదెబ్బ కొట్టేది.

సిరుడేకాబోలు పళ్లబాధ పడలేక, వాడికి ఇంత మత్తుమందుయిచ్చి, నోట్లో పళ్లన్నీ వూడ పీకించేసి, పెట్టుడుపళ్లు పెట్టించారు. తీరా పళ్లు పీకించేశాక ఆపీడపోయి, చెవిపోటు లంకించుకొంది. వాడి జన్మలో యింతవరకు ఏఒక్కరోజునా పడిశెం లేకుండా వుండలేదు. అప్పుడెప్పుడో ఆటలమ్మ పోసినప్పుడు మాత్రం, ఒక్కతొమ్మిది వారాలపాటు వాడి ముక్కు ఎండిపోయింది. 1871 లో దేశమంతటా కలరావ్యాధి మహా వుధృతంగా వచ్చింది. అదేమి ఆశ్చర్యమోకాని, మాపేటలోమాత్రం చాలా రోజులవరకు ఒక్కకలరాకేసు అయినా, రాలేదు. అటువంటిది యీ 'స్టివింగ్స్'కి ఎప్పుడు వచ్చేసిందో, ఎల్లా వచ్చేసిందో, కలరా వచ్చింది.

ఎప్పుడు చూసినా ఏదోఒక జబ్బుతో వీడు మంచం మీదనే పడివుండేవాడు. సంవత్సరం పొడుగునా పథ్యం మెతుకులే! పెద్దవాళ్లు తనని లాటిన్ పాఠాలు చదవనియ్యలేదనీ, జర్మన్ గ్రామరు పుస్తకం తనచేతిలోనుంచి లాగి అవతల పారేశారనీ, దిండులో తలదూర్చి యెప్పుడూ కుళ్లికుళ్లి ఏడుస్తుండేవాడు.

చదువుకోసం వాడు అంత అఘోరిస్తుంటే మేమంతా ఒక్కరోజైనా జబ్బుపడగలిగితే ఎంత బాగుండు ననుకొనేవాళ్లం. ఆ ఒక్కరోజు జబ్బు పడటంకోసం, కావాలంటే, పదినెలల స్కూలు జీవితాన్ని త్యాగం చెయ్యమన్నా చేసేసే స్థితిలో వుండేవాళ్లం. పేలిపోయే జ్వరం రాకపోతేమానె, కనీసం ఏ మెడ బెణుకో అయినా పట్టితే, అదైనా సాకుగా తీసుకొని బడి మానెయ్యవచ్చునని వువ్విళ్లూరిపోయేవాళ్లం. బడివున్న అన్నిరోజులూ వడగాడ్పులలో, వొళ్లూపై తెలియకుండా, వీధుల్లోపడి కుక్కల్లా తిరిగితేనైనా, యీపాడు వంటికి ఏదైనా రోగం వస్తుందేమోనని తెగ తిరిగేవాళ్ళం. ఊహు! అల్లాంటి దేదీ జరగక పోగా మాలో మాంచి వుత్సాహం పుట్టుకొచ్చేది. ఇంకా ఏ ఏ పనులు చేస్తే, మామూలుగా మనిషి అన్నవాడు జబ్బుపడతాడో అవన్నీ చేసేవాళ్లం. ఎన్ని చేసినా జబ్బుపడకపోగా యీచేసిన పనుల మూలంగా మాకు ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చి తెగతినేవాళ్ళం. దాంతో అంతకుముందు పూచిక పుల్లలావున్న వాళ్లమల్లా, దుండుముక్కల్లా తయారయ్యేవాళ్లం. పరీక్షలు పూర్తిఅయి, అందరికీ శెలవులిచ్చేరోజువరకూ, మేము వేసిన యీ ఎత్తుల్లో ఒక్కటీ పనిచేసేదికాదు. కాకపోగా సరిగ్గా శెలవులిచ్చినరోజు, మా అందరికీ వున్నట్లుండి అమాంతం రొమ్ముపడిశెం పట్టేసేది. దానిమీద గుండెలు బద్దలు అయ్యేటట్లుగా కోరింత దగ్గు తగులుకొనేది. ఇంకా ఏవేవో అనేక రకాలైన రుగ్మతలు వొంట్లో ఒక్కసారిగా ప్రవేశించి, మళ్లా బడి తెరిచే రోజు వచ్చేవరకు, మమ్మల్ని పట్టుకు వేధించేవి. అంతవరకు ఏమందువేసినా తగ్గని యీ రోగాలన్నీ బడి తెరిచేరోజుకి, ఏమందూ వేయకుండానే మటు మాయమై పోయేవి. కనీసం నీరసమైనా మిగలకుండా యిదివరకటికంటే ఎక్కువ బలంగా కనిపించే వాళ్ళం.

అసలు మానవ జీవితమే అంత! మనకి అగోచరమైన శక్తి ఏదో అనుక్షణమూ మన జీవితాలతో యిలాగే చెలగాటం ఆడుతుంటుంది.

ఇందాక చెప్పిన ఆకొయ్యబొమ్మల విష

యానికి మళ్లా వద్దాం. ఎట్లాగైనా మన పూర్వీకులకి కళల్లో చక్కని అభిరుచి వుండేదనిపిస్తుంది. అందాకా ఎందుకూ — ఈవేళ మనం మ్యూజియాలలో అతి భద్రంగా దాచిపెట్టుకునే ప్రాచీన వస్తుసముదాయమంతా నాలుగైదువందల ఏండ్లక్రితం, మన పూర్వీకులు అతి సామాన్యమైన వస్తువులుగా ఎంచుకొన్నవే. కొందరు కొందరు కొన్నివందల ఏండ్ల క్రితం వాడుకలోవున్న కంచాలనీ, దీపపు సెమ్మాలనీ అతి జాగ్రత్తగా దాచిపెట్టుకొంటారు. ఇంటికివచ్చిన మిత్రుల కందరికీ వాటిని చూపించి మురిసి పోతుంటారు. దీనికంతకీ కారణం ఆ వస్తువులో ఏదో ప్రత్యేకమైన అందం వున్నదని కాదు: కేవలమూ వాటికి కొన్నివందల ఏళ్ళ చరిత్రవున్నదనిమాత్రమే.

జరిగిపోయిన శతాబ్దాలనాటి వస్తుసముదాయాన్ని గురించి మనం యిలా మాట్లాడుకొంటున్నాం కానీ, రాబోయే యుగాలలో కూడా పరిస్థితి యిలాగే వుంటుందా? ఈనాడు మనం అతి సామాన్యమైన వస్తువులుగా పరిగణించే యీకంచాలు సిబ్బిరేకులు అన్నీకూడా క్రీ. శ. 2000ల సంవత్సరాల నాటికి, అమూల్య వస్తువుల జాబితాలో చేరిపోకుండా వుంటాయా? ఈరోజున మన యిళ్లల్లో వుండే చంటి పిల్లలు ఆటకాయితనంగా బద్దలుకొట్టే యీపింగాణీకప్పుల నన్నిటినీ, కొన్నివందల సంవత్సరాలు గడచిపోయాక ఎవడో ఒకడు తవ్వి పైకితీసి, యీతుంపులన్నిటినీ అతిజాగ్రత్తగా అతికించి, అది వూడిరాకుండా వెండికట్లు వేయించి ప్రాణప్రదంగా దాచిపెట్టుకోక పోతాడా ?

నేను అద్దెకి వుండే యింట్లో, నా పడకగదిలో, మేజామీద పింగాణీతో చేసిన కుక్కబొమ్మ నొకదాన్ని మాయింటి యజమానురాలు పెట్టించింది. దానివొళ్లుఅంతా తెల్లగావుంటుంది. కళ్లుమాత్రం నీలంగా వుంటాయి. ముక్కు చివరిభాగం మాత్రం కొంచెం జేవురించినట్లుంటుంది. దానిముఖంలో కనిపించేభావం—అదిస్నేహమో, లేక స్వభత్వమో గట్టిగా తెల్చి చెప్పలేం. నామటుకు నాకు ఆబొమ్మఅంటే అంత యిష్టంలేదు. పోనీ అందులో కళఏమైనా కనిపిస్తుందా అంటే — అలాంటిదేమీ లేకపోగా, ఆదృష్టితో దానికేసి చూస్తే ఎవరికైనా చిరాకు పుట్టుకొస్తుంది. దీన్ని చూసి సామిత్రుల్లో కొందరు ఎగతాళి కూడా చేశారు. దాన్ని తెచ్చి అక్కడ పెట్టిన మాయింటి యజమానురాలికి కూడా అదంటే అట్టే అభిమానంలేదు. కాని తన మేనత్త తనకది బహూకరించింది కాబట్టి, అట్టేపెట్టక తప్పటంలేదని ఆవిడ నాతో ఎన్నోమార్లు చెప్పింది.

ఒక్క రెండు వందల ఏళ్లు గడిచాక, యీకుక్కబొమ్మనే ఎవడో ముందుయుగంమనిషి భూమిలోనుంచి తవ్వి పైకి తీస్తాడు. అప్పటికి దానికి కాళ్లు నాలుగూ విరిగిపోయి వుంటాయి. తోక అసలే లోపించి వుంటుంది. అయినా సరే, ఎంతో జాగ్రత్తగా తీసి దాన్ని అద్దాల పెట్టెలో పెట్టి ఎవరికో ఒకరికి అమ్ముతాడు. నాటినుంచీ దాన్నిచూసిన ప్రతివాడూ దీంట్లో ఎంతకళ వున్నదోనని చాలా ఆశ్చర్యపోతాడు—దాని ముక్కుమీద వున్న ఆజేగురు రంగును చూసి, 'ఎంత అర్థయుక్తంగా వున్నదా' అని విస్తుపోతాడు. అతోక కూడ విరిగిపోకుండా వుంటే యీబొమ్మ యింకా ఎంత బాగుండేదో వూహించుకొని మూర్ఛపోతాడు:

ముందుయుగాల మనుష్యుల జీవితాన్ని యింతగా కదిలించివేసే యీ బొమ్మని, యీరోజున మనం అతి సామాన్యమైనదానినిగా చూస్తున్నాం. అంటే అందుకు కారణం—దాన్ని మనం ప్రతిరోజూ చూస్తూ వుండటమే. ప్రతిరోజూ చూసే సూర్యోదయ సూర్యాస్తమయ దృశ్యాలలా, యిది మన నిత్యజీవితంలో మామూలువిషయమైపోయింది. అదే ఏ 2288 వ సంవత్సరంలోనో చూస్తే దీని పరిస్థితి పూర్తిగా మారిపోతుంది. అప్పటికి యీకుక్కబొమ్మలని తయారుచేసే 'కళ' అంతర్ధానమైపోతుంది. మన ముని—ముని మనుమలు దీన్ని చూసినప్పుడల్లా, వాళ్ల ముత్తాతలకి ముత్తాతలమైన మనం యింతచక్కని కళాఖండాన్ని ఎలా తయారుచెయ్యగలిగామో నని ఆశ్చర్యపోతారు. మనతరాలనిగురించి మాట్లాడవలసివచ్చినప్పుడల్లా పదొమ్మిదవ శతాబ్దపు కళాకారులుగా మనని జమకట్టి, మనపట్ల గౌరవభావం పుట్టిపడేలా మాట్లాడతారు.

నాఆలోచనలు సరిగ్గా యీదశకి వచ్చేసరికి హారిస్సుగాడికి ఏం వచ్చిందో ఏమో, చేతిలోవున్న

# కవిసార్వభౌముడు

(19-వ పేజీ తరువాయి)

యపై ఉర్పించుకొనుచుండ, మన యెదుటనే ఆ 'క్షేమకారి' కన్నీరు కార్చుతూ పోతున్నది.

నేను, "క్షేమకారి ఎవరో గెంటేసినట్టుంది. అందుకే ఏడుస్తోంది కాబోలు," అన్నాను.

"లేదు శేషూ. అది మొదటే ఏడుస్తూ వుండినది. దాన్ని వెంబడించి కారణం కనుక్కుందాం"

"నీకెవరో చెప్పి - పూరకుండిరా"

వాణ్ణి బలవంతంగా లాగుకొని 'క్షేమకారి' వెంబడబడ్డాము. మమ్మల్ని చూచి మొదట ఆమె భయపడినప్పటికీ, మా నాయనగారు 'దక్షిణ' చెల్లించిన మాపై ఏదో గౌరవం కలిగియున్నట్లు కానవచ్చింది.

"ఏం, ముసలమ్మా వచ్చేస్తివి" అన్నాను శేషయ్య.

"ఏమో నాయనా... మీరు వచ్చేసినారే."

ఊక్క ఎక్కువయింది. తాళలేక వచ్చేశాను. "నువు ఏడుస్తూవుంటే కారణమేమో కనుగొనవచ్చునని. ఎందుకు, అక్కడ ఎవరైనా ఏమైనా అన్నారా?"

"ఏమీ లేదు బాబూ" అని రెట్టించి విడిచింది. నా కుతూహలం హెచ్చింది. నేను పూరుకోకుండా "కాదు ముసలమ్మా, నీకెందుకో దుఃఖం, ఏదో రామా కృష్ణా యని మూలనుండక సభలూ సమావేశాలు.."

ముసలమ్మ కంట్లో ఏకధారగా కన్నీరు.

"బాబూ... వారు.. మధురకవి... నాకు తెలియును... అందుకే దుఃఖం కలిగింది."

మాకు ఆశ్చర్యం కలిగింది.

"ఎట్లు తెలుసునమ్మా—మీ యింట్లో వారికెవరికైనా వారి మైత్రి వుండిందా?"

"పరిచయ మేమిటయ్యా - వారే నా భర్త"

ముసలిది, ముఖం మూసుకొన్నది.

మా నోట మాటలే రాలేకపోయినవి. నా కళ్ళలో అశ్రుధార ప్రవహిస్తున్నది. ఆమె రెండు పాదాలూ పట్టుకొని

"తల్లీ మీరు గురుపత్నులు. అట్టి కవిపత్నికి భిక్షాపాత్ర నిచ్చి, గోపల ఉత్సవాలు చేస్తున్నాము. పక్కనున్న బజార్లో నొకదానిని మాట్లాడి ఆమెను కూడా తీసుకొని శేషయ్య యింటికి వెళ్ళితిమి.

నాటినుండి ఆమెకు 'క్షేమకారి' యను పేరు, భిక్షాటనం తప్పింది. లోకమంతా ఒకరీతిగా మధుర కవి వుత్సవం జరుగుతూంటే శేషయ్య తనదేయగు విశిష్టతతో కవి జయంతి చేస్తున్నాడు. ఈ రెంటిలో మధురకవి దేనిని మెచ్చుకొనియుండునో?



కాబోయే పెండ్లి కొడుకు: (తన మిత్రునితో) "పెళ్లిరోజు దగ్గర పడుతున్న కొద్దీ భయం వేస్తున్నదిరా!"

మిత్రుడు: "ఏం?"

పెండ్లి కొడుకు: "మరేమీ లేదు. నాకు వుండటానికి యిల్లేలేదు. రేపు పెళ్లిఅయితే ఎల్లాగా అని!"

మిత్రుడు: "దానికేం! ఆదాకా మీ మామగారి యింట్లోనే వుండిపో!"

పెండ్లి కొడుకు: "మా మామగారు యిప్పటికీ వాళ్ల మామగారి యింట్లో వుంటున్నాడు."

— శ్రీ ఎ. శ్రీనివాస (నెల్లూరు)

# ముచ్చటగా ముగ్గురు

తెల్లని సీటింకే విసిరేసి, కూర్చొన్న బల్లమీదనుంచి లేచిపోయి వెల్లకితలా పడుకొని కాళ్లు పైకెత్తి గాలిలో ఆడించటం మొదలుపెట్టాడు. ఈ వికారచేష్టలు చూసి మూంటీ మొరస్సి 'భౌంయ్' మని ఒక్కసారిగా మొరిగి, తానూ గాలిలో ఒక పిల్లిమొగ్గతం వేసి, మా సామాను పెట్టిన సంచిమీదికి పోయి పడింది. దాంతో ఆ సంచిమూతి వూడిపోయి, అందులోవున్న సామానులన్నీ చెల్లాచెదురుగా పడవలో పడిపోయాయి.

ఇదంతా చూస్తే నాకు చాలా ఆశ్చర్యం వేసింది. అందరికీ వచ్చేటట్లుగా కోపంమాత్రం రాలేదు. అందుకనే పెదిమెలమీదికి వీలయినంత నవ్వు తెచ్చిపెట్టుకొని "ఏమిట్రా యీ వెధవ వేషాలన్నీ?" అన్నాను.

"వెధవ వేషాలా? వెధవవేషాలు" ఆతరువాత వాడు దొర్లించిన పదాలు ఇక్కడ నేను వ్రాయను. వ్రాయటానికి వీలులేని బండబూతులు తిట్టాడు. తప్పంతా నాదే కావచ్చు: నేను అందుకు ఒప్పుకొంటాను. కాని, అవతలవాడు ఎంత తప్పు చేసినా, నోరు పాడైపోయేటట్లు ఇట్లా బూతులు తిట్టటం ఎవరికీ మంచిదికాదు-అందులోనూ సంప్రదాయమైన కుటుంబంలో పుట్టిపెరిగిన హారిస్సులాంటివాడికి అసలే తగదు.

(ఇంకా వుంది)

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి






























అల్పబుద్ధులగు కోతిమూకలూ - చెవులపిల్లిపై లంఘించినవి.- హితవాక్యములను వుపదేశించిన ఆ- శశకరాజమును చంపివేసినవి







